REHB02P409

సకలానంద గ్రంథమాలిక
13 వ పుష్పము
సంపాదకుడు :
సత్యవోలు రాధామాధవరావు.

# శ్రీమదాంధ్ర చంపూభాగవతము.

అభినవకాళిదాసమహాకవి సంస్కృతకావ్యమునుండి

సత్యవోలు సోమసుందర కవిగారిచే

నాంధ్రీకరింపబడినది.

---

సకలానందసమాజము

సత్యవోలు రాధామాధవరావుగారిచే

ప్రకటింపబడినది.

---

కాకినాడ:

సుజనరంజనీముద్రాశాలయందు

ముద్రింపఁబడినది.

1935



వెల 1—0—0.

# విజ్ఞాపనము.

—:O:—

శ్రీమజ్జనకులగు సత్యవోలు సోమసుందరకవిగారు నా కోరిక నంగీకరించి సంపూర్ణముగా నాంధ్రీకరించిన యిట్టి శ్రీమదాంధ్ర చంపూభాగవతమును మొదటినుండి తుదివరకు వారు వ్రాసిన పుస్తకప్రతినిబట్టి నకలువ్రాయుచు వారిలో శతాంశమైనను బోలజాలనియసమర్థుడనైనను వారు మొదట నొకమాఱు వ్రాయుటయేగాని మఱల వ్రాతలోని స్వల్ప దోషములైన సవరింపకయే స్వర్గస్థులగుటచే మిగుల చింతించి కుమారుడనగుటచే దానిభారమంతయు నాపైబడియుండ నే నసమర్థుండనైనను గురుపితృభక్తిచే వదలజాలక శ్రీమత్పరమే శ్వరుని మా తండ్రిగారిని ప్రతిపదంబునం దలంచుకొనుచు నేనేవిధముగను వారిఋణము దీర్పజాలనివాడనగుటచే వారు దెల్పిన విద్యాబుద్ధులను మాత్రము వారి గ్రంథప్రకటనకై యుపయోగించి నా శక్తికొలది సవరించి ముద్రించి ప్రకటించినాడను. ఆంధ్రసోదరు లెల్లరు దీనిం గైకొని యానం దించుటయేగాక వీరి యముద్రితగ్రంథముద్రణకై సాహాయ్య మొనరింతురని నమ్ముచున్నాను.

యీ గ్రంథ ముద్రణకై నాకు బంధుమిత్రులైన శ్రీ సుజనరంజనీ ముద్రాశాలాధికారులు, శ్రీ పోతాప్రగడ కనకరాజుగారు తగిన ప్రోత్సాహ మొసంగి త్వరలోముద్రించి నన్నుకృతార్థుని జేసినందుకు నే నెంతయు కృతజ్ఞుడను. ఇంకను నిట్టి శాశ్వతగ్రంథము లనేకము లిందుప్రకటింపబడుగాక!

కాకినాడ,
26-11-35.

వీణాకళాప్రవీణ,
సత్యవోలు రాధామాధవరావు.
కొత్తపల్లి—పిఠాపురము.



అభినవ పోతరాజ

శ్రీ సత్యవోలు సోమసుందరకవి గారు.

# గ్రంథాభిప్రాయము.

---

శ్రీ సత్యవోలు సోమసుందరకవిగారు ఆంధ్రీకరించిన శ్రీమదాంధ్రచంపూభాగవతమును చదివి చూచితిని. వీరు నాకు చిరపరిచితులు. వీరు సంగీతసాహిత్యములం దసమాన పాండిత్యము కలిగి, వచనాంధ్రకాదంబర్యాది గ్రంథములు పెక్కు రచించిరి. కవితాధార ప్రాచీన ప్రబంధములవలె మిగుల మృదుమధురమైనది. ఇందలి పద్యములు ఆంధ్రీకరణము లయ్యును స్వతంత్రరచనగా పోతనామాత్యుని భాగవతములోని పద్యములవలె కర్ణామృతములుగా నున్నవి. సంస్కృతములో 14 వ శతాబ్దమున అభినవకాళిదాసమహాకవిచే రచియింపబడిన యీ భాగవతచంపువునందలి శ్లేష యమకాదులకు సమగ్రముగా నిట్లు తెనుగునగూడ సులభశైలిని రచించుట వారి కవితామహిమను దెలుపుచున్నది. వీరిని అభినవపోతరాజనవచ్చును. వీరి యముద్రితగ్రంథము లింకను చాల గలవు. ప్రకటించుభారము భాషాభిమానులదై యున్నది.

ఈ గ్రంథము విద్యార్థులకుగూడ పాఠశాలలలో పఠనీయగ్రంథముగా నేర్పరచదగినదై యున్నది.

ఇట్లు,
కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి.
27—11—35.

౧

# పీఠిక.

శ్రీమన్మహీమండలంబునకు మండనప్రాయులై మున్ను వన్నెకెక్కిన గీర్వాణభాషా విశేషజ్ఞులగు పండితోత్తము లనేకులు తమ లలిత కవితా చాతుర్యంబున సరస వచన రచనా చమత్కృతులలర మృదుమధురశైలిని భక్తిజ్ఞానవైరాగ్యబోధకంబులును చతుర్విధపురుషార్థసాధకంబులు నగు సంస్కృత కావ్యంబు లెన్నియో రచియించి యుండిరి. అందు రామాయణ భారత భాగవతాది పురాణపుణ్యకథలనుండి మఱికొందఱు చంపూప్రబంధంబులుగా రచియించియుండిరి. అట్టివగు నాయాప్రబంధంబులలో గొన్నిటి కిటీవల సంస్కృతాంధ్ర విద్యాసాంద్రులగు సత్కవీంద్రులు తెనుగుగావించి వెల్లడించిరి. విద్వత్కవులలో మిగుల ప్రసిద్ధిగాంచిన యీ యభినవ కాళిదాస కవివరేణ్యుడు రచించి యున్న శ్రీమద్భాగవత చంపూప్రబంధము మాత్ర మింతవరకు తెనిగింపబడి యుండలేదు. ఇందు కవితాచాతుర్యంబును లోకజ్ఞాన సంపన్నతయు బ్రహ్మజ్ఞానసంపదయు భక్తిప్రపత్తియు బెంపుమీఱుచుండె. మఱియు శబ్దశ్లేషార్థశ్లేషాలంకారాదులతో గూడ "జీవితం వ్యంగ్యవైభవం" అనురీతి బ్రితిపద్యగద్యంబులందు ధ్వనియే ప్రధానముగా నెంచి చిత్రవిచిత్రంబులగు యమకాదులతో సరసతరంబుగా రచింపబడియున్న యీ ప్రబంధంబు మిగుల

భగవద్గుణానుభవముగలదగుటచే తలచుచు నే దీనింజదువుకొని యానందించుచు "ఏకఃస్వాదునభుంజీత" అనునట్లు యిది తెనుగుగావించిన నెల్లవారల కుపయోగించుటయేగాక మహా కవి భట్టబాణుని కాదంబరి తెనిగించిన నా కిపుడీ హరిచరిత భరితంబగు దీని నాంధ్రీకరించిన మజ్జన్మపావనంబగుగదా! యని దలంచుచుండ నాయైదవ కుమారుడు చిరంజీవి రాధా మాధవరావు భాగవతచంపూప్రబంధము నాయొద్దనే పాఠం బుగా జదువుకొనుచు నొక్కనాడు కాదంబరివలె, నిదిగూడ మీరు తెనుగుకావ్యంబుగా రచించిన నెల్లరకుం దెలియునని యు భగవద్గుణానుభవముగలదగుటచే నిహపరసౌఖ్యదాయ కంబైనదనియు నన్ను మఱింత ప్రోత్సాహపరుచుటంజేసి దుస్తరకార్యంబైనను మదిష్టదేవత యగు జగన్మాత యగు శ్రీ శాంకరి నారాధించి తత్కరుణా కటాక్ష వీక్షణంబున ధైర్యంబునవలంబించి దుందుభినామ సం॥ర శ్రావణ శు॥ 15 పౌర్ణమికిప్రారంభించి మాఖ శు॥ 15 పౌర్ణమివరకు పూర్తిగా నాంధ్రీకరించి సర్వశుభంబు లొసంగు మదిష్టదైవంబులైన శ్రీమదుమామహేశ్వరులకు పుష్పమాలికగా నీకృతి సమర్పిం చితిని. పండితజనులెల్ల దీనిం జదివి ఆనందింతురుగాక.

క. తప్పులు దీనం దడవినఁ
 గుప్పలుగానుండవచ్చుఁ గోవిదులెల్లన్
 మెప్పొకటియెకనుగొని చా
 మెప్పుడు నామోదకలన నెనయుదురుగదా !

గీ. రమ్యతర నవరత్నాకరంబుజేరి
 మంచిముత్తెంబులను సంగ్రహించుకొనక
 కూటిమిని నత్తగుల్లలు గోరుచున్న
 కొంగలకుసాటి గానరొకో! కుకవిజనులు.

గీ. భవ్యకాదంబరీరస భాసురాబ్ధి
 మగ్నతనుగొన్న నేనిప్డు మఱలి పైకి
 సారతర హరిగుణ జాలసంగతిగొని
 వచ్చి పరిశుభ్రముగ జగత్పావనముగ.

గీ. భాగవతపుణ్య సత్కథా భవ్యమైన
 రసతరంగిత గంగాఝురంబునందు
 మజ్జనసపావనంబుగ మజ్జనమును
 సేయుచున్నాడ నిపుడెంతొ హాయిమీఱ.

దిః 15—1—1923,
కొత్తపల్లి, పిఠాపురము,
గోదావరిజిల్లా.

ఇట్లు విధేయుడు,
సత్యవోలు సోమసుందరకవి.

1

శ్రీరస్తు.

# విషయసూచిక.

పేజీ

శుభమస్తు. శ్రీరస్తు. అవిఘ్నమస్తు.

శ్రీ శాంకరీదేవ్యై నమః

# ఇష్టదేవతా ప్రార్థనము.

---

ఉ. శ్రీమదుమామహేశ్వరుల, శ్రీసతి, శ్రీపతి, వాగ్విధాతలన్
సామజవక్త్రు షణ్ముఖుని శక్రముఖావళిఁ బూర్వసత్కవి
స్తోమమునిప్డు నా సుకవిసూరుల ధీరుల సంస్కృతాంధ్ర వి
ద్యామహితాత్ములన్ గొలుతు నంచితమత్కవనప్రశస్తికై.

సీ. శ్రీమీఱుమణిరాజ శేషపన్నగరాజ
భూషణుల్ శ్రితజన పోషణులును
సరసతరోల్లాల సల్లాపమంజుల
భాషణుల్ ఖలజన భీషణులును
సతతనమజ్జాత సంజాత పాతక
శోషణుల్ సురవైరి రోషణులును
చంద్రసూర్యాగ్ని లోచనదీప్తిఘనతమః
పేషణుల్ ఖండిత దూషణులును

గీ. నయిన మహితులు శబ్దార్థనియతిరీతి
సంతతాన్యోన్య సాంగత్య సహితులగుచు

నెసఁగు శ్రీపార్వతీ పరమేశులు మము
సాంద్రసంపదలిడి బ్రోచుచుందురుగాత!

ఉ. శ్రీకరులై సదాశ్రితవశీకరులై తగు తల్లిదండ్రులౌ
మీకు నుమామహేశులకు మెండుగ బువ్వులదండరీతి నే
నీకృతిఁగాన్కఁ జేసితి రహిన్ గొని మీరెద దాల్చి నిత్యశో
భాకరలీల మోదమెనయన్ ననుమాలికఁ బోలె నేలుడీ!

చ. మఱిమఱి సౌరభంబిడెడు మల్లెలు మొల్లలు జాజిపూలు గ
ప్పురపురజంబుగస్తురియుఁబుప్పొడినొప్పగగుప్పచొప్పునన్
సరసపదార్థముల్ ధ్వనులెసంగగ రంగగుశైలిగ్రాల మీ
కరుణనెసంగు నాకృతియె గమ్మని కమ్మని తావులీనెడున్.

చ. కనికరమొప్ప నెవ్వడు జగంబుల నేలెడు తల్లిదండ్రులౌ
ఘనులబురాణదంపతులఁగాంక్షితదాయకులౌనుదారులన్
దనరు నుమామహేశులసదామిము నెమ్మదినమ్మికొల్చునం
దనుఁడను నన్ను బ్రోవుడు సదాశివులార! సదాదరంబునన్

చ. సురుచిర సత్యవోలు కులజుండను వెంకటరాయమంత్రి స
ద్వరతనయుండ నాంధ్రకవితా మృదుగాననిదాన శాంకరీ
పరమకృపారసంబునకుఁ బాత్రుడ వెంకటజగ్గరాయ భూ
వరుని నిజాశ్రితుండ బుధవర్గవిధేయుడ సుందరాఖ్యుడన్.

చ. వరపరతత్త్వవేది యరివర్గవిదారణమోది యింద్రియో
త్కరమదభేది సత్త్వగుణ తత్పర తామితవా[illegible]సు

స్థిరకరుణానివేది స్వవశీకృత శుభ్రమనోవినోది మ
ద్వరమతి జ్యేష్ఠసోదరుఁడు భాసిలు వెంకటరావభిఖ్యచేన్.

సీ. రమణీయమైన కిర్లమపూడి యాస్థాన
కవివరుండను ఖ్యాతిగాంచెనెవఁడు
తదధినాయక బుచ్చితమ్మయచిన్నరా
ట్ప్రభు గౌరవాదుల బడసెనెవఁడు
వారిచే సత్కృతుల్ బడయుచు నెన్నియో
సుకృతులొసంగిన సుకృతి యెవఁడు
శ్రీతికంఠుచరితంబు సొగసుగాఁగల్పించి
వాసిమై బుధులెన్న వ్రాసెనెవఁడు

గీ. మించి మఱికొన్ని తెల్గొనరించె నెవ్వఁ
డనఘచరితుఁడు కామేశ్వరాహ్వయుండు
దనరునాదు కనిష్టసోదరుఁడతండు
సిరులు సంతతులలరారఁ జెన్నుమీఱు.

గీ. వీరలకు నగ్రజుండనై వెలయుచుంటి
సోమసుందరకవియన సొబగుమీఱ
నాంధ్రకాదంబరీ ముఖ్యమైనగద్య
పద్యకావ్యంబులను వ్రాసి వాసిగాంటి.

సీ. ఘనసాహసౌదార్య గాంభీర్యనిధిసోమ
...రాణ్మంత్రి యేకవిరాజుతాత

నయగుణ విద్యావినయశాలి వెంకట
రాయుడే సత్కవిరాజుతండ్రి
సద్గుణసంతాన సంతానవల్లియా
రామాంబ యేకవిరాజుతల్లి
రావువెంకటజగ్గరాయాహ్వయ మహిత
లేంద్రుడే కవిరాజు నేలురాజు

గీ. అట్టి శ్రీసత్యవోలు వంశాబ్ధిచంద్రు
సరససంగీత సాహిత్య సత్కవిత్వ
సరసమతిసాంద్రు సోమసుందరకవీంద్రు
ననునయగుణకదంబ జగదంబ మనుచుగాత!

---

2

శుభమస్తు. శ్రీరస్తు. అవిఘ్నమస్తు.

శ్రీశాంకరీదేవ్యైనమః

# శ్రీమదాంధ్ర చంపూ భాగవతము.

## ప్రథమవిలాసము.

### దైవప్రార్థనము.

సీ. శ్రీ లాలితాలాప శైలేశ బాలా వి
లాసానుకూల కలావిలోల!
కలితగంగాఝరీకల్లోల జాలార్ద్ర
లలితహిమ భానుమాలా జటాల!
దోషావళీతమఃపూషాయిత సువేష
సాహితీపోష శేషాహిభూష!
సారసుధాసారధారానుకార స
త్కారుణ్య రసపూరఘనవిహార!
గీ. రచితనతభద్రభవ్యముద్రావినిద్ర
యక్షయాక్షుద్ర రుద్రాక్షహతవిపక్ష
దివ్యమంగళయుత శివదేవతహిత
నతతకళ్యాణములు మాకొసంగుగాత!

చ. అవనిహిమాద్రి భాగ్యనిలయంబు సమస్తశుభాస్పదంబు శ్రీ
భవుని తపఃఫలంబు శుకభాషలచే ముదితంబు సాదరా
ప్తవిశదమస్త సద్ఘన సుధాకర భూషణకంబు నమ్మహాం
బవిరళమోద కందము శుభావళిమాకిడి బ్రోచుగావుతన్.

చ. అరుదగు ఘోరనేత్రములు నయ్యహిరాజవతంసమున్ జటా
భరముఁ గపాలమూనుభగవంతుఁడ!యెవ్వఁడవీవులోనికిన్
గరిమను దేవియాజ్ఞ గొనకన్ జనరాదని ద్వారపాలు రీ
వరుసను బల్కుచుండ పురవైరిని గాంచియొనర్చునట్టి నీ
చిరునగవెప్డు మాకుశుభ సిద్ధులొనర్చునుగాత మాతరో!

చ. స్మరవర కేళికోపమును శాంతినొనర్పగ క్షేమకారి శం
కరుడువినమ్రిడాలను సకౌతుకయయ్యును తత్రజాహ్నవీ
గురుతర దర్పలీలగని కోపమునొందుచు నబ్జమర్మ భీ
దరసిక మేపదంబునను దన్నితివో! యలచంద్రశేఖరున్
సరగున నట్టినీపద మొసంగుత మాకుసిరుల్ సదా శివా!

మ. ధృతినన్యోన్యజయంబు గోరుచు శివాదేవీ శివుల్ నవ్వుతో
నతులానందముతోడ సాహసముతో నన్యోన్యసంపర్క సం
భృతరోమాంచముతో ససంభ్రమముగావిక్షిప్తనిక్షిప్తసం
గతి నవ్యాక్ష కరాబ్జులై నెరపు నక్షక్రీడయందొప్పు శ్రీ
యుతసంరంభము మాకొసంగుతసదాత్యుద్వేలమా శ్రేయముల్

గీ. భద్రితనువు విభూతిచే బరగనేమి
చీరపై పులిరోమముల్ జెలగనేమి

యనుచు చెలులెల్ల హాస్యవాక్యములు వలుక
నవవధూమణి యగునట్టి శివయొనర్పు
మంధహాసమొసంగుత మాకుసిరులు. 6

గీ. త్ర్యంబికకుఁ బేర్మి మూడవతనయుఁడైన
ఘనమహాకవి యభినవ కాళిదాసు
భూరిహారిగుణబంధ చంపూప్రబంధ
మామెదయచేతఁ బ్రేరితుఁడై రచించె. 7

ఉ. బాలునిలీల నల్పముగ బల్కెడునాదగు బుద్ధియెంత వా
క్పాళులకందరాని యదు వర్యుని సచ్చరితంబదెంత హా!
చాలగనెంచి వర్ణనము సల్పెడు నాదగు సాహసక్రియా
లీలనుబోలు దానిగన లేదెచటన్ వినలేదు ధారుణిన్. 8

ఉ. శ్రీకర సత్కృపారస ఝరీ పరిపూరిత మాకరంద శో
భాకర పారిజాత కుసుమాళి సమంచిత మాల్యతుల్య గా
రీకరుణాకటాక్షలహరీ ముఖరీకృత సన్ముఖుండ నా
కేకృతినైన దుష్కర మదెట్లగుచుండునుముజ్జగంబులన్. 9

గీ. గురుతరంబగు శాంకరీ కరుణచేత
నాదువదనంబునుండియు నవ్యభవ్య
కలితసూక్తులు జనియించుగాత! యేమి
వింత! కఠినతగల చంద్రకాంత శిలయు
గరగిసుధజిల్కదే సుధాకరకరాప్తి. 10

చ. గురుగుణదోషముల్ మిగులగూరిమినెంచి దయార్ద్రచిత్తులై
దొరకొనుడెందు సద్గుణమె దోషమువీడుడుసూరులార! శం

కరుఁడు కళంకితాంశమును గైకొనకెంతయు శుభ్రమౌ సుధా
కరవరఖండమౌ దలను గారవమొప్ప ధరింపలేదొకో. 11

ఉ. శ్రీరమణీశ వర్ణనలు సేయఁగఁ బూనియు గాఁ ప్రియుధర్మ శృం
గారము మాఘముఖ్యతర కావ్యములందున బోలెఁ జెప్పలే
దూరక నిందికేమనఁగ నొప్పఁగ నా ప్రతిశబ్దమందు శ్రీ
శౌరియుదారతాది గుణసంపద బెంపు వహింపుచున్ జమ
త్కారముగా నపారమగు కావ్యసుధాఝరి బారుచుండె దా

గీ. అలకథనుగూర్చ నవ్యంజనాద్యసార
పద్దెములు మూడునాల్గు గన్పడునో లేవో
అంతమాత్రినె మత్కావ్యమంత గూడ
నట్టిదెయటంచు గడువెగటందకిపుడు
గనుడు కవులార! ప్రతిపదధ్వనులనరసి. 13

---

## కథాప్రారంభము

గీ. అధికమహిమకు, మహిమకు ననుగుణమగు
రూపమునకును, రూపానురూపచరిత
సుకృతములకుఁ బ్రధానుఁడై శుభదదాన
ధారలననూపముగ మరుధరనొనర్చి
యలపరీక్షిదవనిపాలుఁ డలరె నిలను. 14

గీ. అరినృపచమూచమూరు సింహమతనియని
దనరుకోపాగ్ని కందర్పదర్పహరణ
ముఖకు హరుఫాలలోచనమునను బొడము
వహ్నికి వివర్తమనిజనుల్ వలుకుచుంద్రు. 15

గీ. జగతినానృపు సద్యశః చంద్రసాంద్ర
చంద్రికలచేత ధవళిమజలధులొంద
రహినెపుడు నితరుల కందరానియాత్మ
దుగ్ధజలభేద విద్యబల్ దొడ్డతనము
గాంచెనంచెద్దెంచె రాయంచలెల్ల. 16

గీ. తత్ప్రభుఁబ్రతాపరవి, రిపు ధరణిపతుల
జన్మభవనమునంది యాశ్రియవినాశ
మొందగాఁజేసి ధనపదమొంది పిదప
సౌమ్యుఁడయ్యెను విక్రమతుయవశమున. 17

గీ. ఆవిభుని స్వాతివృష్టిచేనగు యశో ని
భంబులై తగుముక్తాఫలంబులెల్ల
సర్వదిక్పతిమణి మాళిశాణకషణ
మొంది కవివాక్య గుణగుంభమూని హార
మణులుగాదగె దిగ్వధూమణుల కహహ! 18

గీ. ఆలలితు, గురుపాండునదన్వవాయ
సుప్రతిష్ఠగఁ గని గురుసూనుశరని
కరనియమ్యునిగానెంచి పరమకరుణ

జక్రిమునుబూని సదయుఁడై శౌరివేగ
గుక్షికినిజొచ్చి రక్షించెఁ గూర్మిమీర. 19

ఉ. చాలునుఁబెక్కుమాటలు వెసన్ప్రకృతస్థితిగాంచి దైవమూ
ర్జోలెడునయ్యుతండు కలిపూరుషవైభవ జృంభణార్హమా
కాలమునందుగూడ విధికల్పిత పాతకవృత్తినాపుచూ
దాలిమినాల్గుపాదముల ధర్మము వర్తిలజేసెనౌర! దూ. 

వ॥ అపుడట్టిరాజర్షియగు పరీక్షిన్మహారాజు నానావిధంబులును సుధామధురంబులును నగు మధుసూదన కథా విశేషంబుల నాకర్ణించియును నాత్మ పరితృప్తినొందక సకల వేదవేదాంగ పారంగతుండును నిగమతత్వజ్ఞుండును తత్త్వవేత్తలలో నగ్రేసరుండును నుపశమంబుచే విషయాభిలాషంబును శకలంబులుగా వికలంబులుగావించువాఁడును నపరమిత మహిమాన్వితుండును మహితుండును భగవంతుడును బాదరాయణుండునునగు శ్రీశుకయోగీంద్రుంగాంచి సాదరంబుగా నిట్లువచియించెను.

వ॥ ఓభగవంతుడవగు మునీంద్రా! పాండునందన ప్రశంసా మాంసలంబులును, జగదుద్భవ ప్రసంగసంగతంబులును, రుచిరతరంబులగు మురజిదవతారలీలా నికరంబులచే, గరంభితంబులైనవియును, ధృవ, పృథు, పురంజన, చరితభరితంబులును, దక్షాధ్వరవిధ్వంస ప్రపంచంబుచేఁ గంచుకితంబులైనవియును, ప్రియవ్రతచరిత్ర విచిత్రితంబులును ధరణీ

గోళపరిమితి నిరూపణ సురూపితంబులును సముదంచిదజామిళ చరిత కవచితంబులును, వృత్రవధ విధానవృత్తాంత సంధానితంబులును, ప్రహ్లాదకథాకదంబ కందళితంబులును, వర్ణాశ్రమధర్మ మర్మసముదయమేదురంబులును, మకరకాతరీకృత సింధురవరకథానిబంధన బంధురంబులును, దుగ్ధపయోనిధి మథనోదంత దంతురంబులును, బలిబలనియమన కథానుషంగ తరంగితంబులును, మిహిరహిమకరకుల నృపాలగుణపరిశీలన కీలితంబులును, భవదీయవదనారవిందంబునుండి జారుచుండెడు మకరందబిందు బృందంబువలె వెలయుచున్న వాక్సుధారసవిసరంబుతో మిశ్రితంబులును నగు హరిచరితంబులాకర్ణింపబడినవిగదా! మహానుభావా! 21

వ॥ ఇవ్విధంబున నమృతాసారసరసంబగు త్వదీయవచననిచయంబు నాస్వాదించినదయ్యును నాదుమానసంబనెడు మానసచరంబుసముపజాతపరితోషపోషంబుగానిదై యొప్పుచున్నది. 22

వ॥ కావునమిము బ్రార్థింపదగినదికొంచెముగానున్నది. ఈ నేనిపు డాశానితంబినీనితంబ బింబంబులకు దెల్లనగు పట్టుపుట్టంబువలె వెలయు యశోనికురుంబంబుగలిగి యున్నట్టియు, నపారకృపావారిధియైనట్టియు, యదురాజాన్వయంబుననుగ్రహించినట్టియు, సకలలోక హితార్థంబుగానవతరించినట్టియు, సాక్షాద్భగవంతుడును నగు గరుడధ్వజుని

హిమానువర్ణనంబు నాకర్ణించి నిరతిశయసుఖంబు ననుభ
వింపగలనని యభిలాషగలిగి యున్నాడను. 23

చ॥ జనవరుడట్లుపల్కిన వెస౯ శ్రుతికి౯ మధురంబు పోదదం
బుసునగునట్టితద్వచన ముఁ౯విని శ్రీశుకుడాదరంబున౯
బొనరు కృపారసాంబుపరిపూరితసారలసత్కటాక్షవీ
క్షణముల జూచిచూచిసరసంబుగఁజెప్పదొడంగెనయ్యెడన్

ఉ॥ భూరమణా!త్వదీయమగుపుణ్యవశంబునబ్రిజ్ఞయంతయున్
దీరుగఁబక్వమొందె జగతీపతిసత్కథల౯విన౯ మహో
దారపు వాంఛయు౯గలిగె దానికిమానితహేతువైన శ్రీ
భూరియశుల్త్వదీయులగు పూర్వులొనర్చిన సత్తపంబునీ
ధారుణినిట్టిదట్టిదని తప్పకనొప్పుగఁజెప్పశక్యమే. 25

గీ॥ ముఱియునభిమన్యుసుతునతి ముదితుజేసి
గరిమమీరగ నల పారికాంక్షివిభుఁడు
అమితమధురతఁ బూదేనెనణచి వెలయు
వాక్యమిటుబల్కెనాదరభరము మెఱయ. 26

అది యుక్తమేగదా !

చ॥ అరయనలక్షితార్థకములయ్యుశుకాంహ్వయసద్ద్విజోక్తులే
రమసులాలనీయములుగాదగుతన్మృదుసూక్తులెంతయున్
సరసములర్థయుక్తములు శౌరివిలాసకలాయ రూపత౯
గర మలరారుచుండగని క౯వచియింపగ నేలచాలగ౯.27

*చ॥ అచిరపదార్థగౌరవములయ్యెనురాధిగనాశుకనామసద్ద్విజ
ప్రచురవచచ్ఛమత్కృతులు భాసిలివీనులకింపుజేయుచో
సచిర్గపదార్థగుంభనలు సన్నుత విష్ణువిలాసగోవనో
పచితకులాయరూపముల భాసిలుచోనికఁ జెప్పశక్యమే.

వ॥ పూర్వకాలంబున నిఖిలసహాన బిరుదధురంధరయై నదయ్యెను, వసుంధర దుస్సహామదమేదురులగు కంసాదిదుష్టమేదినీపతులైన ధూర్తనిశాచరుల భరంబును, భరింప జాలనిదై గోరూపంబుధరించి కన్నీటిజడులు కడువడివెడలుచుండుటచేత గలుషితంబగు గన్నుగవతో శోకపావకునిచేఁ బరవశంబగు నిజాంతరంగంబుగలదియై పరివేదనారావంబుచే హారిదంతరంబులను దంతురితంబుగాజేయుచు భగవంతుండగు నంభోజసంభవుని చరణయుగళంబు శరణంబునొందెను. 28

వ॥ ఆచతురాననుండును నామెని వేదనంబువలనతద్వేదనం దెల్లిసికొని దానింబరిహరింప శతమఖముఖనిలింప నికరపరివృతుండై గోరూపధారిణియగుఁ బుడమిచేడియతోడఁ గూడ పాలకడలి దరికరుగుదెంచెను. అక్కడ 29

—• బ్రహ్మాదులు వైకుంఠుని నుతించుట. •—

చ॥ ఘనశుభమిచ్చువాని ననుకంపనుఁబెంపుఁగ బూనువానిదు
ర్దనుజుల దున్ంచువాని సతతంబును నాశ్రితపాపరూపశా
ర్ధిని దగగోలువానిస్వసతిఁ సిరినెమ్మెడగాంచువాని లీ

లనుగొని సర్వవిశ్వతతులన్ ధరియించినవాని శౌరినిన్
బనుపడసన్నుతించిబహుభక్తిని మ్రొక్కెనజుండు మెండుగాన్.

క॥ నిరవధిక సత్కృపారస
పరిపూరితమానసమున బరగెడు శౌరిన్
సరసతర వేదవాక్తతి
బరపుచుఁ జతురాననుండుపాసన జేసెన్. 31

చ॥ అజుఁడుసమాధినిష్ఠగొను నయ్యెడనంబరవీధినుండి బల్
రుజువుగనొక్కవాక్యమది రూఢిగవెల్వడె వక్త్రహీనమై
విజితసుధారసాకృతి యభీష్టకలానుగమైన దాని దా
నిజముగనాలకించి కడునెమ్మదిసర్వసు పర్వపాళితో
బ్రజలసృజించుధాత యిటుబల్కెను దిక్కులుపిక్కటిల్లగాన్.

వ॥ మేఱమీఱిన యీవసుంధరా పరితాపంబు స్వంత
యుం దెలుపబడనిదయ్యునుభగవంతుఁడగు చతుర్భుజునిచే నం
తయుం దెలియబడినదిగదా! 33

వ॥ ఈపరమపురుషుం డవనీవ్యసననిరసనంబునకై వసు
దేవతనుజ భావంబునొంది ధరణీతలంబున బొడముటకు బ్రి
యత్నించుచున్నవాడు. 34

వ॥ కావున నిపుడు సత్వరంబుగా దదారాధనంబుకొర
కు మీరుగూడ యదుకులసముద్భవంబు నొందదగినది. 35

వ॥ ఇవ్విధంబున సురవరవర్ణినులచేతం చూడహరిచరణ
పరిచరణంబునకై మానవమానినీభావంబువరిగ్రహింపదగినది.

వ॥ మహర్షులచేతంగూడ పురుషోత్తమ పరితోష
పోషణంబుకొరకుగోరూపధారణంబై పరమాదరణీయంబైనది.

వ॥ శేషాహివిభుండును వాసుదేవ సేవనంబుకొరకు
దదగ్రభవుండు కాగలడు. 38

వ॥ భువనమోహినియగు మాయయును మురశాసన
శాసనంబువలన ముందుగావసుంధర యందవతరించుచున్నది.

వ॥ కమలాలయయగు కమలయును నిలాతలంబునతదీ
యకుల పాలికాపదంబు నలంకరించుచున్నది. 40

వ॥ కావున నతిత్వరితంబుగా యథోక్తప్రకారంబున
జేయబడుగాక యని యివ్విధంబుగా సురసభాసదులతోబలికి
సుధాధారాకల్పంబులగు జల్పితపరంపరలచేత వసుంధర
నూరడించి సారసాసనుండు నిజనివాసంబునకేగెను. 41

క॥ అలశూరసేనదేశం
బులయందలి మధురయనెడుపురము మధురమై
యలరుపురాతన మదె యదు
వులకుఁ ఘనరాజధానివొల్చు మహితమై. 42

గీ॥ ఒప్పుచుండెడు నప్పురినుగ్రసేనుఁ
డనెడు భూపతి నసియించునతని కనుజుఁ
డన్ని సద్గుణములచేత నన్నువలెనె
నలరుమనుజోత్తముఁడు దేవకాహ్వయుండు. 43

గీ॥ అతనికాత్మజ దేవతయనగబరగి
దేవకీదేవియను పేరదేజరిల్లు
నుగ్రసేన మహీపతికగ్రసుతుఁడు
కంసుడతిహింసకుడు కులపాంసనుండు. 44

వ. అటుపిమ్మట నొకప్పుడు వసుదేవుండు మధురానగరంబున దేవకీదేవింబెండ్లియాడి యతులహర్ష ప్రకర్షంబు నొందుచు భార్యతోడం గూడుకొని పరిజనవృతుండై యానగరీలలామంబునుండి బయలువెడలి నిజభవనంబునకు వచ్చు నిచ్ఛచే ననుపహతమనోరథుండై రథారోహణంబుగావించెను.

సీ. భగినీజనంబుపై బరగువాత్సల్యంబు
ప్రకటించుచును మోదభరితుఁడగుచు
బంగారురథములు పదివేలు దనతోడ
రాఁగంసుడపుడు సారథ్యమొందెఁ
గూతుపై ప్రేమచేఁ దాతయాదేవకుం
డమితహర్షంబుగా హారణమొసగె
ప్రాజ్యపూజ్యంబులై ంహిమీరు రథములు
నశ్వరత్నంబుల హస్తితతుల
గీ. మంచిగుణరూపములతోడ మించునట్టి
దాసదాసీజనంబును దగుధనంబు
భూరివస్తువిశేష సంపూర్తిమీర
నట్టి విభవముగొని వచ్చునట్టియెడను. 46

మ. అరయన్ వారవిలాసినీ శుభదవాదాంకూరముల్ గీతనా
దరవంబుల్ ఘనకాహళీ కలకలధ్వానంబులున్ భూనభోం
తరముల్ నిండఁగఁ గంసనిర్వృతివిఘాతంబొప్ప నాకాశవా
ణిరహిన్ బల్కెను నీదుచెల్లిగనుపున్నెంపుంసుతుండష్టమో
దరుఁడెన్నన్నిను జంపగాదగునికన్ తథ్యంబుగానంచొగిన్.

సీ. ఆవాక్యమును గంసుఁడాలించి వికలిత
హృదయుఁడై దేవకినదయుఁడగుచు
గొప్పగట్టిగబట్టుకొని క్రోధమున నామె
నటుజంప నుద్యుక్తుఁడగుటఁ జూచి
కష్టాయమానుఁడై కఠినాత్ముగంసుని
గని వసుదేవుండు కరముపట్టి
సారమృదూక్తుల నూరడించిన దన
మదిమరలింపక మారుపలుక

గీ. వినుచు ప్రాణప్రియాభంగ భీరుఁడగుచు
నెద్దియునుసేయ దోఁచక య్యేడనుశౌరి
పరవశత్వముగొని కొంతవడికిఁదెలసి
మరల ప్రకృతినిగొని యిట్లు మదిఁదలంచె. 48

గీ. సాంత్వనోక్తుల వీనినిశ్చయమునిపుడు
గరిమవారింప శక్యంబుగాదటంచు
దలచి ప్రియయెడ బ్రేమవిహ్వలతబూని
ధీరతనుబల్కె నిటువసుదేవుఁడపుడు. 49

వ. భగవంతుండవగు నోభోజకులతిలకా! ప్రసిద్ధంబగు దీనదయాళుత్వంబుగలిగి దిగంతవిశ్రాంతంబగు యశోవిభవంబుగొన్న నీకిటుల గరుణింపదగినదియును, దోడబుట్టిన దయ్యును నాత్మజంబోలె నానందంబు నొందింపదగినదియును నగు నీదీనయగుదానింబట్టి చంపసమకట్టుట యుక్తమైనదేనా! కాబట్టి యిక 50

వ. ఏమంటివా! నీకెంతయు మహాభీతిహేతుభూతంబగు సంతానంబీమెకు బొడమునెడల తత్క్షణంబుననే నీచేఁ జంపబడుగాక! యని నుడివెను. 51

క. పరిణామకాలమున గడు
గరమగునానుడువు హితముగావిని యపుడా
దురితుఁడు గంసుఁడు మరలెను
వరభగినీవధ విధానపరుషమెడలగన్. 52

వ. ఇవ్విధంబున నవ్వసుదేవుండు కంసునికింగల తన సతిం జంపునిచ్ఛను దొలగించి ముదంబున దనసదనంబునఁ బ్రవేశించెను. 53

గీ. తిరుగానంత మరికొన్ని దినములకును
వరయశంబును, నామంబుబడయునట్టి
సుతునిగనె దేవకీదేవి సురుచిరముగ
నిందిదిశయల పరిపూర్ణచంద్రునట్లు. 54

వ. తరువాత యదుపతియగు వసుదేవుండును తన తనయజననంబును వినుటవలన గలుగు నానందంబు ననుభ

వించి సత్యవ్యత్యాసంబునకు వెరచుచు నట్టిసుతునింగొని చని బహుకష్టతరంబుగాఁ గంసునకు సమర్పించెను. 55

గీ. కంసుఁడాతని యనివార్యకలిత ధైర్య
మమితవీర్యంబుగని కొనియాడిపలికె
భయములేదీతనివలన బాలునితని
భవనమొందింపుమీ! యెన్మిదవకుమారు
వింటిమునుఘాతకుండను వింటినుడువు. 56

వ. అని యిట్లు కంసునిచే ననుగ్రహింపబడినవాడయ్యును దనమనంబున శంకించుకొనుచునే వసుదేవుండు నందనుంగైకొని నిజనివేశంబు బ్రవేశించెను. 57

వ. అటుపిమ్మటఁ గంసుఁడొకప్పు డనవరతంబు బృందారకబృందంబుచే వంద్యమానచరణారవిందంబులు గలుగువాఁడును, నరవిందభవనందనుండును, నమరమునిబృందారకుండును,నవిరతవిగ్రహసముత్సుకుండయ్యును సముజ్ఝితవిగ్రహాభినివేశంబుగలవాఁడును,నధరీకృతగుణగణంబుగలవాఁడయ్యును మురరిపుగుణగణంబు వీణాగానంబున గొనియాడువాఁడును భగవంతుండును నిఖిలనిగమ ధర్మమర్మనిర్భేదన విశారదుండును నగు నారదుంగనుగొనియెను. 58

వ. అటుపిమ్మట నారదుండును యథావిధ్యుక్తంబుగ గంసునిచే బూజింపబడినవాడై వానితోనిట్లని వచించెను. 59

చ. అలరెడువృష్ణివంశ్యులును నావసుదేవుఁడు దేవకాదులున్
గులికెడునందముఖ్యులును గోపకులున్దగువారికాంతలున్
బొలుపుగ దేవతాళులను బుద్ధినివ్యాకులసేయవద్దు, నిన్
గలయు బకాదులాసురులుగా నిను మున్నగుకాలనేమిగాఁ
దెలియుము శ్రీరమావిభుఁడి దేయదునాథుఁడుగాజనించుదాన్.

వ. అని యీరీతినీతినుపదేశించి నారదుండుజనినవెనుక
నతని వచనరచనచే దెలియబడిన యాదవదేవభావంబువలన
గలిగిన భయంబు దొలగించుకొనుటకై దేవకీవసుదేవుల సం
కెళులంగట్టి కారాగారంబునంబెట్టి తనజనకునింగూడ దిరస్క
రించి సూరసేనవిషయంబును నిజశాసన విషయీకృతంబు
గావించుకొని చాణూర,జరాసంధ, కేశి, మహాశన, ముష్టిక,
రిష్ట, ధేనుక, బక, తృణావృత్తాది, దానవాళులతో బరివృ
తుండై యపుడమితంబగు యదుకదనంబొనర్చెను. 61

వ. తరువాత భగినీగర్భసంభూతంబగు నర్భకషట్కం
బునుం దునిమివైచెను. 62

చ. అలరుచునందు తద్భగవదంశను బూనిన శేషనామకున్
గలిమిని దేవకీసుదతి గర్భముదాల్చెను శౌరిభీతుఁడై
వెలయగనట్టి గర్భమును వేగొని నందకులంబుభాగ్యిలిచే
నలరిచిరోహిణీజఠరమందిడ నాజ్ఞనిడెన్ స్వమాయకున్.

*సీ. శ్రీమీరుభగవదుద్ధామానువిద్ధమా
శేషాఖ్యగర్భంబుఁ జెన్నుమీర

గా వినతుల్ గాంచు దేవకీదేవి దా
ధరియించియుండుట హరియెరింగి
కంసుభయంబునన్ గాపాడుటకు దాని
నాకర్షణ మొనర్చి యతిరయమున
సర్వజనంబులన్ సమ్మోహమొందించి
పటుయుక్తిజని నందు వ్రజమునందు

గీ. సరసతరరోహిణీ సతీజఠరమునను
పొందుగానుంచుమని తగుబోధచేసి
శీఘ్రగతిజనుమనుచునుఁ జెన్నుమీఱ
నపుడు తనమాయకట్టుల నాజ్ఞయొసగె.

గీ. అప్పుడామాయచే హరిసెప్పినటుల
భద్రముగ నంతయునుఁ జేయబడినపిదప
ప్రవిగళితమయ్యె దేవిగర్భంబటంచు
పురజనంబెల్ల నాక్రోశమునురచించె. 64

గీ. తెల్లనగుదేహకాంతిచే నెల్లదిశలఁ
దెల్లముగసేయు కొమరుని యుల్లమలర
రోహిణీదేవి గనియెను రోహిణిగతి
పొందుగను వ్రజబృందమానంద మొంద. 65

వ. తరువాత భగవంతుండగు హరి వసుదేవుని మనో
రథంబు బూరించుటకై దేవకీజఠరంబునం బ్రవేశించెను. 66

వ. అపుడొక సమయంబునం గంసుండు ననుభూత
పూర్వంబగు శోభనొందియున్న యామెనుజూచి నిశ్చయం

బుగ గర్భవతిగనెంచి శీఘ్రింబుగా నిపుడీమెకు బొడమెడు సంతానంబె నాకత్యంతభయహేతుభూతంబైనదని తలంచి చింతాసంతానతంతువితానంబుచే నెంతయుంగట్టబడు నంతఃకరణంబు గలవాఁడాయెను. 67

—• బ్రహ్మాదులు దేవకీగర్భస్థుఁడగు శ్రీకృష్ణుని నుతించుట. •—

వ. అటుతరువాత సురలందరును బితామహపురస్సరులై నారదాదిసురమానులతో గూడ లోకంబునకుడిగివచ్చి చతుర్దశభువనంబులను గర్భంబున ధరించియున్నవాడయ్యును దేవకీగర్భగర్భభవనమధ్యంబున నధివసించియున్న భగవంతుండగు నంభోజనేత్రు నివ్విధంబున వినుతించిరి. 68

వ. అటులనే

క. దూరీకృతాతి దురితా
దారిద్ర్యారణ్య దావదహనా సదయా
ధారుణిధర దామోదర
దారుణదారణవినతులు దానవహరణా. 69

క. నీలాభ్రకాంతిచయసమ
నీలాకళ్యాణజాల నిధి కరుణాబ్ధీ
లీలాలయ పలలాశ క
లాలాధికవాతజాత లక్ష్మీశనుతుల్. 70

గీ. అన్నిటికి ద్రష్టవీవె దృశ్యమదిగాద
టంచునెంచియు పిదపదృశ్యమదినీక

నన్యభూతముగాగని యట్టిమతియు
విడిచిసంవిత్సుఖై కకోవిదులునిన్నె
ధ్యాన మొనరింతు రీ స్వస్వరూపానుగతిని. 71

గీ. లీలజగము సృజింప బాలింప జంప
కర్తవీవని యనుచుంద్రు గానిసదయ
హృదయుఁడవునీవు సంహారమెట్లొనర్తు
వనుచు నది నమ్మఁగాఁజాల మనఘచరిత. 72

గీ. ఘనతరానంద జలబిందు కలితనయన
ముద్గమితకంపముద్భూత గద్గదంబు
విపులతరరోమ హర్షంబు వెలయునటుల
సంవిదరవింద మకరంద సరసబిందు
సాంద్రునినుగొల్చి ముద మొందుచుండ్రు మునులు. 73

చ. వలనుగ నీదుపాద నవపల్లవముల్ గొని పాపవారిధిన్
జెలువుగ దాటుచున్న మునిశేఖర మానసముల్ బలిష్ఠమై
యల రెడు గాత్రయష్టిగొని యారసుఖామృతపూరదీర్ఘికా
వళిని మునుంగుచుండె ననివారణకారణ, కారణాత్మకా!

చ. శ్రితగతినీదుపాద సరసీరుహజాత పరాగజాల సం
గతి శిలయుఁ జలించి నిజగాఢజడత్వము బాయుదేహులం
చితహృదయంబునందు నినుజేర్చి సదాపరిరంభ మొంది యే
ద్భుతముగ స్తంభభావమును బొందెద రెంతొ విచిత్రమీశ్వరా!

గీ. గోరులను జీరఁబడుట విదారితమగు
హృదయమునుగొంట గర్వియై యెసగునీదు
వైరికుచితంబెకాని నీభక్తవరుల
హృదయసద్గ్రంధి భేదిల్లునిదె భవద్వి
లోకమునవింత నరహరీ ! లోకముసను. 76

చ. తెలియఁగరానిదాట భవదీయయదార్థత జెప్పలేక దా
దెలిపెస్వశక్తిలోపమును దెల్లముగాశ్రుతియొక్కవాక్కుచే
వలనుగనట్టులుండ నినువర్ణనసేయఁగ మాకుశక్యమే
పొలుపగు నీకృపాబ్ధిమముబ్రోవఁగ నొప్పనుగాకమాధవా.

క. అరవిందనయను నిటులఁ
విరివిగ నుతియించి కంసపీడితయగునా
వరదేవకి నోదార్చియు
వరసురలపుడేగిరి తమభవనంబులకుఁ. 78

వ. అటుపిమ్మట దేవకీదేవి దాహృదలక్షణంబుతో నుపలక్షితయై విలక్షణంబగు కొండొకశోభాపశేషంబునొంది మెల్లమెల్లన వివిధభూషణగణంబును విడచి యపచితబలంబైనదయ్యును, సముపచితరుచినిచయంబుగల యవయవంబులను ధరించెను. 79

గీ. చెలువుగా క్షణమెవ్వాని చింతనమున
నిరతసారూప్య మొందగానేర్తు రట్టి
యభ్రనీలుని గర్భమందలరదాల్చి

గారయగుచును వసుదేవ దారయప్పుడు
విమలమగు తద్విరూపభావమువహించె. 80

గీ. స్వల్పమగునామె మధ్యంబుఁ బ్రబలగర్భ
భరముచే గౌరవమునొంది బరగుచుండ
సతత తద్దార్ఢ్య కృద్వళిచ్ఛలముగోనిన
కనకదామావళుల్ గడుతునియలయ్యె. 81

గీ. మున్ను గాంభీర్యమునుగాంచి పొల్చునట్టి
యామెనాభి మహాబిలమగుచు నలరు
గర్భవిస్ఫురణను నిష్ఠగాధయయ్యె
విష్ణుపదమిషమున మహాబిలతగానియె. 82

— ♦ శ్రీకృష్ణుఁ డవతరించుట. ♦ —

వ. తరువాత నొకశుభదినంబున సకలమానవలోకంబు నమందానంద కందళితంబై యొప్పుచుండ దళితంబులై మనుజభువనకలుషంబులును, కలుషంబులై విమతహృదయ కమలంబులును, విమలంబులై సకలసలిలాశయంబులును, విమలాశయంబులై విబుధజనసమూహంబులును, సమ్మోహితంబులై సకలాసురగణంబులును, భాసురతరంబులై సకలదిశాంతంబులును, శాంతంబులయి జీమూతగర్జితంబులును,తర్జితంబులయి వ్యసన నిర్ఝరంబులును జర్ఝరంబులయి సకలసమయారిష్టంబులును వృష్టిదంబులయి కల్పపాదప సుమతరంగితంబు

టును తరంగితంబులయి గీర్వాణ వరవర్ణినీ నృత్తంబులును వృత్తంబులయి గగనకల్లోలినీ కల్లోల మాలికా కలకలంబుచే విడంబించి దట్టంబులై నిర్జర జయడిండిమాడంబరంబులును గలిగి వెలయుచున్న సమయంబున నమ్మధురానగరంబున నర్ధరాత్రింబునందు చంద్రసూర్యాగ్ని తేజః త్రితయంబును దిరస్కరించి జగత్రియంబు నుద్భాసితంబుగా జేయుచు ననుద్భూత పూర్వంబగు నొక్కమహాతేజంబు ప్రాదుర్భవించెను. 83

గీ. దేవకీదేవికి జనించె ధీరుఁడగుచు
లలితగతినప్డు శ్రీవత్సలాంఛనుండు
అపుడతనిగాంచుటకువలె నలరుశశియు
నొనరప్రాచీదిశాంగన కుదయమయ్యె. 84

సీ. వసుదేవబహుతపః ఫలరూపకుండును
బాలారుణప్రభా భాసురుండు
ఘనపుణ్యులకు సదా కరతలామలకంబు
భవ్యకృపారస వారిరాశి
సారసుధారస ధారాధరాయిత
నయనధారాంచితానన యుతుండు
అమిత తేజఃపుంజమై రహిమీరెడు
శుభలక్షణాన్విత శుభ్రమూర్తి

గీ. మైననిజబాలకునిచాల హర్షమొదవ
మరలమరలను వీక్షించి మదినిముదము
గదురతల్లక్షణంబుల గరిమగాంచి
గాంచివసుదేవుఁడానంద కలనజెందె. 85

సీ. యదువంశమునకు మహాభాగ్య విభవంబు
కళ్యాణనిధి రమ్యకళలవాఁడు
నెరిమించు నలయింద్రనీల కాంతులమీరి
దనరారు శ్యామల తనువువాఁడు
తగుశంఖచక్ర గదాధనుర్బాణముల్
కరములధరియించి మెరయువాఁడు
మస్తకంబున రత్నమకుటంబు గలవాఁడు
పీతాంబరము మేన వ్రేలువాఁడు

గీ॥ వక్షమునకౌస్తుభముతోడఁ బరగువాఁడు
ప్రిస్ఫురల్లీలలనుచాల బ్రిబలువాఁడు
నైనతనబాలకునిగడు హర్షముగను
గాంచివసుదేవుఁడానంద గరిమమొంగె. 86

సీ॥ అలపాండునృపతనయుల కులదైవంబు
గురుకరుణారసం బొరయువాఁడు
తరళలావణ్యసుధావారిరాశికి
వేలయౌతనువుతో వెలయువాఁడు
సుగుణరత్నములకు సురుచిరాంభోనిధి
పుణ్యమూర్తియనంగ బొల్చువాఁడు

చకచకలీనుభాస్వరదీప్తి దశదిశల్
వెలుఁగొందఁ జేయుచు నలరువాఁడు
గీ. నైనదనసందనుని గదుహర్షముగను
మరలమరలను వీక్షించి మదినిముదము
గదురదల్లక్షణంబుల గరిమఁగాంచి
కాంచి వసుదేవుఁ డానందకలనఁగొందె. 87

వ. తరువాత నయ్యానకదుందుభి యివ్విధంబుగా నత్య ద్భుతానుభావుండును నభూతపూర్వుండునై యావిర్భవించిన యయ్యర్భకుంగాంచి చతుర్భుజునిగా నిశ్చయించి నిర్భరానందసింధు నిమజ్జనంబుగావించియును మరల సలిలావగాహనంబొనర్చి మానసంబునందె గోశతంబును బ్రాహ్మణసాత్కృతంబుగావించి భావించి భగవంతుండగు నయ్యంబుజలోచనుం బరిస్తుతించెను. అటులనే— 88

—• వసుదేవుఁడు శ్రీకృష్ణుని నుతించుట. •—

ఉ. ఈవు పురాణపూరుషుఁడ వెన్నగుణోన్నతి లేదు చేష్టయున్
వావిరిగానరాదు హితవాక్కుల కందవు చేతనత్వము
న్గేవల మూనితీవహహా! నీయెడలన్ శ్రుతివామ లెట్లు దా
మేవిధిరక్తిఁ జెందెదరొ యెల్లజగంబుల మోహపెట్టునీ
తావున డాయుమాయ సతతంబున జేయగదా! గదాధరా.
గీ॥ ధరణిఁగళ్యాధనిధివి యుదారుఁడవుద
యాళుఁడవునీదుభటులు గృతార్థులనియు

దలచినినుఁగొల్చు సేవకధనమెగొందు
వందుచే నతిరిక్తుఁడై యతఁడుపిదప
నాత్మలబ్ధియె లాభమంచరయు నహహా! 90

చ॥ స్థిరననురక్తిమీరగ సుదృగ్జనవశ్యత గొన్నయట్టినిఁ
బరజనతాదురాపునిగ బాగుగనెంచి యభీష్టయౌ భవ
ద్గురుతరభక్తిప్రాప్తుగనుఁగొందుప్రిసుబుద్ధులు తద్విశేషతఁ
బరగిన మేలొనర్తు వదిబాసిన లేదుఫలంబులేశముఁ. 91

చ॥ పరులగునీదుసద్గుణ నిబద్ధులు భక్తులుముక్తులౌటెటుల్
గురుతరవేదనాన్వితులుగూడ సుఖాబ్ధినిమగ్నులౌటెటుల్
వరమగునీదుధ్యానమున ద్వత్ప్రకృతిఁ గొనువారలెట్లునీ
చిరతరమాయదాటెదరు చిత్రమహో! జగదింద్రజాలభా
స్వరతరపింఛ! నీదుఘనవాంఛ, గదాధర! శ్రీపరాత్పరా!

చ॥ అలరుతమంబుచే విరసమౌభవకూపమునొందు ధీరులౌ
వలనుభవద్గుణంబులను బట్టుకునెట్టులొపైకి వత్తురు నిఁ
గలితసుధాబ్ధిమగ్నతనుఁగాంచు మహాత్ములునైనవారికిం
పలరమటింజటింపనిరయంపు తలంపును నెట్టుబుట్టెడుఁ.

*చ॥అతిదళమౌతమఃపరిచయంబునశుష్కభవాంధువొందితా
మతులితలీలదావకగుణాంచితరజ్జువులూని ధీరులౌ
యతగతి బైకివత్తురు సుఖాంబుధివైతగునట్టినీయెడఁ
సతతసిమగ్నులౌతటి వెసఁ మఱలన్నిరయప్రసంగసం
గతమతిగూడవీరులకు గల్గుటదెట్లగునోపరాత్పరా.

ఉ॥ తీరుగనిట్లు శౌరినినుతించి నుతించి నమస్కరించె బల్
సారులుచూచిచూచియును సాహితినొందగజాలడయ్యెనిం
పారగగాంచి కాంచి సుకృతాత్మునిగాఁ దనుదాద్ధలంచెత
దైవ్వరినిమెంచిమెంచియపుితంబగుభీతిని జెందనాత్మలోఁ

— దేవకీదేవి స్వామిని స్తుతించుట —

వ॥ పిమ్మట దేవకీదేవియును నమందానందకందళితుం డగు ముకుందునకు వందనంబుగావించి సుధాసారసారంబుల గు నమితనుతులొనర్చి యిట్లని ప్రార్థించెను. 95

వ॥ భగవంతుండవగు నోవాసుదేవా! యిట్టియనను భూతచరంబును నదృష్టపూర్వంబును ననురూపంబును నగునీ రూపంబు నస్మాదృశులగువారి చర్మచక్షువులకు జూపవలదు. దీనింబరిహరింపుము. 96

వ॥ మఱియును దేవా! నీవుతనయవిరహదూయమా నమాననయగు నీమె నానందింప జేయుదువుగాక. శత్రుభ యంబునుగూడ నెడబాపుదువుగాక, స్వామీ! యని వధూ వరులిర్వురుం బ్రార్థించిరి. 97

వ॥ ఇవ్విధంబున బల్కుచున్న తనయవిరహాకాతరు లగు మాతాపితృలనుగూర్చి మురశాసనుండు సాదరంబుగా నిట్లు వలికెను. 98

గీ॥ పూర్వమున మీరలిర్వురు పొందుగాను
పృశ్నిసుతపాంహ్వయంబున వెలసినన్ను

బూనితప మొనరించుటర్క ముదితమాన
సాన్వితుఁడనై తియటు పరమాదరమున. 99

గీ॥ అరయుగనుమీకు తనయుఁడనగుదుననుచు
వర మొసంగితిగావున వన్నె మీర
నిపుడిటుజనించినాఁడ నేనిచటమీకు
ప్రియముగావించుటకు గడువేట్కతోడ. 100

గీ॥ భవ్యులగు మీరలు మదనుభావమునను
నెంతలోశోకవార్ధి దరింతురంత
లోననన్నెవ్వరును గానరానిపగిది
నందుమందిర మొందింపు డంద మొంద. 101

గీ॥ పెంపుమీఱుభవాబ్ధి దరింపజేయు
శ్రీభగవంతుఁడిటువల్కి ప్రాకృతుఁడగు
శిశువులీలనుగాని చవుల్ జెవులనెనయ
ఘనతరధ్వని వెలయరోదన మొనర్చె. 102

గీ॥ మాయయును నయ్యెడలనందజాయయందు
బొడమెనాహరిమాయచే మోహితులుగ
నైరికంసునిదగునట్టి యంతిపురిని
పాలన మొనర్చుచుండెను బంటులెల్ల. 103

వ॥ అనంతరంబున వసుదేవుండును జనార్దనప్రేరితుం
డై నందుమందిరంబునొందఁగోరెడు డెందంబుతోఁ దత్క్షణం
బున నిగళబంధవిగళితుండై, సుతునింగాని సూతికానికేతనం

బునుండి బయలువెడలి గత్యనుకూలంబుగా నప్రియత్న సం
భవంబగు నర్గళవిఘటనంబుగనుంగొని ఫణిపతిఫణాగణంబు
చేత వారిధారలునివారితంబులగుచుండ నతిత్వరితంబుగా నం
తఃపురంబునుండి బహిర్ద్వారంబువెలువడి యమునానది గమన
మార్గంబు నొసంగుటంజేసి నావయెక్కనక్కరలేకయే దానిం
దరియించి, నందవ్రజంబును బ్రవేశించెను. 104

గీ॥ నందుమందిర మొంది యానందముగను
శౌరియర్భకుని యశోద శయనముననె
యుంచియపుడామెసుతను గ్రహించి సంత
సమునగొనివచ్చి నిజనివేశంబుజొచ్చె. 105

గీ॥ ధన్యుఁడాతఁడు దానిని దారయెదుట
నుంచిచరణంబులకును మున్నెప్పుచున్న
నిగళయుగళంబుమఱలను నగనుబోలె
దాల్చి యెప్పటియట్లను దావసించె. 106

గీ॥ నందసుందరివసుదేవ నందనుఁదన
నందనుండను భ్రాంతినానంద మొందె
నట్టిదచ్చట నిశ్శంకనగుపరత్వ
బుద్ధిచేనామెకు సుఖంబు బొందదగునె. 107

వ॥ తరువాత నంతఃపురద్వారంబులును, పురగోపురం
బులును, నెప్పటివలె నావృతంబులగుచుండునప్పుడు బాలికా
కలకలంబాలకించి,నిలయ పాలికలు దెలిసికొని త్వరగొని కం
సునితో సుతావతరణంబును విన్నవించిరి. 108

వ॥ అపుడాకంసుండును, తద్వాక్యంబును వినునంతనె పిడుగుబడినవానివడువున, వజ్రఘాతంబునొందిన ధరాధరంబు చందంబున సమధికంబగు హృదయవేదనంగొని నిజవిలయ హేతుభూతుండగు నంతకుండనిభయంబు నొందుచు బురుద గోతంబడిన కరికరణి నేమిసేయుటకుందోచక ద్వివిధంబగు నరిష్టంబునొంది కృత్యాకృత్యంబులందెలియక కరుణమాలి హింసించుటకు తనయనిమ్మని దేవకతనయను యాచించెను. అపుడామె పాపాశయుండగు వానికిట్లు మారుబలికెను. 109

ఉ॥ చక్కనిచంద్రసన్ముఖులసౌమ్యులరమ్యులమాననీయులన్
బెక్కురసూనులన్ దునిమి పీడయొనర్చితి భీరువైనదీ
తక్కినదీనపై ప్రియముదాల్పుము ఖేదమొనర్పవద్దికన్
దిక్కరుచెల్లినాధి నిహతింగొనుదానను గారవింపుమీ
వక్కలపర్వతాళికిఘనాశని తాపమునబ్బుఁడార్పడే. 110

వ॥ అని యివ్విధంబున నతికరుణంబుగా దీనారవంబున ముఖరితంబులగు హరిదంతరంబులుగలుగునటుల నాలపించుచున్న దేవకీవసుదేవులను గణనసేయకయే యాబాలిశుఁడా బాలికను బలాత్కారంబుగా గ్రహించి పైకెత్తియొక శిలాతలంబునంబడవైచుట కారంభించెను. 111

గీ॥ దేవకీదేవియబల యధీరగాన
నా మెమాటను వినకుండుటది యుచితమె

సంతతానకదుందుభి శబ్దమైన
వినడనెడుమాట గసనయ్యె విస్మయముగ. 112

వ॥ అపుడామాయాబాలికయును సత్వతనలీలాకాశ లంబుగొని తత్క్షణమంతరిక్షమార్గమున నటించుచు సురసుంద రీరూపంబునొంది యామె, విస్మయమానమానసుండై డిల్ల వడి నిశ్చేష్టుఁడై చూచుచున్నకంసుంగాంచి యిట్లనియెను.

వ॥ ఓరీ! మూర్ఖకులతిలకా! యిట్లు బాలికనగు బా లను ననుజంపుటచే నీకేమి ప్రయోజనమున్నదిరా? 114

వ॥ మఱియును నిన్నుఁ బూజించుటకొఱకు నిరంకుశ మహిమానుభావుండగు మహానుభావుం డొకఁడీ భూతలం బునసముద్భూతుండైవర్థిల్లుచున్నవాఁడు సావధానంబుగా నది నీవవధరింతువుగాక! యని యంతర్ధానంబునొందెను. 115

వ॥ అపుడు కంసుండు నత్యంతమర్మచ్ఛేదకంబులగు తద్వచనంబులచేత జర్ఝరితహృదయకోటరంబుగలవాఁడైకొం డొకకర్కశదశావిశేషంబునొంది వసుదేవుండే శరణంబుగా జేయదగినవాఁడనెడు బుద్ధినొందెను. 116

గీ॥ తనయపీడన వజ్రఘాతములనొంది
నట్టి ఘనవసుదేవాద్రియపుడు కంస
వారిధరకృత వాక్యాంబు ధారలుగొనె
శిరమునను, గుర్విగద! యుర్వి, జీననాశ! 117

వ॥ దేవకియును నూరడింపుమాటలచే హృదయోల్లా సంబునొనర్ప నేర్పుగలిగి పశ్చాత్తాపంబునొంది ప్రార్థించు చున్న కంసుని దక్షిణంబుననె యానందింపఁజేసెను. 118

వ॥ ఇవ్విధంబునఁ బుండరీకలోచన విలోకనంబువలన సకలబంధఁబులచే విడివడినవారి దంపతులకుంగూడ నిగళ బంధంబులు విగళితంబులుగానొనర్చి ప్రసాదమేదుర హృద యారవిందంబులు గలవారలుగనొనర్చి వారిచే నోదార్పఁబడి కంసుండు నిజసదనంబునకుం జనెను. పిమ్మట— 119

వ॥ తరువాత నపగతరుచినిచయంబు గల విధునితో విరహవిధురితయగు రజనీయువతి పరిదేవనవిరావంబులుగా వెలయు నానావిధవిహగవిరుతంబులచే ముఖరితంబులగు దిఙ్ము ఖంబులు వెలయుచుండ, పూర్వధరాధరంబుచే నవలంబ్య మానంబగు భాసురమణిముకురంబైయుండునో, లేక పరిసరం బులందు·విస్ఫురర కేసరంబులుగల వాసరకమలావిలాస కోకన దంబై యుండునో, యాహా! లేక యవనీతలావతీర్ణుండగు మధు సూదనుని సేవించుటకు బలిసదనంబునుండి బయలువెడలిన భుజగేంద్రుని శిరంబునం దగుశిరోమణియైన పద్మరాగంబై యుండునో! అట్లుగాక రథాంగవిహంగంబులచే దూరీకృతం బగు విరహానలజ్వాలాపటలంబయి యుండునో! లేక ద్విజరా జవసుహరణంబుచే సముపగతంబగు విగర్హణంబును నిబర్హ ణంబును గావించుటకై దినకరకరసము ద్ధృతంబగు తప్తలో

పాఫలకంబై యుండునో! యని యనేక భేదవచనంబులచే నుల్లేఖ్యమానుండగుచు ప్రాగ్దిశాముఖంబును జుంబించుచున్న భగవతుండగు భాస్కరుం డలరుచుండునపుడు 120, 121

గీ. పాపహృదయుండు సంతానహాంసనుండు
నైన కంసుఁడు దుష్టాత్ములైన మంత్రి
జనులతో దన దురభిలాషంబుఁ దెలుప
సభకు జనుదెంచె తక్కినజనులవిడచి. 122

వ॥ అపుడు కంసుండు కపటబాలికయగు బాలికచే బలుకబడిన సల్లాపంబునంతయు వారలతో జెప్పి పిమ్మట, తరువాత జేయందగినపనియును దెలియబలికెను. 123

వ॥ ఆమంత్రులును తదాజ్ఞాపరతంత్రులై జగంబునం దెల్లెడలను గలుగు నర్భకజనంబుల మర్దించుటకు కృతనిశ్చయులై బయలువెడలిరి. కంసుండు దానును నిజభవనంబునకు జనెను. 124

గీ॥ అపుడు నందుఁడు సుతభావమొందియున్న
పరమపురుషుని ప్రత్యక్షభావకలన
నొందె నిర్వాణమానక దుందుభి కట
బంధమయ్యె నెదుట పరాత్పరుఁడులేమి. 125

గీ॥ అట్టిసుతుఁ గౌగిటను జేర్చి యయ్యశోద
యతులితానంద మొందుట యబ్బురంబె!
సుముదమున నాతనిని హృదయమున జేర్చి
యతివిరాగులు లీలాప్తులగుటవింత. 126

క. వరవసుదేవజుమాయన్
బరవశయగు నందసతియెబడసె ముదంబా
తెరగున దేవకిబడయదు
పరతత్త్వము గనినదయ్యె బహుచిత్రముగాన్. 127

వ. నందుండును నందనోదయ సమయంబున సముచితానందంబునొంది యపరిమితగోశతంబులను గనకనికరంబును భూసురోత్తములకొసంగి నికేతనంబులను బతాకానికాయ భూషితంబులనుగావించి దిశాముఖంబులను పటహాదుందుభినిస్సాణరవముఖరితంబులుగా జేసి వేశ్యాంగనలు లాస్యలీలాలాలసలై నటనంబుసేయుచుండ గాయకులు కర్ణరుచ్యంబు నణగించు గానరసాయనంబుగా గానంబొనర్చుచుండ సుమనోగణంబులు సుమనోగణంబులు జల్లుచుండ నెల్లవల్లవులును సముదితానందపల్లవులై యొప్పుచుండ వందిమాగధులు కళ్యాణగాథలు ప్రకటించి కైవారంబులు సల్పుచుండ బ్రాహ్మణజాతంబులు మంగళసూక్తజాతంబులు నల్పుచుండ దక్షిణంబున నందనునకు సానందంబుగా జాతకర్మమంగళ మహోత్సవంబును బ్రవర్తింపజేసెను. 128

గీ. తనువునువహించి విలసిల్లు ధర్మమట్ల
విష్ణుడు క్రమంబుగా నభివృద్ధినొందె
నల్లె కలనునిదుర్వినయాంకురంబు
విపులను నిరంకుశంబుగా బెరుగుచుండె. 129

వ. తరువాత నొకప్పుడు నందగోపకుండు, వ్రజపరిత్రాణభరంబునంతయు దన యనుజీవిజనంబున కొప్పజెప్పి కాన్కయొసంగుటకై, మధురానగరంబునకు వచ్చి సమస్త వస్తు సంపూర్ణుఁడగుటఁజేసి రాజును సంతోషపరచివచ్చియుం డెనను మాటవిని వసుదేవుండు సత్వరంబుగా నతని దన నివేశంబునకు దోడ్కొనివెళ్లెను. 130

గీ. పిదప మిత్రితభ్రాత్రలై విధివశమున
సంఘటననొందువారలు సంభ్రమమున
నొకరినొకరటు గౌగిటనొనరగూర్చి
యపుడనామయవార్తల నడిగికొనిరి. 131

గీ. చ్యుతసుతాశుఁడవగునన్న ! సారదినీకు
నచ్యుతసుతస్పృహాజనించె నందువలన
మధురతరమగు సుతసారవిధముచేత
సంతతము వృద్ధిగాంతువే సంతసమున. 132

గీ. భవ్యుఁడా ! రౌహిణేయుఁడు భాస్వదమల
భవదుదవసితమున, తాతభవనముగను
దలచునా లేక ప్రొషిమన్ దానినతఁడు
మిత్రగృహముగదలచు నోమిత్రవర్య. 133

గీ. అర్పితకరుండవై యిటులొప్పనీకు
నీదగనిదించుకయు లేదదిప్పుడిచట
నుండుటయు నర్హమునుగాదు మెండుగాను
వ్రజమునకునేగుటుచితంబు భావుకముగ. 134

గీ. సంతతోత్పాతతతశత సంకులముగ
నైన వ్రజమునుపేక్షింప నర్హమగునె
అన్న! యనినందుతోడ నయంబుమీర
నొప్పుగా జెప్పి వసుదేవుఁడూరకొనియె. 135

ఉ. శౌరికిసంతసంబొనగి చక్కఁగదెల్పినవాని వాక్యముల్
కూరిమితో గ్రహించి గుణగుంభితులౌనను జీవులెయ్యెడన్
జేరికగల్గు గోపకులు జెన్నుగదన్గవగూడి రాగమేల్
శ్రీరహిమీరుమందిరము జెందెనుబొందుగనందుడయ్యెడన్.

—• కంసునిచే పూతన యను రాక్షసి పంపబడుట. •—

క. చేతనపీడాతత్పర
యాతనలొందించు నిపుణయగుచు దురాశన్
బూతన, యఖిలార్భకజన
పాతనచణయప్డు నందభవనమునొందెన్. 137

వ. ఆ యీపూతన కంసశాసనంబును శిరంబునధరించి కమనీయతరంబగు కామినీరూప సంపదనువహించి యిలాతలంబునంగల బాలిశబాలకులను వంచించి హింసించుట కాసక్తిగలదియై నందభవనభూషణీభూతుండును కపటబాలిశుండును నగు వనమాలినిగని బాలలీలావిలోకనంబుల నాలోకించుట కాసక్తిగలదానిచందంబున దనహస్తంబుల నతనిం గ్రహించి తదీయమధురభాషణ శ్రవణభరంబున బరవశంబగు నాశయంబుగలదానిపగిది కొండొకప్రమోదభరంబు నభిన

యించుచు హాలాహలనిలయంబగు దనకుచయుగళంబునందలి స్తన్యంబును బానంబుసేయించెను. 137

వ. ఆయదునందనుండును త్రిభువనంబుల మోహింప జేయు సమర్థుండనగు నన్నుగూడ నిది వంచించుటకు బ్రయత్నించుచున్నది గదా! యని దాని యభిప్రాయంబు దెలసికొని తదపరిమిత శరీరబలంబును గర్వంబును ప్రాణవాయువులతో గూడ సర్వంబును బీల్చివైచెను. 138

గీ. పూతనాప్రాణవాత సంఘాతములను
స్తన్యపానమిషంబునదాగ్రివె నీతఁ
డందుచే, జక్రి యనవచ్చునైన నితఁడు
జెందు గరుడాదరంబును జిత్రముగను. 139

గీ. పూతనయును జగత్ప్రాణములను గ్రోలు
హారియుదత్ప్రాణవాయువు లాహరించె
నపకృతి సమానమాగాని యద్భుతముగ
నలమరుత్తతికది శతృవతఁడుహితుఁడు. 140

గీ. చాల విషపూరములు దానిపాలు దావి
యతఁడొకింతయు వ్యథనొందడయ్యెనపుడు
విషధి యతనికినిలయమై వెలయుచుంట
తత్సుతయునిష్టతమయౌచు దనరుచుంట. 141

గీ. అపుడు పూతన చాల్చాలుననుచు భిన్న
మైన సర్వాంగసంధి బంధానుగతిని

ప్రాణములుబాసి ధరణిపైఁబడియె వజ్ర
ఘాతమునుగొన్న ఘనతరగాత్రవమట్లు. 142

గీ. ఘోరమగు దాని దేహంబు నూరబైట
వైచి శిశురక్షసల్పిరి పాలక జను
లాప్తయుతుఁడౌచు భవనంబునందె నందు
డాత్మజచరిత్రవిని విస్మితాత్ముఁడయ్యె. 143

— శకటాసుర సంహారము —

వ. తరువాత నొకప్పుడు బాలుండులేచి తప్పటడుగు లిడుచుండ నాధ్ధానికంబుపేరిటి మహోత్సవంబు సేయు సమయంబున వేడుకపడుచుండు సకలపల్లవ విలాసినీజనంబుల కలకలంబుచేత దిశాంతరాళంబులు గబళితంబులై యుండ బాలుడ్రవెడు కోర్కెచే, నాకులంబునొందు యశోదా కిశోరుని చరణతలంబుచే నెగురగొట్టబడి నికటంబునందు ముక్కముక్కలుగా వ్రక్కలింపబడియున్న వికటశకటంబును విలోకించి యదియె యుత్పాతశతంబుగా శంకించుచున్న నంద గోప పురస్సరులగు గోపకులందరును నిట్టి దుష్కరకార్యంబుచే, బరిభూతుండుగాని బాలకునాలోకించి కొండొక సంతసంబు నొందిరి. 144

వ. ఇవ్విధంబున గలుగు నుత్పాత శతంబులైనను దిరస్కరించుచు నమితమహిమగలిగి వెలయునర్భకుని యశోద

యొకప్పుడు దన తొడలపై నిడికొనియున్న సమయంబున గిరి శిఖరభరంబునుబోలె నబ్బాలకుని కళేబరంబునునిమిషమాత్రం బైన సహింపజాలదయ్యెను. 145

గీ. ఉదరమున సర్వలోకంబు లొప్పుచున్న
శుభతరుండాతఁ డబలయశోదయరయ
విస్మయమునొందరాని యీవిషయముననె
యబ్బురమునొందిరయ్యెడ నవనిజనులు. 146

గీ. అపుడు పరమాద్భుతమునొంది యయ్యశోద
బర్వును సహింపజాలక బాలునచట
బుడమిపైనుంచి గృహకృత్యములను జక్క-
బరచుటకునేగె నల గర్భభవనమునకు. 147

గీ. వరగునుడిగాలివలె తృణావర్తదనుజుఁ
డర్భకునిదూదివలెగొను చరిగిపైని
బరువుకోర్వక విడుచుచో బాలుఁడతని
గళముఁబీడింపఁ బ్రాణవిగళితుఁడగుచు
నవనిపై గూలె రక్కసుఁడద్భుతముగ. 148

వ. అటుపిమ్మట యదుకుల పురోహితుండగు గర్గ మహాముని వసుదేవునానతింగొని నందుని మందిరంబునొంది యతనిచే యథావిధిగ బూజితుఁడై బాలురకిర్వురకును రహస్యంబుగా నామకరణ సంగళంబును విధిపూర్వకంబుగా జేయ నారంభించెను. 149

గీ. రౌహిణేయుఁడు బలుఁడని రాముఁడనియు
సరయ సంకర్షణుండన బరగునవియు
జిష్ణుఁడగువాసుదేవుండు కృష్ణుఁడనియు
నామధేయంబు లిడియె నాభూమిసురుఁడు. 150

ఉ. పోతముగాడితండు భవపూరితసాగరపోతమౌగదా
యాతఁడుగాడుపాకమును యాదవపుణ్యసుపాకమౌగదా
యాతతబాలలీలనిటులయ్యను మేలగునాత్మలీలలన్
భాతిగనల్లకృష్ణబలభద్రులిలన్ ఘటియింతు మోదమున్.

ఉ. శ్రీగిరిజాకృపారసఝరీభరసౌరభవత్కటాక్ష శో
భాగురువీక్షణంబు లలభాసురకల్పలతాసుమావళుల్
గాగొని సత్కవీంద్రుఁడనగాదగు శ్రీనవకాళిదాసుమున్
బాగుగ దారచించెనిది పండితమానస సద్విలాసమై
భాగవతాఖ్యచంపువున బాగుగనాదివిలాస మొప్పెడున్.

చ. శివగిరిజాకృపారస విశేషపరీతకటాక్షవీక్షణో
ద్భవతతసాహితీసుకవితా రసభాసురసుందరాఖ్య స
త్కవికృత మానసౌరభ సుధారసధారలమీఱు నాంధ్రభా
గవతపుచంపునన్ బ్రథమగణ్యవిలాసము పూర్తిమైతగెన్.

గద్య.

ఇది

శ్రీమన్మహారాజ రాజేశ్వరీ కరుణాకటాక్ష వీక్షాలహరీ పరీత
సంగీత సాహిత్య సరసకవితా చాతురీధురీణ తార్కికవిద్యా

విశేష ప్రవీణ సత్యవోలు కులకలశ జలధి కువలయమిత్ర
భారద్వాజసగోత్ర భగవత్కవివంశ పవిత్ర సోమరాజా
మాత్య పౌత్ర వెంకటరాయమంత్రి వరపుత్ర
రామాంబా గర్భశుక్తిముక్తాఫలోదయ సకల
సుకవి విద్వజ్జనవిధేయ సోమసుందరకవి
నామధేయ ప్రణీతంబైన శ్రీమ
దాంధ్ర చంపూభాగవతమునందు
ప్రథమవిలాసము
సంపూర్ణము.



శుభమస్తు. శ్రీరస్తు. అవిఘ్నమస్తు.

శ్రీశాంకరీదేవ్యైనమః

# శ్రీమదాంధ్ర చంపూభాగవతము.

## ద్వితీయవిలాసము.

— శ్రీకృష్ణ బలరాముల బాలక్రీడాభివర్ణనము —

ఉ. నాదగుభవ్యజీవితమ, నాదగుసర్వధనంబ, ప్రాణమా!
నాదగుమాత, తాతయని నందునిసుందరిమాటిమాటికిన్
మోదముమీరగా నతనిముద్దిడు ప్రేమకు బాలశౌరిదా
నాదట నెద్దిమోబలుకు చంబకుజూపునమూల్యహాస లీ
లాదృతసద్విలాసములకంచిత లీలనమస్కరించెదన్. 1

చ. గుణరహితంబునిశ్చలముగూఢము నెంతయునల్పమాత్రమై
యొనరుచునెప్డుదానసదనుచ్ఛ్రపు భూతతతిన్ వహించు న
మ్మునిజనచిత్తడోలికను బొంది సుఖించు జగద్గురుండు, చే
కొనినగుణంబునంచలముగొప్పగుడోలను మోద మొంద డే.

గీ. సంతతంబును నమృతం బొసంగునేది
యెలమినిగ్రహించి మధుసారమేదిగానిమె

నట్టి తనచేతిదగు వ్రేలు నల్ల బాల
హరియు జుంబించుటదియొక యబ్బురంబె!

గీ. తొల్లిపుట్టువునను హరిలోకమైన
గాల్పగాజాలనట్టి యాస్వల్పవహ్ని
యిపుడు నాకెంతయని మదినెంచియేమొ
బాలహరిదీపశిఖనంటఁబాలుపడియె. 4

గీ. మనమునందనప్రతిబింబమునుగ్రహింప
గోరి శౌరియు మనమునుజీరివైచె
నదెదలచి తనప్రతిరూపమంద, బాల
హరియునద్దము గోరులనదిమివైచె. 5

గీ. వెలయునలపూర్వభక్తనవీన భక్త
తతికినిర్వాణమే రమాపతియొసంగు
జగతినాహరికొక మహోత్సవమునందు
ఘనతరనవీన భక్తసంగతిని జేసి
యధికనిర్వాణసుఖమయ్యె నబ్బురముగ. 6

గీ. ఋషిమునిచిత్తమునను నిరుద్ధతయును
బరగుస్మృతితంతుసంతతిబద్ధతయును
బడసియున్నముకుందుఁడాబాలకునకు
దనరెనిష్క్రమణోత్సవమున నిరర్గ
ళప్రమోదము యుక్తమౌ లలితగతిని. 7

గీ. తల్లియునుదండ్రియునునీవు ధరణినెవతె
కైతివని మాతప్రీతిచేనడుగు నర్భ

కుండు, నీకైయటంచునుఁగూర్మివలికె
నది యబద్ధముగానిదైయలరెబ్రికృతి
బడయుబాలునినరిమైన సుతువువలన. 8

గీ. భవనముననుండు స్తంభంబుబట్టిలేచె
హారికిశోరము తద్విలోకరుచివలన
దనరుబ్రహ్లాదవృద్ధితజ్జనకునకును
ఘనతరప్రిశయంబది గలుగకున్నె! 9

గీ. ముగ్ధులగువారుగూడ నబ్బురముగాగ
నెవనిస్మరియించి సద్గతినెనయుచుందు
రట్టిబాలుండు ప్రితిపదమంను దొట్రు
పడుచునడుచుట మాకుశుభంబులొసగు. 10

గీ. ఆరయనెవరు విపద్భావమందిమెట్టి
బాలునిస్మరించి యురుగతిబడయుచుంద్రు
ధరణినాహరి మందమందంబుగాగ
నడుచునడకలుమాకునానంద మొసఁగు. 11

గీ. ఎవనిపదమాత్రకలనచే నెసగుసుగతి
యట్టిబాలుఁడు హంసవిఖ్యాతిగొనఁడె
కృష్ణపదమదిస్పష్టమా జిష్ణునందు
ధార్తరాష్ట్రతలేమి చిత్రంబుగాదె. 12

గీ. అతని పద్మపద్మములను ముద్రితములైన
భూములను లక్ష్మినిలువకపోవుటెట్టు

లట్టి స్థలబద్ధగయునుదానలసరోజ
కలితలక్ష్మని మీఱుటగాదెవింత. 13

గీ. అక్క యంబరో తాతయటంచు బాల
శౌరికెలమిని తల్లిభామలుగ్రహింప
జేసె నలవాక్కులెపుడు స్పృశింపవతని
ననుచు శ్రుతియెట్లువలికె దానబ్బురముగ. 14

గీ. సంకరతలేనిలీలను సర్వవర్ణ
ములనునిర్మించుచాతురి గలిగివెలయు
నితరసాధ్యంబుగానిదై యెవనియందు
నట్టికృష్ణుఁడు సర్వవర్ణాళిఁ గొనగ
శిక్షితుండయ్యె గురులచే జిత్రముగను. 15

గీ. చెలిమి నక్షముగ్రహింప జేయుటకును
ప్రోడలనుగూడదిండికి బోవనీక
బద్ధులుగ జేయు ప్రౌఢడింభకుఁడితండు
అక్షరాప్తికినిడి గురునాజ్ఞమీఱి
పారిపోవుట చిత్రమై బరగుచుండె. 16

గీ. నాదియీగజ మీయెద్దు నాదెయనుచు
కట్టెబొమ్మలతోనాడ గడఁగెనతఁడు
ప్రోడతనమందుగూడ తత్క్రీడనంబు
వింత కాష్ఠాశ్రయంబగు వృషముచేత. 17

గీ. వత్సతతిగూర్చి యాడుటవలననితని
కలరువాత్సల్యమని మదిదలచుచుందు
మనిశమిటుగానిచో జనార్దనుని యందు
వత్సలతనెట్లు నమ్మగావచ్చునహహా! 18

గీ. అమృతకల్పంబుగా నొప్పునన్నకబళ
ములనుభుజియించె శ్రమనిడి ముదితశౌరి
సతతపరితృప్తుఁడై యుండు నతనిబట్టి
ప్రతికబళమున బాధించి బలిమిపెట్టు
వారిదగుగాని ముగ్ధత వానిదగునె. 19

గీ. అన్నమునుదినఁ దల్లిచేఁ బాధితుఁడగు
టదియొక విలాసమాత్రమై యలరుగాని
పరమభక్తానురక్తుఁడౌ బాలహరియు
భక్తవైరస్యమును తాను బడయునెట్లు. 20

గీ. పాలనుహరించుచుండు నాబాలశౌరి
వామనత్వము గనుగొని పాలకడవ
లెత్తుగానుంచినను హరియించుచుండె
నెలమివానిమహోన్నతి నెవఁడుగాంచు. 21

గీ. తల్లిచే దొంగతనముచేతను లభించు
పాలఝురిగ్రోలి సంతృప్తిబడయనట్టి
బాలవనమాలిని దలంచి పాలకడలి
నేలనితఁడుండె ననుశంక యిపుడుదోలగ. 22

చ. అనిశముఁబొల్చు తానువిధుఁడయ్యును నయ్యెడనాఁడు వేడుకన్
జననినిజూచి యావిధుని సమ్మతిదెమ్మనిగోరెనట్టి యా
హనుఁగొని చూడ నెప్డు స్వపదాశ్రితుఁడై తగునాతఁడొందరా
డనియెడుబుద్ధియుఁ గొనినయర్భకుఁ ముగ్ధత మోదమియ్యదే

సీ. చిరునవ్వుగలమోము జెలువొందగనకార
ణంబుగా పలుమారు నవ్వువాఁడు
అవ్యక్తవర్ణంబులలర నత్యంతముఁ
బహుమధురంబుగా బల్కువాఁడు
మోదంబుగొను నయ్యశోద చే గరములఁ
బదములందున గట్టబడినవాఁడు
జెలువుగా బద్ధుఁడై చేతులన్ద్రిప్పుచు
నడుగులు దాఁటి్రిలఁ నడచువాఁడు

గీ. నైన నల బాలకృష్ణుని హాసములును
ముద్దుమాటలు మురిపెముల్ బ్రాలుచునడలు
కరయుగళవిభ్రమంబులు గాంచుటకును
గూర్మిమీరగ నెవ్వాడుగోరఁడిలను. 24

చ. అతిమధురంబులస్ఫుటతరాక్షరముల్గల ముద్దుమాటలున్
సతతమహేతుజాతమగు చక్కనినవ్వులు మందహాస సం
గతముఖుఁడై నిబంధనముగల్గియు జేతుల్ద్రిప్పియాడుటల్
హితమిడు తద్విలాసముల వెంతయు సంతసమొందఁ జేయవే

చ. అలయుకదొంగిలించి ముదమారగఁ బాలనుగ్రోలి వారిక
వ్వాలనమృతంబొసంగునటస్వల్పఫలంబుగ్రహించిపిమ్మటఁ

బలుఫలముల్ దదీశులకు బాగుగ దానిడు నల్పవిత్తమున్
దలకక గొంచు వెన్కస్వపదంబునె వారికొసంగునట్టి వాఁ
డలుగ్గక సేయు నయ్యవినయాదిక మేరు సహింపరిద్ధరన్.

ఉ. పాలనుచాలగ్రోలి కడుబర్విడియేగుచు సాంత్వనంబులన్
మేలుగజీర జేరుచును మేనఘృతాన్విత దుగ్ధబిందువుల్
గ్రాలగనవ్వుచున్నతరి గాంచితదీయ విలాసచేష్టలన్
దాలిమినంబయెంతటి ముదంబును జెందునొ చెప్పశక్యమే.

చ. అలరెడు బాలకృష్ణు సకలావయవంబుల గ్రాలుధూళిచే
గలువమణంగు దచ్చరణకంజమునందలి పంకపాళిచే
వలనుగ బంకమెల్ల నెడబాయును దన్ముఖజాతలాలచే
లులితపు మేనలేపమది లోపమునయ్యెడు నయ్యశోదకున్
దెలియగలేము కారణముతీరుగ తత్కృతపుణ్యమెట్టిదో.

చ. గొదగొనియశ్రుశూన్యముగ గుందుచుపాలిడుమంచు నెప్డుప
య్యెదగొనిలాగుచున్ బుడమి నెంతయు దొర్లుచు నూరడించినన్
వదలక సేయునప్రియము భవ్యతపఃఫలమైన దాట స
మ్మదమున మాతకెప్పుడును పూర్ణహితంబొసగూర్పకుండునే

ఉ. అమ్మరో! పాలనిమ్మనగ నయ్యవి యిప్డెటులన్న నెప్డనన్
రమ్మపుడా పితృప్రసువు రాగనె, వచ్చనె, తాతతల్లి సా
యమ్మునఁ జీకటుల్ గలుగునప్డన నిప్డల గర్భగేహమం
దిమ్ముగ జీకటిన్ గనవె యిట్లనికృష్ణుఁడు నయ్యశోద జి
త్రిమ్ముగ బల్కు సూక్తులవితద్దయు మాకు శుభంబులీవుతన్

చ. మురరిపుపూర్వసత్కథలుపొందుగబాడుచుజాతమోదసం
భరిత యశోదజోలికసబాలక నూపుటయున్ సుతుండు ని
ద్దురగొనురీతివించుగనుదోయిని మోడ్చిసుఖంచుచుంటయ
య్యిరువురలీలమాకెలమి నీవుత శాశ్వత సర్వసంపదల్. 30

—• గోపికలు శ్రీకృష్ణుని మడుకు చేతలు యశోదతో చెప్పుట. •—

వ. ఇవ్విధంబున నతిదుర్లలితుండయ్యును గమనీయ చరిత్రుండగు నతడు వల్లవపల్లవాధరల వంచించి నవనీత చౌర్యంబునందాసక్తిగలవాడై యొప్పుచుండ నప్పుడాయర్భకుని నిరోధింప సమర్థంబుగానిదై గోపసీమంతినీనంతతి యంతయు నొక్కమారుగా నేకీభవించి యతనిదుర్భరంబగు యవినయంబునంతయుం దల్లికి విన్నవించెను. 31

వ. సతతప్రమోదయగు నయ్యశోదయును బిమ్మట నధికతరంబగు పుత్రవాత్సల్యంబుచేత వారు విన్నవించిన సమస్తదూషణాలాప భాషణంబులనువిని వినిపించుకొననట్లూరకొని వారింబరిభవించి రహస్యంబుగా నందనుని మందలించెను. 32

సీ. చలితంబులును దంభకలితంబులును నశ్రు
లులితంబులైన యాలోకములును
దీనంబులు సుధాసమానంబు లపరాధ
మార్జనపరములు మంజువులును

నతిభీరువులు గద్గదారావసహితముల్
లలితంబులైన యాలాపములును
నలసత్వభరములు నానందకరములు
నయవినయాన్విత నటనములును

గీ. వెలయమనమునకును బ్రీతిఁగలుగఁజేయు
నట్టిమాయావియగు హరియాననంబు
మోదముగఁజూచిచూచి యశోదయపుడు
సుతునిపై సుంత కోపంబుఁ జూపదయ్యె. 33

సీ. బాలేందులీలను బరిహాసించుచునుండు
తనురుచి రుచిమీఱఁ దాఁ బ్రివిత్రావి
సంతతంబును సుధాసారసారోదార
విలసితవాక్యముల్ వినియు వినియు
మురిపెంబునెరపెడు మోమునకా ముదముతోఁ
గొనబాఱ ముద్దులుఁ గొనియుఁ గొనియుఁ
దనరారు నలదివ్య తనువనురక్తిమై
జెలువారెదఁ గాగిటఁ జేర్చిచేర్చి

గీ. అలరుచుండెడు సుతునవయవములెల్ల
హర్షమెసగగ మరిమరి యరసియరసి
యపుడు పరిగత సమ్మోద యయ్యశోద
తనివిదీరగ పరితృప్తి నెనయదయ్యె. 34

—• స్వామిమృద్భక్షణ - విశ్వరూపప్రదర్శనాభివర్ణనము. •—

వ. తరువాత మరియొకప్పుడు చెలికాండ్రగు బాలకులందఱుంగలసికొని యదునందనుఁడు మన్నుదిన్నవాఁడని యశోదతో విన్నవించిరి. 35

వ. అప్పుడామె వారువిన్నవించు నుడువులవలనం గట్టుబాటుసేయుటకునై సరభసంబుగా, తనయునింబిలచి ఓదుర్లలితుడా! యట్టి నీచకృత్యంబొనర్చితివేల? యని రోషయుక్తంబుగా మందలించెను. 3

వ. అపుడాబాలకుండును సవినయంబుగా నోజననీ! వారిమాటల నెంతయు నమ్మవలదు. వీరలందఱును నసూయాపరులగువారలని పలికి తననోరు దెఱచి తల్లికింజూపించెను. 37

వ. అమితామోదయగు నయ్యశోదయును దన్ముఖంబున, నెన్నఁడుంజూడఁబడని సమస్త చరాచరంబు నవలోకించి విస్మయమాన మానసయై యితండు సాక్షాత్పరమపురుషుండేయని పలుకుచు దక్షణంబుననే మరల మోహాగహానంబున బ్రవేశించెను. 38

—• ఉలూఖల బంధనాదివర్ణన •—

వ. తరువాత మరియొకప్పుడు నిరాఘాటంబుగాఁ బెరుగుకుండను బగులఁగొట్టుటంజేసి సంజాతరోషంబుఁగలదియై యశోదగోపించుటచేత యదునందనుండయ్యెడ దూరంబుగాఁ దొలగిపోయెను. 39

వ. పిమ్మట నతనిననుసరించియేగుచు నతిరుచిరుండును జిత్రవిచిత్రంబుగా గిరగిరఁదిరుగుటయందతిచతురుండును నగు నర్భకుంబట్టుకొనుటకు సమర్థురాలుగానిదై దుర్భరంబగు పరిశ్రమంబునొందెను. 40

వ. అది యుక్తమేయగును. 41

గీ. జగతిజంఘాలుగతితోడ సామ్యమొంది
దిట్టమగు మనసెవ్వానిఁ బట్టలేదొ
యట్టి కృష్ణునిబట్టుట కలవియగునె
సుమదగజయానయగు యయ్యశోదకరయ. 42

గీ. యోగమునగాని యీ మహాభాగుఁడెపుడు
బట్టుబడడని మానంబువడసి గూఢ
గతినిగొనిపట్టె కరమున గట్టముగను
నామెకెట్టిది ముక్తిప్రియత్నమికను. 43

వ. తరువాత నాబాలశౌరింబట్టుకొని రోటంగట్టుటకు సమకట్టెను. 44

గీ. అతనిబంధించుటకు గుణాయుతములైన
జాలవయ్యెనునయ్యెడ జాలనబ్రి
మొందిశ్రమగొను తల్లిచే నొనరనెటులొ
బద్ధుఁడయ్యె గుణాతీతభవ్యతనుఁడు. 45

వ. తరువాత నట్లుబద్ధుండగు యదుపతియా బాలశౌరియుఁ బూర్వకాలంబున విమతశరనంగతింగొని వస్త్రనిచ

యంబులు విడనాడి యువతీశతంబుతోఁ బరివృతులై యప్రా వృతకళేబరంబులు గలవారలయి క్రీడించునాతఁణంబునఁ దమ్ము వీక్షించి కోపించిన నారదుండిడిన శాపంబుచేత మద్దితరువులై మణిగ్రీవ, నలకూబరనామంబులుగల కుబేరకుమారులు మందిరసమీపంబున నుండుటవలన వారినిర్వుర ననుగ్రహించుటకు నులూఖలంబు నాకర్షించుకొని తత్సమీపంబునకేగెను.

చ. అలగిరిబోలు రోలుగొని యడ్డుగనీడ్చుచు బాలుఁడవ్విధిన్
మలగుచునేగి భూజయుగమధ్యమునుండి బిరానలాగుచో
ఫెళఫెళమంచుఁ బెల్లగిలి పెల్లుగగూలె మహీన్మహీజము
ల్వాలగొనె భూనభోంతరములన్ దగుతద్ధ్వనిభీకరంబుగాన్.

క. ఘన యదుతనయుని బంధము
మునిశాపవిపత్తినొంది భూరుహములుగాఁ
దనరు కుబేరసుతులక
య్యెను బంధవిముక్తికొఱకు నిలచిత్రముగాఁ. 48

గీ. హరికరుణచేత వారలిర్వురును బ్రికృతి
రూపమునువీడి తమ నిజరూపమొంది
ధన్యతరులౌచు వారలు దక్షిణమున
ఘనతరంబగు నుత్తరగతిని జనిరి. 49

వ. తరువాత నందగోపపురస్సరులై గోపకులందరుం బ్రావృట్కాల జలదసముదయంబుల, నిర్ఘాతనిర్ఘోషపరంపరకు సహాధ్యాయియైన యాకస్మికంబుగా భూరుహపతనసంభూతం

బగు చటులపటుపటారావంబును విని యిదియెద్దియో భయా వహంబగు మహోపద్రవంబు సంభవించెనని విస్మయమాన మానసులై వేగంబుగా వచ్చి శతధార విదారితంబగు ధరాధర శిఖరయుగళంబునకు మధ్యభాగంబున ఘూర్ణిలుచు నులూఖలనిబద్ధుండై యెందువలనను భయమొందని నిజార్భ కుంజూచి యిదియంతయుం బాలకునిచేఁ జేయబడినదని తత్ప్ర దేశంబుల మెలంగెడు గొల్లపిల్లలు దెల్పుచుండు మాటలచే నది నమ్మక పిమ్మట నబ్బాలుని రోటివలనను విడిపించి యా పదం బనేకయాపదల కాస్పదంబైనదనియును నుత్పాతశత విపరీతంబై నదియునుగాఁ దలంచి యిది నివాసయోగ్యంబు గాదని మంత్రులతోడ నాలోచించి తత్క్షణంబుననే కొమ్ము బూరల యారవంబుచే దిశలం బూరించుచు గోధనంబులను ముందిడుకొని కుంభినీరంభాయితంబగు నాభీర భీరువారంబును గైకొని వస్త్రభూషణాది సమస్తవస్తునిచయంబును శకటంబు నందుంచుకొని యతివిస్మయనీయంబును నతిరమణీయంబును నై సార్థకనామంబుగల గోవర్ధననగంబునందలి ధారాధరపవిత్ర రత్నములచే నతిమనోహరంబై కైలాసంబువలె నీలకంఠ నిలయంబును వైకుంఠపురంబుచందంబున హరినికేతన విలసి తంబై చతురాననునిపగిది సకలాగమసేవధియై యా మునీయ పులిన లోభనీయంబగునట్టి బృందావన ప్రదేశంబునందుఁ ప్రవేశించిరి. 50

క. బృందావనమునఁ దీనసు
బృందావనతత్పరతను విలసిల్లుచునా
నందాదులొనర్చిరి సా
నందత గోపాలనంబునకు నొకమందన్. 51

క. బలరాముఁడుఁ గృష్ణుండును
వలనుగ జనకాజ్ఞ వత్సపాలనపదముం
దలరిరి వసుదేవునికడ
దలగుట ప్రేపల్లెనుంట దగుఫలమదెగా ! 52

ఉ. సారెకుమల్లయుద్ధములు సల్పెడుక్రీడల నల్లమల్ల చా
ణూరవిఘాత దెల్పఁగ ననూనగతిం దగు బంతులాటలున్
గోరి చరించుచుండుటది కూరిమితో నలగోపభామినీ
చారుకుచావమర్దనసుచాతురిఁ దెల్పఁగ శౌరియాడెడున్. 53

గీ. వృషవివర్తపదంబది వెలయునెవరి-
కట్టివృషభను వేషంబు నందియున్న
గుణసమున్నతులగువారు గురువిలాస
మొప్పశిశుచాపలముచేత నొకరి నొకరు
బలిమిచే నాక్రమించుటబ్రింబుగాదు. 54

గీ. సకలసత్వగుణాస్పద ప్రకటలీల
యెవరియెడసంశయములేక నెసగుచుండు
నట్టిసంగతులగువారి కఖిలసత్వ

ఘనతరాసక్తి నత్కార్య కలనవలన
సంతతసుఖంబుగల్గుట వింతగాదు. 55

—• వత్సాసుర, బకాసురవధ •—

వ. ఈ విధంబుగా నతిశయించుచున్న వత్సపరిపాలన లోలుండును సంతతానందుండును దండ్రి యగు నందుని యాజ్ఞ శిరంబున ధరించియున్నవాఁడును నగు బాలశౌరిం గబళించుటకు ధర్మవిధ్వంసుండగు కంసునివలనం బ్రేరితుండై వత్సాభిధానుండగు నొక్కరక్కసుండు సత్వరంబుగానచ్చటికి వచ్చెను. 56

గీ. హితము నహితంబు నెరుగని హీనబుద్ధి
నిరతము పరాశనాశచేఁ దిరుగువత్స
వీఁడు గోవిందభుజదండ తాడనమున
భగ్నతనుఁడై తృణావర్త పదమునొందె. 57

వ. తరువాత బకనామధేయుండగు నొక్కబక్కరక్కసుండా యదునందనునిభుజించు దుర్బుద్ధి గొనివచ్చి యాతని చెంతం జచ్చి పూతనాసాహచర్యంబు నొందెను. 58

గీ. అనిశమాశ్లిష్టవరకమలాకరంబు
నధిక సన్మాన సావాస మతులబలస
మేతమగు హంసమునకిపుడెంచి చూడ
నిలను బకకృత పరిభవమెట్లుగలుగు ? 59

గీ. తనివిమై గుద్దులాటలఁ బెనగుచుండు
నపుడు హరిచేఁ బరాజితులగుచు గోప
బాలురాశ్చర్యమొందిరి బలినడంచు
వానిసత్వంబు చతురత వానిగూఢ
మగుచతుర్భుజతను నెవ్వఁడరయగలఁడు. 60

గీ. విమల యమునానదీ సైకతముల శౌరి
సేతుబంధన విధులతో చెలగియాడు
టెన్నగా మున్ను జలనిధి నింపుమీఱ
సేతువొనరించు సంస్మృతిన్ జెప్పుచుండె. 61

వ. ఇవ్విధంబున వసుదేవనయనారవింద దుర్లభంబులైనవియును, నాభీరశాబకభాగధేయ పరంపరలచేత పరిణతంబులైనవియును, నంభోజసంభవప్రముఖ బహిర్ముఖులచే లోభనీయంబులైనవియును, నగుబాలలీలా జాలంబులచే నశేషభువనంబుల నానందింపఁజేయుచు, వసుంధరారాజ్యభరనివారణంబుకొఱకు మర్త్యలోకంబునొందిన యాశ్వినేయులవలెనలరుచు మదనమాధవులలీల వనంబులందిరుగుచు, భూలోకవిలోకనలోలురగు జయంతనలకూబరులవలె వెలయుచు, విగ్రహంబును ధరించి సంచరించుచున్న యిష్టాపూర్తజన్య సుకృతనిచయంబుల తెరంగునం దనరుచు సర్వరామణీయక సర్వస్వంబునకు విశ్రమప్రదేశంబులచాట్పునం బొల్చుచు, వత్స పరిపాలనంబుకొఱకు విపినమార్గంబున సంచరించుచు, గురివింద

పూసల పేరు లురంబున ధరించి పెక్కువిధంబులగు పూలం మాలికలు శిరంబునం జుట్టుకొని వనదేవతలచేతం గూడ విస్మయంబుగాఁ జూడఁబడుచు ననేక గోపాలబాలకులతో, ననుగమ్యమానులై యొప్పుచున్న యా బలరామకృష్ణులఁ బ్రత్యక్షంబుగాఁ జూచి క్రూరచిత్తుండును మత్తుండును సార్థక నామధేయుండును నగు నఘాసురుండు సమీపించి నిజసోదర మారణంబువలన సంజాతంబగు వైరంబునకు ప్రతీకారంబు సేయు నాసక్తి గలవాఁడై వేడుకతో నొకమహీధరంబునువిడంబించుచున్న మహోరగ కళేబరంబునవలంబించి నోరుఁ దెఱచుకొని విపినవీథిని దారికడ్డంబుగా నివసించియుండెను. 62

## —• అ ఘా సు ర వ ధ •—

• వ. అట్టివాని నెల్లెడ నల్లగొల్లపిల్ల లెల్లరును జూచి యా బృందావన ప్రదేశంబునందగు నొక మహీధరంబుగాఁ దలచుచు నీనగంబు పన్నగంబువలె నున్నది చూడుఁడని తదీయకందరాగర్భంబును దానియాననంబుగను, గహ్వారంబున కిరుగడలం గల గండోపలయుగళంబును దాని దంష్ట్రాద్వయంబుగను, దద్గుహాంతరంబునజూపట్టుచున్న ఘంటాపథ మార్గంబును నతిదీర్ఘంబగుదాని జిహ్వాయనియును, నచటనున్న దావపావక ప్రయుక్తంబగు సమీరణంబును దాని శ్వాసానిలంబనియును, దవవహ్నిదగ్ధంబులగు జంతుసంతతులదుర్గంధంబును దానిచేతఁ దిని విడువబడిన పిశితపూతి గంధం

బనియును, శిఖరంబుపైని దిరుగుచున్న మేఘపటలంబును దానిఫణామండితంబగు నీలమణి నికురుంబంబనియును. నత్యంతంబు విశాలంబుగానున్న దరీముఖంబునుగని యది మనల నందరినిం గబళించుటకు వేడుకగలదాని వలెఁ గానవచ్చుచున్నదనియును, నిట్లు పరస్పరంబు నుత్ప్రేక్షించుకొనుచునిది యంతయు నిజంబుగా నగంబుగాక పన్నగంబేయైనచో బకాసురునివలెఁ జంపబడు ననుకొనుచున్నవారలై సాభిప్రాయంబుగాఁ గరతాళశబ్దంబులుసేయు మురహరు నాలోకించుచును విమర్శింపక సత్వరంబుగా దూడలతో గూడ దాని వదన గహ్వరంబునం బ్రవేశించిరి. 63

వ. భగవంతుండగు శౌరియును నామాయావియగు నఘాసురుని మాయానుభావంబును భావించుచున్నవాడై తన నెచ్చెలికాండ్రగు గోపాలబాలురకు కుశలంబును గోరుచున్న తానును వాని ముఖగహ్వరంబును బ్రవేశించెను. 64

సీ. వానిదా వదనగహ్వరమధ్యమునుజొచ్చి
నిశ్వాసవాయులన్నిగియబట్టి
ప్రకటత్రివిక్రమప్రక్రమంబునుబూని
చక్రితానయ్యెడ విక్రమించె
దానిచే నయ్యఘదైత్యుండు బలిచక్ర
వర్తియయ్యెను శిరఃపదమునుండి

ప్రాణవాతంబులు పైకిబోవుచునుండు
నపుడధఃపరిస్థితి నందకతగు
గీ. నట్టియున్నతపదమును నాశ్రయించె
బుడమిశ్రీహరిచేఁ జంపబడినయెట్టి
యఘజనుండైన మోక్షంబునందుననుచు
ధరణినరులకు బోధించు కరణినహహా! 65
గీ. హరి కరుణచేత నయ్యెడ నఘవిముక్తి
గలుగ జనులుమహానంద కలితులైరి
బుధులును తదీయ సిద్ధాంతవిధికి, నెటుల
నధికమగుప్రీతినొందిరో యద్భుతముగ. 66

వ. తరువాత శౌరియును వానిశిరంబునుండి బయలు వెడలిన తేజఃపుంజంబుతో మిళితుండై యమమందిరంబు నుండి వెలువడినలీల వానిముఖగవ్హరంబునుండి వెడలివచ్చుచుండెడు వత్సములతో గూడుకొనిన వత్సపాలురచేత నభినంద్యమానుండై యయ్యద్భుతకార్య సాహసౌదార్య శౌర్య ధైర్యాదులకు నంతసించుచున్న బృందారక బృందంబుచే నమందమందార కుసుమ వీచీపరంపరలచేత నభిషిచ్యమానుండై యవాఙ్మానసగోచరంబగు కొండొక పరమహర్షంబు నొందెను. 67

— గోపకులతో శ్రీకృష్ణుఁడు చల్దులారగించుట —

గీ. అఘముఖవిముక్తమైన గోపార్భకతతి
గొలువ యమునాతటంబునఁ గూర్మి శౌరి

లలితనర్మోక్తులను వేడ్కఁ గొలిపి వారి
తోడఁ బరితృప్తుఁ డయ్యెనుఁ గూడుగుడిచె. 68

గీ. శౌరిచరిత్ర మె,రుచియగునూగుగాయ
గాఁగ నమృతరసాస్వాదకబళములను
నొప్పుగాఁ బత్రిపటముల నుంచుకొని ని
జాన్నరుచిఁ దెల్పుకొనుచు ముదాప్తిగోప
బాలకులు చల్దిగుడిచిరి బాగుగాను. 69

గీ. గోపబాలకకులసమాకలితమూర్తి
గలిగి విలసిల్లెయామున పులినమునను
కలితరాకాసుధాకర కరనికరుఁడు
నంబరస్థుఁడు తారాగ్రహాదియుతుఁడు
నైనచందురుని వేషంబు నధిగమించె. 70

ఉ. శౌరికథాసుధారసము సారెకుఁ గ్రోలుచుఁ గూర్మిమీరనా
భీరకుమారకుల్ మిగులవిస్మృతినొందుటఁ జేసి యెంతయో
దూరముగాఁగనేగు పసిదూడలఁ జాడనుఁ జూడరైరి కం
సారికథల్ మదిన్ మఱపునందగఁ జేయవె యెట్టివారికిన్. 71

—బ్రహ్మ గోవత్సములను గోపబాలకులను నంతర్థానంబు సేయుట.—

వ. అటుపిమ్మట నెల్లకడలను గనులు విప్పిచూచి లోచనమార్గంబు నతిక్రమించి చనిన వత్ససంచయంబును గానక గోపాలబాలకులు విస్మితులై విషాదంబు నొందుచు నుండుచున్న సమయంబున, 72

చ. అలరెడు శౌరియప్డు కరుణాన్వితుఁడై పరితాపమానసా
కులులగు గోపబాలకుల గుండెఁడునెచ్చెలికాంద్రమోదసం
కలితులఁజేసి వత్సములఁ గన్గొనఁ దత్పదలీలనేగి బెం
పలరువనంబుఁజొచ్చెనుస్మితాననుఁడౌచునతార్తిఁదీర్పఁగన్.

వ. అట్టిసమయంబున నంభోజసంభవుండుసరభసంబుగా నఘాసురుని గర్వసంరంభంబు సర్వంబును విఘటనంబుసేయుట నెఱింగియును చతుర్భుజుని మహామానుభావంబు దెలసియుండి యును నది విశ్వసింపక మరల విమర్శించుటకు గోర్కెగల వాఁడై యచ్చటికి వచ్చి వత్సంబులను వత్సపాలురం గూడ నపహరించెను. 74

వ. భగవంతుండగు శౌరియును గాననమధ్యంబున గొంతివరకు వెదకి యచ్చటనెచ్చటనుం వత్సంబులను గానక మరలివచ్చి పులినోపకంఠంబునొంది యచ్చట వత్సపాలురం గానక యొకముహూర్తమాత్రంబు విస్మితహృదయుండై చిత్ర గతుని తెరంగున నూరకనిలచి పిమ్మట నదియంతయుం గమల సంభవదంభసంభూతంబుగా దివ్యదృష్టిచే నారసి తత్క్షణంబునసే వత్సవత్సపాలక సమూహాత్మకంబుగా దానైయై వెలయు చుండెను. 75

చ. హరిమయమైన వత్సములు నర్భకసంతతి వారివారి మం
దిరములకప్డు సాయమున దీరుగవచ్చుచు న్స్వస్వమాతలన్
మురిపెముసంద జేయుదురు మున్వలె నట్లొకవత్సరంబు శ్రీ

హారిదగు గూఢవర్తనము నాబలుఁడైన నెరుంగఁడయ్యె న
బ్బురమదిగాదు వారియెడపూర్వపు సంస్థితిమారకుండుటన్.

గీ. గొల్లలకు గోవులకుఁ దమపిల్లలందు
వత్సములయందపూర్వమై బరగుప్రేమ
గనిబలుఁడు విస్మయమునొంది కడకనెటులో
శౌరిరూపాంతరులటంచు వారినెంచి
వత్సరాంతమున ధృఢపరచె మదిని. 77

—• శ్రీకృష్ణుని బ్రహ్మస్తుతించుట. •—

వ. చతురాననుండును సంవత్సరావసానంబున మరల భూలోకంబునకు వచ్చి పూర్వరీతిగనే, విహరించుచున్న వత్స, వత్సపాలకుల నవలోకించి కొండొక మోహగహనంబునంబడి యాధార్థ్యంబుదెలసికొనసమర్థుండుగాక వినయపూర్వకముుగా బురుషోత్తమునిట్లని వినుతించెను. అది యుక్తమైనదేగదా! 78

సీ. చెలువొందదగు జగజ్జీవేశ్వరా భేద
వాదంబు దగదెల్పు వేదవాక్కు
స్వగతాన్య గతభేద విగతుండవగు నీకు
ద్వైతంబు లేదని తగవచించె
నటులైన నియ్యెడ నత్యద్భుతంబుగా
మించెనీయెడల్ల నేవంచజనత
ఘనతగాంచుచునెప్డు గణనకు మీరిబల్
ప్రాగల్భ్యము వహించి ప్రబలుచుండె

గీ. నదిమెనీమాయచే సమాక్రాంత మూఢ
హృదయమును గొని సంసృతి నెనసియున్న
మమ్ము మోహాంబురాశిని ద్రిమ్మరించి
వెలయు వంచన కలయంచు దలతుమీశ! 79

చ. దొరకొని సత్యరూపమగు దుఃఖము నాశమునొంది పోవలే
దరయ నసత్యరూప సుఖమైనను గల్గదు నీవుగన్పడక్
నెరనిజరూప మాత్రమున నిల్చుటయే ఫలమిట్టిదైన యీ
పరమగు తత్వమెంచకయె బాలిశులెద్దియొ కోరికొల్వగాఁ
బరగెడు వారికిందగుఁ భ్రాంతి దొలంగుటెలబ్ధి శ్రీవరా!

ఉ. నీవు పురాణ రూపుఁడవు నీసతిమాయయు ముట్టదెప్డునిక్
నీవు నసంగివౌదువట నిచ్చలు నీదగుచెంతనిల్చి తా
నేవిధి నీజగంబుగనె నిట్టిప్రవాదము కల్లయంచు సం
భావిత నిశ్చయుల్ బుధులు బాగుగనెంచరె శ్రీసతీపతీ. 81

చ. ధరణిని స్వేచ్ఛమీఱగ సదా, జరియించుమనంబుఁబట్టి స
ద్గురుఫలమానటంచు భ్రమఁగొల్పి నిరంతరబోధసాధకాం
కురమును బెంచనేర్పరచి కూర్మిసుధామయమైన తత్ఫలం
బరయుచు నీవుపాంతజడమైనమనంబును మాటుఁజేసి యే
మరక భుజింతు నీదయిన మాయమరల్ప సమర్థులేజనుల్.

చ. ఎసగుపురాణపూరుషుఁడ వెంచగనీదగుజాయమాయదా
నసతి త్వదీయజాతతతి యంతజడావళియౌ! జగత్ప్రభో!

మొసగదు నీకెసంస్మృతి నొకింతసుఖంబని యాశ్రితున్రుచిన్
మసలగనీక నీకటసమానునిఁ జేసెదవద్భుతంబుగాన్. 83

చ. జలజవిలాసమిత్రములు సారదయారసపూర్ణతుంగయుక్
కలితసుధాబ్ధివీచిసుభగంబులు న్యాత్వదపాంగవీక్షలన్
జలికిప్రతప్తునన్నుఁ బరిషిక్తునిజేయుము నీవు నాదు చా
పలము సహింపుమిప్డు మదవజ్ఞకృతంబగునట్టిదీశ్వరా. 84

గీ. ధాత యీరీతి శ్రేయఃప్రదాత తాత
ప్రీతిమై ముజ్జగంబులఁ బెంచునేత
యైన సర్వేశ్వరునిగాంచి యభినుతించి
ప్రమదమున నాతఁ డపుడాత్మపదమునొందె. 85

క. కరుణావరుణాలయుఁడా
హరిసఖులగువత్సపాలకాళికిముదమున్
నెరపివ్రజమొందెద ఘా
సురవధకథవెలసె నచట చోద్యంబగుచున్. 86

వ. అటుతరువాత, నొకప్పుడు మదపుటేనుగుల శుండా దండంబుల తాడనంబులచే గదలుచున్న సమస్తవృక్షశిఖరంబులనుండి రాలుచుండెడుకుసుమవిసరంబులమధ్యభాగంబులనుండి జారుచుండెడు మరందధారలచేత దట్టంబులైనవియును, యమునాతరంగిణీతరంగమాలికాసలిలంబులచేత జలింపఁజేయఁబడిన రాయంచల పక్షపుటంబులచే నెగురగొట్టఁబడిన బిందుబృందంబులచేత బలిష్టంబులైనవియును, నురగవరుండగు శేషున

కపరావతారంబైన బలరాముని సేవించుటకు మలయశైల తటంబుల నివసించియుండు సురస్సరవిలాసినులచేత సాదరంబుగా ప్రేరితంబులై వచ్చుచున్నవియును, నుదరంబులంగల మకరందబృందంబు నాస్వాదించి మదించిన గండుతుమ్మెదల తండంబులచేత ముఖరితంబులైన వికచ కుటజ చాంపేయ కుసుమ పరిచయంబువలన సముదంచితం బగు నామోదంబుచే మేదురంబులైనవియును, వనదేవతావదనమారుత పరీరంభంబుచేత విజృంభితంబులైనవియును, నగు బాలానిలంబులచే నుపలాల్యమానంబై నందనవనంబువలె హరినందనంబును, సదనుగ్రహంబు చందంబున సకలఫలాస్వాదంబును నై యొప్పుచున్న బృందావనాంతరంబునంగల తాళవిపినంబునం దనుచరప్రార్థితులై సంకర్షణ మధుసూదనులిర్వురును వారలతోడంగూడఁ బ్రవేశించిరి. అక్కడ— 87

—• ధేనుకాసురవధ. •—

గీ. తనరురోషదపరుషనితాంతరావ
ములను వనమెల్లఁ బూరించి బలుఁడు సఖుల
మదికి సంతుష్టికొరకు సమ్మదమెసంగ
తాళఫలములుఁ బడరాల్చె తనివిమీర. 88

గీ. ఘనముగా తాళఫలపాతమునజనించు
చటచటారావమెసగె నచ్చటవని, నది

వినుచుఁ గోపించి ధేనుకుఁడనెడు దనుజుఁ
డపుడు ఖరరూపమునవచ్చె నదిరిపడుచు. 89

గీ. వత్సనాశనమునగడు వనటజెందు
ధేనుకాగమనముఁగని ధీరహలియు
వత్సపదమునుజెందించె బాలురపుడు
బలుని బొగడిరి సంతోషకలన నీతఁ
డెటుల బలజయ్యుఁడగునని యెంచిమదిని. 90

వ. తదనంతరంబున వానియనుచరులగువారలును నతి భయంకరంబుగా ఖరతరంబగు, జంబుకరూపంబులు ధరించి వచ్చినతక్షణంబె బలరామకృష్ణు లిర్వురును వారినందరిం దరిమి తరిమి సమూలచ్ఛేదంబుగా నాశనంబు నొందించిరి. 91

— శ్రీకృష్ణుఁడు కాళీయమర్దనము గావించుట. —

గీ. పిదప మూర్ఖభుజంగసంపీడితయును
బ్రకృతిచేతనె విమలస్వభావయునగు
దురితనికరశమనసహోదరిని దాని
బ్రోవనటకేగెఁ బురుషోత్తముఁడు బిరాన. 92

వ. అచ్చట నాక్షణంబుననె ప్రభాకరకిరణసంపాతంబు చేత, నుద్రేకించిన పరితాపాతిశయంబునలన గలిగిన సలిలపానేచ్ఛచేత కాళీయవ్యాళంబుచేఁ గ్రక్కఁబడిన, గరళంబు వలన శబలవర్ణంబు నొందియున్న కళిందనందనాజలంబులం

గ్రోలి వత్సలతోఁగూడ వత్సపాలురగు బాలురందరు మూర్ఛ
నొందియున్నసమయంబున. 93

శా. క్కారుణ్యామృతపూరసారభరణాకల్పంబు లుత్తుంగముల్
పారంబొందనివౌ నపాంగములచేఁ బాడాంబుజాధీనులౌ
వారిన్ బ్రాణములొందఁజేసియమునావార్మధ్యగంబున్ విషో
ద్గారాగ్నిజ్వలితంబుసర్వగృహముల్ దర్పించుచున్ శౌరి, మే
లీమ్రన్ సాలశిరంబునుండియురికెన్ లీలాకులాయుండుదాన్.

కం. ఖరకాళీయుఁడు స్వభవవ
పరిభవరోషంబువలన వచ్చెను నపుడ
య్యరుచిరచరితుఁడు మురహరు
గౌరికెన్ ఘోరంబులైన కోరలచేతన్. 95

గీ. భుజగవిషవహ్నికీలలఁ బొడము పరిభ
వంబు విషధరశయనుండు బడయఁడయ్యె
చక్రులకు నగు నన్యోన్య జన్యమునను
నొకరికిని గల్గదలగరళోగ్రబాధ. 96

గీ. భుజగభోగపినద్ధుఁడై వొల్చు శ్రీశుఁ
డపుడు జలియింపగాఁజాలఁడయ్యె నహహ!
నిది విచిత్రముగానొప్పు నితనియందు
భుజగభోగజబంధంబు బొసగుటెట్లు. 97

చ. హరిమెడఁగాళియాంహ్వయఖలాహికృతంబగుబంధరోప
పరిభవమట్టిదుఃఖమునుబాలకులారసిమందబుద్ధులై [మా

పరపగుమోహమొంది యదివ్యర్థముగా, గనజాలకెట్టులీ
తరిని విముక్తి గల్గు హరి దర్శనసౌఖ్య మదెట్లుగల్గు నీ
యరుదగుగుండెటుల్ దొలగునంచవశత్వమునొందిరయ్యెడన్

—• నాగాంగనలు శ్రీకృష్ణుని నుతించుట. •—

వ. భగవంతుండగువాసుదేవుండును గొంతవరకు బాల భావంబు నభినయించి తన సహచరు లగువార లందరును నితాంతచింతచే దంతురితంబులగు నంతరంగంబులుగలవారలై చూచుచుండఁ జమత్కారంబుగాఁ బైకెగసిపడుచు, సారె సారెకుం జరణతాడనంబులచే మస్తకంబు నణగద్రొక్కుచు, భుజంగంబు నసమర్థుంగావించి మిగులమర్దనంబు నొనరించెను. 99

వ. అటుతరువాతను తమప్రాణేశ్వరుని ప్రయాణోన్ముఖంబులగు ప్రాణంబులుగలవానిగాఁ దెలిసికొని వానిప్రాణప్రియలగు కాంతాజనంబులు సరభసంబుగా వచ్చి యధోక్షజుని శరణుజొచ్చి సవినయంబుగా నిట్లు వినుతిగావించిరి. 100

చ. నెలకొనుమత్సరత్వమున నిన్ స్మరియించినవారికైన బల్
జెలువగుమోక్షమిచ్చెదవు చిత్తములేకయెనీదునామమున్
బెలుచనుబల్కువాని భవభీతినిబాపెదవౌర కొంచెమౌ
ఫలములో నీరమో తులసిపత్రమొ భక్తినొసంగునంతనే
వలచిగ్రహింతు వెంతయు నపారకృపారసపూర శ్రీవరా!

చ. మరుపున దేనిచేత క్షణమాత్రమువీడని సద్రసార్ద్రిభా
వ రహితయయ్యెదుర్ హితయు బ్రాణసమానయు నౌ సతిర్ బ్రియర్
బరికరసేవకాదులను బాసి గజేంద్రకృతాతిదీనవా
గ్భరరవమాలకించి కడుభ్రాంతుఁడవైతి తదీయరక్షణా
దరగతి, నట్టినీదయ సదా శిరులీవుత మాకు శ్రీకరా!

గీ. సాధుదీనాత్మకులయపరాధరీతి
నరసభవదీయసిద్ధరసప్రభావ
కలన కళ్యాణభావంబుగాంచకున్న
వలదనర్థాప్తివారింపబడునె? కృష్ణ! 103

గీ. ఆత్మ నెరుగని యజ్ఞాని కగును గుందు
ప్రభుఁడవగు నీస్వరూపంబు బడయునాతఁ
డుపశమము నొందుటొప్పు వాఁడిపుడు మరల
శోక మొందుచునున్నచో నీకునెటుల
దగు కృపాంబుధివనుఖ్యాతి ధరణినాథ. 104

గీ. భోగిచూడామణి యతండు పుడమియందు
మేము భోగినులమటంచు మించెఖ్యాతి
గరుడవాహుఁడవగు నీదు కరుణలేక
భోగభాగ్యావమెటులను బొందగల్గు. 105

క. భూభర్తవగుచు నంబుజ
నాభా! నీవల, రమాసనాథత వెలయర్

శోభనకరుణాబ్ధీ ! మా
సౌభాగ్యోపద్రవంబు శమియింపు హరీ ! 106

వ. ఇవ్విధంబునఁబలికి నయనయుగళంబునుండి బాష్ప వారిపూరంబుజారుచుండ హృదయంబునుండి వెచ్చనగునిట్టూర్పువాయువుల వెలిబుచ్చుచు నొచ్చియున్న యయ్యజగర వధూమణులచేతం జల్లబరచబడిన యుల్లంబుగలవాఁడై కారుణ్యకల్లోలమాలియగు నవ్వనమాలియు నటులనే యని యంగీకరించి వారలనోదార్చి తత్క్షణంబ సాగరంబునకేగుమనియును నిచట నొకనిముషమాత్రంబైన నిలువదగదనియునుందెలిపి యాకాళీయాఖ్యబివేశయంబున కాజ్ఞయొసంగి దుఃఖించుచున్న సహచరనిచయంబుల నూరడించి, వారితోఁగూడ నిజసదనంబునకుం జనియెను. 107

—• వేపవికాలవర్ణనము. •—

వ. అటుపిమ్మట మఱియొకప్పుడు మదనకదన శంఖారావంబులగు మధుకరనికరఝుంకారరవంబులతో మిశ్రితంబును మనోహరాకారంబులు గలవౌటంజేసి వనదేవతలచేతం బోలె నడుగబడుచుండెడు కుశల ప్రశ్నంబులుగలవియై వెలయుచున్న వియును, వికసితంబు లగునట్టి మల్లికామతల్లికాపాటలీపటల చాంపేయ కుసుమంబులం గల సౌరభంబు నాస్వాదించుట చేత సురభిళంబులై నవియును, ననిశంబును బ్రవర్తించుచున్న

ధారాయంత్రంబులనుండి నిరర్గళంబుగా జారుచుండెడు వారి ధారలతో విహారంబులు సల్పుచున్నట్టివియును, మిగుల జలిం చుచుండెడు శిఖరదేశంబులుగల తరుపంక్తులచేత సానందం బుగా నభినంద్యమానంబగు సమాగంబుగలవివలె నొప్పుచు న్నవియును, ప్రతిదిశలను నశనంబుకొఱకుఁ దిరుగుచుండెడు నురగకులంబులచేఁ గబళితంబులగుటంజేసి విరళప్రచారంబులు గలవియును, నగు బాలానిలంబులచేఁ బ్రాణంబులు ధరించి యున్న ప్రాణికోటులు గలదియై పరగుచున్నదియును, స్వకీయపరితాపోద్రేకంబు సహింపఁజాలక ప్రతిబింబదంభం బున నభ్యంతరంబు జొచ్చి మునుగుచుండెడు ప్రభాకర కిరణనికరంబులచేత నించుకంత వేఁడి నొందింపఁబడిన సకల సలిలాశయంబులు గలదియును, సముదంచితంబులగు నెండ మావులయందగు సలిల వీచికానిచయంబనెడు, మనోరథంబు నిష్ఫలంబుగాఁ జేయుచున్న దినమధ్యంబునందు విజృంభించు చున్నదియును, సముదితంబగు యావనంబు గలిగియున్న యన్నుమిన్నలచేఁ జెన్నుమీర వెతుకఁబడుచుండెడు పుష్ప సమయంబు గలదియును, చిరతర విరహిణీ జనంబుల నయ నయనంబులందు మాత్రము విశ్రమించుచున్న వర్షాసముచ్చే షంబు గలదియును, పితామహ పురుషాయుష్యమాత్రంబు నవలంబించియున్న శరదా యామంబు గలదియును, ప్రబల తరంబుగా నూహింపఁబడుచుండెడు ననర్థంబును బరిహరించు

కొను నిచ్ఛచేతంబో లె తుషారగిరి కందరాంతరంబున తపంబు గావింప వేడుకపడుచుండు హేమంత సమయంబుఁగలదియును, తరుణీ కుచకలశయుగళ మధ్యంబునంగప్పఁబడి వర్తిల్లుచున్న శిశిరభావంబుఁగలదియును, భోజ్యవిశేషంబులందు విరసంబును పిపాసాధిక్యంబును గలిగియున్న సకల జనంబులు గలదియును నగుటం జేసి, యంబువునకుజీవనభావంబు సమర్థింపఁ జేయుచున్న చలువ పందిళులగములు, నిలయంబులుగా నివసించియుండు విలాసిజనంబులతోనగు చిరకాలపరిత్యాగంబువలన గలిగిన శోకాతిరేకంబునఁబోలె నూష్మవ్యాజంబున నిరంతరంబుగా బయలువెడలిన నిశ్వాసవాయువులు గర్భంబునంగల భవనాభోగంబులు గలదియును, ద్రాక్షాసవాది పానకంబులు పానంబొనర్చుటయందె ముఖ్యతాత్పర్యంబును, మంచిగంధపుపూతయందె సదాసక్తియును, పుష్పశయనంబులందె శయనించు వేడుకయు, పానీయశాలలందె నిజాశయప్రవృత్తియు, జలకేళులందె సాదరతయు, పద్మమాలికల ధరించుటయందె కుతూహలంబును, హిమకరకిరణావలోకనంబునందె కోరికయు, నిశాసమయంబునందె పెక్కు మక్కువయును, విషయలోలురగు కాముకజనంబులకుఁ గల్పించుచు, సులభంబుగా సలిలావగాహనంబు సేయుటకును, సుగమంబుగా నీడలం బ్రవేశించుటకును, తలగడలు లేకయే శయనంబు గావించుచుండుటకును, పానీయ శాలలం దొరుకుచుండెడు చల్లనగు నతిమధుర

తరోదకంబులు గ్రోలుచుండుటకును, తాళవృంతంబులతి సుకరంబుగా సంభవించుటకుందగినదియై యొప్పుచు దరిద్రులకుం గూడ నించుక భోగసుభగత్వంబుఁ గలుగఁజేయుటకు సమర్థంబై యొప్పుచు బయలువెడలెడు నంతరంగ పరితాపమాత్రంబుననే పరిభవంబునొందుచున్న విరహిణీజనంబుల ప్రాణంబులను సత్వరంబుగా హరించుటకు వెలుపలంగూడ నపరిమితంబుగాఁ బ్రబలుచుండెడు వేడిమికిం గ్రీడానిలయంబై వెలయుచున్న గ్రీష్మాగమసమయంబు విజృంభించెను. అక్కడ—

గీ. యామభావంబుచేత బ్రియామయగుచు
సకల యగుచుఁ గలానాథ సహితయగుచు
నపు డనాయామయగుచుఁ గృశాంగి యగుచు
కామనీయకమును జెంది కనురుచించె
యామినీ కామినీమణి సేమ మెసఁగ. 109

గీ. మాధవ బలాక్రమణమున మహిమగాంచి
యల్లబృందావన పదంబదెల్ల గంధ
కలన శోభిల్లుచున్నను గల్గదయ్యె
నల పలాశ విజృంభణ మబ్బురముగ. 110

గీ. రమ్యబృందావన పదాంతరమున మెలగు
యాదవేంద్రుని మృదు వేణునాదకలన
దగు వినోదంబువడయుచు జగతినెట్టి
మందజనులైన నానంద మొందకుంద్రె ? 111

వ. అది యుక్తమేయగును.

చ. జననమునం దెకొన్ని యనుజన్మము జెందిన వెన్కగాయకుల్
గొనబుగఁ జేయనొప్పునవికొన్ని యునై తగురంధ్రపాళులఁ
వనరుచుఁ జుల్కనైన యలవంశము శౌరికరాప్తిచేత దా
ఘనసరసత్వమూని శ్రుతిగైకొని మోదముసేయుటబ్రమే ?

వ. అట్టిసమయంబున గోరూపంబు ధరించి ప్రలంబ నామకుండను నొకనిశాచరుండు బలరాముని బరిభవింపం గడంగి వచ్చి యతనిచేతహతుఁడై ధేనుకాసురునకు సిద్ధించిన పదంబుననె వీఁడునుం బ్రవేశించెను. 113

-• శ్రీకృష్ణుండు దావాగ్ని నిమ్రింగి గోగోపసంఘమును రక్షించుట. •-

వ. అటుపిమ్మట నటవులందహించుచుండెడు దావానలజ్వాలావళులచేత వత్సపాలురగు గోపాలకురందరును నాక్ర మింపబడియున్న తరుణంబున. 114

క. హా! రామకృష్ణ సురగిరి
ధీరా! కరుణారసాబ్ధి దీనార్తిహరా!
తీరుగఁబ్రోవవె యనుకుర
రీరావసమార్తనాదరీతి హరివినెఁ. 115

గీ. శ్రీశుఁ డాశ్రితవాత్సల్య శీలుఁడపుడు
ప్రళయకాలాగ్ని సదృశమై బ్రబలువహ్ని
నమిత యోగబలాన్వితుండగుచు సంహ
రించి సఖులకు ముద మొనరించి మించె. 116

గీ. ధరణిజనులట్లు దాను నాతపముచేత
తప్తయగుటనో మురవైరి దరికిఁజేరె
నురుముల నిరెడు మిషచేత మొరలనిడుచు
వానయను మిషగుందుచున్ వర్షరామ. 117

గీ. సర్వమామోదితంబై యెసంగెనపుడు
భవ్యకాదంబ జృంభణవై భవమున
నైన కాదంబ పరిజృంభణాతిమోద
కలన లేదయ్యె చిత్రంబుగా ధరిత్రి. 118

గీ. దేనియాగతి విరహిణీ మానినులకు
హానియొనరించు ప్రావృడత్యంతచటుల
విసరణ వ్యాప్తినొందుచు నెసగునట్టి
వాయువు సదాగతి యగుచు బరగు టెట్లు? 119

గీ. మలినుఁడతి చంచలుఁడు విషమయహృదయుఁడు
సద్గుణ తిరస్క్రియలఁ జాలసల్పు మేఘుఁ
డైన వినుతింత్రుకొందరు దీనులతని
జీవన ప్రదుఁడగుటచేఁ జెన్నుమీర. 120

గీ. గర్జితంబులచేతను తర్జితయయి
బెడగు మెరుపులచేతను భీషితయయి
ప్రావృడిందిరచేతను భయముజెందు
నట్టి సర్వంసహాస్థిర నమలసేయ
వచ్చెనప్డు శరద్రమ భవ్యగతిని. 121

గీ. అయ్యెడ ఘనాగమాంత భాగాప్తిగలిగి
రమ్యవిమలాశయము పంకరహిత మగుచు
వెలసె మధ్యమలోకంబు విశదముగను
నచ్చటను హంసదర్శనమగుట యరుదె? 122

గీ. ధరణి నయ్యెడ పక్షపాతంబు మిగుల
నీలకంఠైక విషయమై నెగడుచుండ
వాసుదేవునియెడ రక్తిబడసె జగతి
యహహ! యిదియెంతొ చిత్రమై యలరుచుండె. 123

వ. అటుతరువాత శరత్కాల మతిక్రమించినదై యున్న సమయంబున.

చ. అరయసుదృగ్జనుల్ మనసిజార్తినిగుందుచు తద్వ్రజంబునన్
హరిగానసట్టిసంసృతి నిరర్థకమంచు దలంచి తద్గుణో
త్కరనుతి సేయుచున్ గథలుగానముఁ జేయుట యోమనంబొయా
హరిగన సాధనంబనుచు నాకులచిత్తము నొందిరయ్యెడన్.

గీ. అఖిలజగములకును నాథుఁడై నహరియె
మాకునాథుఁడుగా నగుగాక యనుచు
మార్గశిరమాసమున గొల్లమగువలెల్ల
నెఱపిరయ్యెడ కాత్యాయనీవ్రతంబు. 125

వ. తరువాత వివిధగంధాక్షతపుష్పమాల్యానులేపనాభరణాద్యనేకోపచారంబులతో భగవతియగు భవానింబూజించి యివ్విధంబున సన్నుతించిరి. 126

—• గోపికాగీత దేవీనవరత్నములు. •—

ఉ. దేనిమరందబిందువులు దీనతయన్ శిఖనార్పుచుండు నె
ద్దానినిఁ గేళియుద్ధమున ధన్యశివుండు వినమ్రుఁడౌచు సం
ధానితమౌళి, చంద్రకసుధారసధారల ముంచునేది సు
శ్రీనిధిపద్మశోభను హరించి రుచిన్ రహిమీరుచుండు న
ద్దానిని నీదుపాదవరతామరసంబును గొల్తుమంబరో. 127

చ. జనని! నుతించునానలువ శక్రుఁడు మ్రొక్కుచునుండె, శౌరియ
య్యనఘుతకల్పమాల్యసమమైనభవద్గుణముల్ వచించునం
చునునలపార్శ్వగుల్ తెలుపఁ జూపులనింపుచుఁ గేళికీరమున్
గొనునలలోకమోహినిదగున్ విజయంబుగమాకుముంగిటన్

చ. అలరుముదశ్రుపూరభరితాక్షులతో దగుమేన నొప్పుబల్
పులకలతోఁ గడున్ జెమటబూసినదేహముతో సగద్గదో
జ్వలనినదంబుతోఁ దెలియవచ్చెడు నెద్దియు లేనివృత్తితో
నలవడుధన్యులెందరో దయారసవార్ధిని జిన్మయున్ హాలా
హలధరమోదకందమును నంబను నిన్ భజియింతు రీశ్వరీ.

చ. అనిశము దారధీరులుమురారిపురారిముఖుల్ దమోదయుల్
ధనవినుతిప్రియాత్మలగు దైవములెందరు లేరు? భూమినై
ననుదగెనాదు మానసము నవ్యదయారసపూరితాత్మవై
జననుతకల్పవల్లి సదృశంబయి శంకరమోదహేతువై
దనరెడునట్టి తేజునను ధన్యతమీరగ కోర్కెదీరగాన్.

చ. పనియొనరింపమింతయు తపంబునొనర్పము దైవతంబులన్
గొనినుతిసేయమెన్నడును గోరమొకించుక మైననెమ్మదిన్
మనియెడు మంగళంబులకుమంగళమై రహిమీరిశ్రీమాత్రిలో
చనునితపఃఫలంబుగ, నెసంగుమహంబుదలంతుమాత్మలోన్

చ. అలహిమశైలజాతము సురాధిపనీలసమాలకంబు స
ల్లలితవిలాసకీరము కలాధర నవ్యకలాధరంబునై
వెలయుదయామయంబుశశిబింబసమాస్యమదారుణంబునై
యలరెడుహారిహారమరుణాకృతినమ్మహమెంతుమాత్మలోన్

చ. అరయసుధారసాతిమధురాధరమున్ స్మరవైరిమానసా
దరసుమదావహంబు నిజదాసజనాధికదైన్యదావమున్
సురుచిరపద్మరాగరుచిసోమకలాన్వితమస్తకంబునౌ
సరసమహామహంబునను సారెమునుంగుత మామనంబికన్

చ. దినకరుతేజమున్ తుహినదీధితుకాంతియు నగ్నిదీప్తియున్
దనరెడుకన్నుదామరల దాల్పుసుధారసమోదదంబు స
ద్గుణగణసౌరభంబు పరిగుంభకదంబవనీ నివాసియౌ
ఘనతరతేజమందలరుఁగావుత నాదగుచిత్తమెత్తరిన్. 134

చ. స్ఫురితదయారసాంబుపరిపూర్ణములబ్జరిపుల్ సుధారసో
త్కరవిలసత్తరంగములు తావకవీక్షలనెప్డుమావయిన్
నెరపుముధన్యతన్ గనెద నీకునుదానశ్రమంబులేదు సు
స్థిరయశమొందెదీవు నిలసేవకరక్షణచేత మాతరో! 135

క. నీ యమితదయ యశోదా
దాయాదుం డధికతరదయామయుఁడును నౌ
నాయదుపతి మాదయితుని
నేయుము దానన్శ్రేమంబు జెందెదె! దేవీ! 136

వ. ఇవ్విధంబున మరలమరల వినుతించి భగవతియగు భవానిం దమమనోరథంబు సఫలంబుగావింపుమని గోరుచు వల్లవపల్లవాధరలందరుం గమికూడి వేడుకతో నామాసంబు నంతయును వ్రతంబుగావించిరి. 137

ఉ. శ్రీగిరిజాకృపారసఝురీశుభసౌరభవత్కటాక్షశో
భాగురువీక్షణంబులలభాసురకల్పలతానుమావళుల్
గాగొనిసత్కవీంద్రుఁడనఁగాదగు శ్రీనవకాళిదాసుబల్
బాగుగదారచించెనటఁ బండితమానస సద్విలాసమా
భాగవతాఖ్యచంపువున బ్రౌఢిద్వితీయవిలాస మొప్పెడున్

చ. శివగిరిజాదయారసవిశేషపరీతకటాక్షవీక్షణో
ద్భవతతసాహితీసుకవితారసభాసురసుందరాఖ్య స
త్కవికృతమానసౌరభసుధారసధారల మీరునాంధ్రభా
గవతపుచంపునన్ వినుతిగాంచుద్వితీయవిలాస మొప్పెడున్.

గద్య.

ఇది

శ్రీమన్మహారాజ్ఞ రాజేశ్వరీ కరుణాకటాక్ష వీక్షాలహరీ పరీత సంగీత సాహిత్య సరసకవితాచాతురీధురీణ లౌకికవిద్యా

విశేష ప్రవీణ సత్యవోలు కులకలశ జలధి కువలయమిత్ర
భారద్వాజసగోత్ర భగవత్కవివంశ పవిత్ర సోమరాజా
మాత్య పౌత్ర వెంకటరాయమంత్రి వరపుత్ర
రామాంబా గర్భశుక్తిముక్తాఫలోదయ సకల
సుకవి విద్వజ్జనవిధేయ సోమసుందరకవి
నామధేయ ప్రణీతంబైన శ్రీమ
దాంధ్ర చంపూభాగవతమునందు
ద్వితీయవిలాసము
సంపూర్ణము.



శుభమస్తు. శ్రీరస్తు. అవిఘ్నమస్తు.

శ్రీశాంకరీదేవ్యైనమః

# శ్రీమదాంధ్ర చంపూ భాగవతము

## తృతీయవిలాసము.

—• గోపికా వస్త్రాపహారణము •—

క. జలవిహారణ సాదరలై
యలవల్లవ వనితలెల్ల నయ్యెడలననా
విలయగు యమునను జేరిరి
జలజాక్షుని హృదయమునను స్మరియించుచొగిన్. 1

క. తమవలువ లచట విడిచియె
సుమశరతర వారిలీల సొగసొందెడునా
యమునాలహరిం జొచ్చిరి
వలపులు వెదజల్లునెల్ల వల్లవయువతుల్. 2

క. హరియపుడు నేత్రనిచయము
హరియించి సమీప నీపమయ్యెడ నెక్కెన్.
దరుణీమణులది గనజా
లరయిరి జలసంగ నిరతలాలస లగుచున్. 3

వ. తరువాత చిరతరంబగు జలక్రీడా విహారంబువలన మిగుల నలసినవారలైన యా వారిజాక్షులందుండి బయలు వెడలెదు నిచ్ఛచే సరోవరతటభూమి నవలోకించి యచ్చట తమతమ పట్టుపుట్టంబులంగానక, సరఃసమీప నీపపాదప శిఖరంబునందు తమ పరిధానంబులు గ్రహించి పట్టుకొనియున్న యన్నవనీత చోరుండగు బుండరీకాక్షు నవలోకించి, విస్మితంబగు మనంబు గలవారలై యుండిరి. 4

గీ. అయ్యెడ మనోహరంబుగా నంగనలకు
నగవులు పరస్పరాలోకనములు, శంక
లమిత సంకోచములు విభ్రమములుజూపు
నాంగజంబగు పాండిత్య మతిశయించె
నది యధోక్షజు మదిగూడ నపహరించె. 5

వ. అటుతరువాత నాభీర తరుణులందరు నయ్యదు తనయున కివ్విధంబున సవినయంబుగా విన్నవించుకొనిరి—
ఓ కరుణాసముద్రా! యశోదానందదాయకా! 6

క. కనుగొన నేదిశలను నీ
ఘనతర గుణగణము గప్పగాలేదా? స
ద్గుణ నిధికి నీకు దగునే!
పనిగొని యబలాంబరములు వలసి హరింపన్. 7

క. వ్రతమునకు ఫలము నీదగు
హితదాస్యము మాకునదె, విహితముగనాసా

దితమయ్యె నికనొసంగుము
కృతగోపన చేలములను కృష్ణ! మురారీ! 8

వ. ఈలీల మృదుమధురంబులగు చతురవాక్కులచే వారలందరుం బ్రార్థించుచుండ, నకౌటిల్యంబుగా నరవింద లోచనుండిట్లు మారువలికెను. 9

క. తనరుకువిందుఁడ! మాచే
గొనువ్రితమున చేలపాలకుఁడవై తివటం
చును జతురత బలికినమీ
పనువడునల శ్లేషవాక్య ఫణితినరసితిన్. 10

క. నదినుండి మీరలొకరొక
రిదెరండిక వేరువేర నిపుడీదాసుం
డ్వదిగని మీమీ వలువలు
విదితముగా మెచ్చియిచ్చు వినయముమీరన్. 11

వ. ఈరీతి నర్థాంతరకల్పనలచే విడంబనా తత్పరుండై భగవంతుండగు వాసుదేవుండు వల్కుచుండ గత్యంతరా భావంబువలన లజ్జానుభావంబుతో జలమధ్యంబున నిలచి చలిచే గడగడ వడంకుచు దక్షిణహస్తంబుచే నాచ్ఛాదింప బడిన గుహ్యప్రదేశంబును, వామకరతలంబున గప్పబడిన వదన గహ్వరంబును, గలవారలై వారిమధ్యంబును విడచి వినమితావయవములతో నతి కష్టతరంబుగా జలాశయంబు నుండి బయలువెడలిరి. 12

గీ. అపుడు తీరము జేరియు నలత్రిపాబ్ధి
మునిగి తేలుచునుండెడు ముగ్ధతరుణు
లొకరి నొకర టుగ్గైకొని యుండెకాని
వేరె యవలంబనము లేదు వారికెల్ల. 13

గీ. కప్పబడు నూరుమూలంబు గలుగుగోప
ముగ్ధరమణీమణీ గణములనుజూచి
వారలట్లుంద్రిగా వ్రత వ్రతవిశేష
మిటుల ఫలియించె నాయెడ నిపుడటంచు
మదిదలంచెను గోపాల మౌళియపుడు. 14

గీ. అఖిలమును జూపునట్టి మురారియపుడు
గనుగొనని గుహ్యమేది యాకాంతలందు
నైనవారల మదికి మోహంబుగొలుప
దగనిటులబలికె హరి చిరునగవుమీర. 15

గీ. అంజలులు శిరముననుంచి యతుల నతులు
బరగసల్పుడు మీమనో భావమరసి
స్పష్టముగజూచి మిగుల సంతుష్టినొంది
మీయభీష్టము లొనగూర్తు మేరమీర. 16

వ. ఇవ్విధంబున బల్కుచుండెడు నీవంచకుండు నుడి వినవడువున గడువడిం జేయకుందుమేని తనకృతనిశ్చయంబు నుండి మరలనివానిగా నెంచుకొని, యావల్లవసుందరు లంద రును నవ్విధంబున నొనర్చుచున్న సమయంబునఁ గరుణించి

గీ. హరియు నయ్యెడ నామోదమంది వారి
వారి వసనంబులెల్లను తీరుగా, నొ
సంగ్యుచును నిజసంబంధ సద్వ్రితమున
కిదెఫలార్పణ మనిపలికె ముదమువిూర. 18

గీ. అపుడు తమవల్వలనుగొని హర్షముగను
వ్రిజమునొందిరి వల్లవ వనితలెల్ల
కేశవాదేశమునజేసి యాశయనెడు
పాశమున బద్ధమైనట్టి యాశయమున. 19

—♦ మునిభార్యలన్నమును దీసికొనివచ్చి శ్రీకృష్ణునారగింపజేయుట ♦—

గీ. అప్పుడశనాశగొను వివశాత్మ్మలమము
పాలనమొనర్చుమా! శ్రితపాలక! యని
పిలుకుచుండెడు నర్భకవాక్యములను
వినిహరివచించె నిట్లని ప్రియగిరంబు. 20

గీ. బహుసమీపముననె యజ్ఞవాటికగల
దచ్చటికినేగి యాచింపుడన్నములను
హితముగై కొన దలచితిరేని యిపుడె
సరగున జనంగవలయునో! సౌమ్యులార! 21

వ. ఈలీల బలుకుచున్న కేశవు నాదేశంబువలనే నాశాపరవశంబగు నిజాశయంబు గలవారలై వారలందరును దొందరగానేగి సవనసదనంబునొంది ప్రసాదంబు నొసంగుడని

మునివరులం బ్రార్థించి నీతిమాలినవారివలనం దిరస్కరింపబడి మరలివచ్చి యచ్చటి వృత్తాంతంబంతయుం గృష్ణునకు విన్నవించిన విని మరల నమ్మునివనితాజనంబు నుద్దేశించి జనుండనియును మీకొరకై నెరవేరు ననియునుం జెప్పిపంపిన, వారటులనే యచటికేగి వేగిరముగా నోగిరము నొసంగుమని వేడుకొనగ, తదగ్రిమణీమణులు నిజరమణనివారిత లయ్యును, నయ్యెడ నమృతకల్పంబగు భోజనపదార్థంబు సమృద్ధిగా నొసంగిరి—అదిబహువిచిత్రముగా నున్నదిగదా! 22

గీ. గొల్లపిల్లల కవమతి గూర్చనచటి
పురుషులె ప్రదీపదర్శను లరయ నహహా!
స్త్రీలుగారు ప్రతీపదర్శనులు తత్వ
మునుగ్రహించి చరించుటన్ బుణ్యులగుట. 23

వ. అపుడు వారలతో గూడ సకలపదార్థ సంపన్నంబగు నన్నంబు సుధాసారమధురంబులగు బిండివంటకములును గొనితెచ్చి భగవంతుండగు శౌరికర్పించి వారిట్లుశ్లాఘించిరి.

చ. నరులరయంగ యథావిధినొనర్చిన యాగశతాళినైన శ్రీ
కరమగు నీప్రసాదమును గాంచుట దుర్లభమట్టి నీవు మ
మ్మరసి కృపారసంబునఁ గృతార్థులఁజేసితివెంత భాగ్యమో
మురహర మేమొనర్చుతపముల్ ఫలియించెనునీదుతత్వమున్
గురిగొనలేనిమూఢులగుకొందరు మోహముగొందురెంతయున్

వ. ఇట్లుబల్కుచున్నట్టియు, యా హరి ప్రభావంబు దెలిసికొన్నట్టియు నగు నబలాజనంబుల ననుగ్రహించు వారలు సమర్పించిన సకలమైన భోజ్యపదార్థంబును గ్రహించి భుజియించి యానందనందనుం డమితానందంబు నొందెను.

గీ. మరియొకప్పుడు నప్పురందరునియెడల
నాదరముగొని పూజింప నమిత కుతుక
మొందు నందాదిజనుల ముకుందుఁడరసి
యింద్రవైరంబు దెల్పుచు నిట్టులనియె. 27

వ. అమిత సంభారంబులు సమకూర్చుకొని సేయఁ బూనుకొనిన యాసంక్రందనపూజా సంరంభంబుచేత నిక చాలుచాలు నిట వినుండని వారలతో నిట్లనియెను. 28

సీ. అత్యుచ్ఛ్రయము సకలాగమప్రియమైన
నిచ్చనిచ్చలు రహినెనయుచుండు
గోగణంబునకెల్ల గొనబుగాఁదనరారు
విశ్రామభూమియై వెలయుచుండు
అఖిలఫలాస్వదంబగుచును నిరతంబు
నలశుకవినుతి శోభిలుచునుండు
సంతతామోదం బొసంగుచు సుమనఃప్రి
కరసేవ్య మగుచును బరగుచుండు

గీ. గానసీయచలంబును బూనికొలువు
డల వనస్థితులకు శ్రేయములనొసంగు

ముగ్ధసుర రాజపూజన బుద్ధి మీాక
దెట్టి దెట్లయ్యె? మోహమహేతుకముగ. 29

—• శ్రీకృష్ణుడు గోవర్ధనపర్వతము నెత్తుట. •—

గీ. అపుడు హరికృత పక్షపాతాప్తిగొనిన
గిరివరంబతి సంతోషభరమునొందె
పాకశాసన చిరకృత పక్షపాత
ముననె విరసతగానె చిత్రముగనుజగతి. 30

క. హరివచియించిన వాణిం
బరమహితంబని ప్రమాణ మరయుచువారల్
గురుతర విధిపూర్వకముగ
సరగునపూజించిరపుడు జగతీధరమున్. 31

క. వరగోగణమును ద్విజులన్
సురుచిర కీలాప్తహూత భుజుని విధిలీలన్
పరితృప్తిపరచి గొల్లలు
ధరణీధరమునకు బలిని దగనిడిరెలమిన్. 32

క. హరియచలాంతర్గతుఁడై
కరమదిచైతన్యమొందఁ గదలగఁజేసెన్
సురుచిరబలియును దినెనా
హరిచరితము వినినవార లద్భుతపడరే. 33

గీ. అమరనాథుడు బలరిపుడగుటఁదనకు
నహితుఁడేయని కాదలహరిహయునెడ

హారికివైరము దేలన నచలమిషను
బలిని తనె దినువేడ్కచే గలిగెనిజము. 34

వ. తరువాత దనకువైరియగు మురరిపుని చరితంబు విని కోపించిన వాసవునిచేఁ బంపబడిన ప్రళయకాల విజృంభితంబులైనవివలె వెలయు ధారాధరంబులు, ధారాళంబగు వారి ధారలచే నిరంతరంబుగా గురియించుచుండెడు సలిలాసారంబులచే గబళింపఁ బడుచుండు నశేషనివేశప్రదేశంబులు గలుగుటంజేసి కర్ణపరుషంబులు నతివిషమంబులు నగు దీన భాంకార రవంబులుగల సురభినికరంబులతో సమంబుగ మిగులఁ బీడింపఁబడుచుండెడు గోపతులందఱును దన్నుశరణంబుజొచ్చియున్న సమయంబున వెరపుమాలి వనమాలి, తనమనంబున నిట్లుఁదలంచెను. 35

గీ. హరికి గోత్రభిదుండను నపయశంబు
జెలగెనదియెంతో భువినని చింత జేసి
దాని దొలగించుటకు నయత్నముగను హరి
యపుడుగోత్రసముద్ధర్తయై యెసంగె. 36

గీ. తడియుటనుజేసి గడగడ వడకుజెంది
యార్తిగొనిగోగణంబుతో నల్లగొల్ల
లెల్లరును హరియాజ్ఞచేఁ గొల్లలుగను
గలసిచేరిరి జీమూత తలమునకును. 37

గీ. విగతమర్యాద నీచప్రివృత్తజడవి
తతులచే నిలగలుషమై తనరెనైన
హరిమహిమచేత పశువులకైననపుడు
పంకసంస్పర్శమింతయున్ బరగదయ్యె. 38

గీ. హద్దుమీరిన జలసమూహంబుచేత
మాధవాశ్రితులైన యామానవులకు
పరిభవముగల్గదయ్యె సత్పథమునుండి
జారిపడువారిచే గతి సన్నిరోధ
పంకతతియె యుపార్జింపబడియె జగతి. 39

*గీ. సత్పథచ్యుత నిస్సీమ జడసమూహ
కృతపరిభవము మాధవాశ్రితులకగునె?
పుణ్యమార్గానురోధి ప్రభూతవిదిత
పంకమదిభువి నార్జింపబడుటెగాక.

గీ. పరమపురుషున కవమతిఁ బరగజేసి
తనదువృష భావమును ప్రకటన మొనర్చె
శకుని డల గోగణముల స్వేచ్ఛావిహార
మునునిరోధించుటది చిత్రముగనుదనరె. 40

గీ. అపుడు హంసోదయముచేత నఖిలభువన
ములును శోభాశ్రియంబులై బొల్చుచుండ
బహుతమోవృత్తి సంధత బడయుట బ్రితి
కూలగతి కౌశికాత్మకాఁగూడదెచట. 41

వ. అటుతరువాత నందనందనుండొనర్చిన యయ్య ద్భుతకృత్యంబును విని తత్క్షణంబవిగళితంబగు దుర్గర్వసంభృత సంభారంబుగల యాజంభవైరిచేత వారివాహంబులు నివారితంబులై యంతరిక్షంబు దొలగియున్న సమయంబున నిరపాయంబుగా నివాస, సమీపభూమిపై గోపాల బాలకులందరును శయనించియున్న సమయంబున. 42

గీ. గిరియధ్ఘాస్థానమునునుంచి మెరయుచున్న
హరిసి ముదమొందజేయగ నమరవిభుఁడు
దివమునుండిల కవ్వెడదిగియె నయవి
నయములలరగ తలవంచి నమ్రుఁడగుచు. 43

వ. హరిదరికిం జేరి మరలమరల సాష్టాంగ దండప్రణామంబులాచరించి యివ్విధంబున సన్నుతించెను, అది యుక్తమేగదా. 44

•—• ఇంద్రుడు శ్రీకృష్ణుని నుతించుట. •—

చ. నిరతము సన్మునీంద్రకృతనీతి యుతస్మృతిజాతపూత సుస్థిరతర రశ్మిసంతతులచే బరిణద్ధుడవైననీవహా!
పరులకుముక్తినెట్లిడెదో? వారలభక్తిమహాబ్ధిమగ్నతన్
దెరలనినీవు వారినెటుదేల్చెదో? నీకగునట్టిచిత్రమా
చరితమునెన్న నెవ్వరివశంబగు సత్కవిజీవ! మాధవా! 45

చ. తెలియక పెద్దయాసగొని తీరుగఁగొందరనేక వేషముల్
నెలకొనినీవుజూడగను నీటుగసంస్కృతి నాటకంబు దా

మెలమిరచించుచెప్పు ఫలమించుకనొందక నీయుదారతన్
దెలసినవెన్క చాలునని ధీరతఁగోరుచునుందు శ్రీమాధవా.

చ. సతియగుచోజగంబులకు సంతతబాధయెలేదు గాక యా
సతిపయినట్లు నమ్మక యొసంగుటచేతనుగాదు దా సదా
సతియునటంచు నీప్రకృతిసంస్థితినేమని జెప్పకూరకే
యతులితరీతినారా! పరమాత్మసుఖాకృతిగొల్తురాబుధుల్.

చ. మనసువిచారదగ్ధమని మానుగనిర్వృతినొందగోరి యం
దనెనమృతంబుజిల్కునలతావక పాదమునంతురామునుల్
దనరువిపత్సహాయి యగు తద్హృదయంబునశించునంచుత
ద్ఘనవిహాప్తికేవలతగల్గునటంచు నెవండెరుంగుదాన్. 48

ఉ. శ్రీమహితాన్వితా! ప్రకృతిచేతనె నన్నిటికెన్నగాఁబర
ప్రేమకునాస్పదుండవుగదా! చిరసేవలచేనెవండొ నీ
ప్రేమకుపాత్రుడౌనగుటరిత్త సదంభమునౌనునన్య స
త్ప్రేమమునట్లులైన జగతిన్ నిరుపాధికృపాంబురాశివన్
భూమయశంబునీవెటుల బొందితివౌర!మహాద్భుతంబుగన్.

చ. వరవినతాపరాధగణ వహ్నికణంబులు సత్కృపాబ్ధివై
పరగెడునిన్స్పృశించుచును బాగుగనెన్నియొశాంతినొందవే
వెరవుగనట్టులన్ సురగవీజపయోలహరీనమంబులై
బొరలుభవత్కటాక్షములముంచుమునన్నుగృతాపరాధునిన్.

క. సురధేనుపయోధారల
హరినభిషేకించి యిందు శ్రీదయ్యెడనరిగెన్

త్వరితగతి స్వర్గమునకున్
బరిపూర్ణమనోరథంబుఁ బడసిముదమునన్. 51

—• శ్రీకృష్ణుడు నందుని వరుణనగరంబునుండి తెచ్చుట. •—

వ. తరువాత మరియొకప్పు డేకాదశీవ్రతం బొనర్చి నట్టియు నిది స్నానార్హ కాలంబుగాదని విచారింపకయే యర్ధ రాత్రింబునందు కాళిందీనదీజలంబుల నవగాహనంబు సేయు చున్నట్టియు, సముపజాతానందుఁడగు నందుని నతిమాత్రకో పంబుగలవరుణదూత తనయధీశనివేశంబునఁ బ్రవేశపెట్టెను. అదియుక్త మెట్లనుకును. 52

గీ. అటుజనె నశాంతనిద్రఁడౌనట్టినందు
డసమయమటంచుడలపకె యరుణసుతను
గోరి, నిజగృహమవినీతి జేరుటవిని
పట్టుజలరాజు సహనంబుఁబడయుటెట్లు. 53

క. తరువాతను మురహారుఁడ
య్యరుదగువృత్తాంతమంతనరయుచునతిదు
ద్భరరోషరూపితుండై
వరుణాలయమునకునేగె బహుశీఘ్రగతిన్. 54

క. హరిఁగనుగొని సవినయముగ
వరుణుఁడుపూజించియపుడు బహుచిత్రముగా
బరమానందత్యాగము
నెరపియు నానందగరిమ నెలకొనెమరలన్. 55

గీ. అలవరుణలోకయాత్రను నలరజేసి
మహితగతిమీరునానందసహితుఁడగుచు
నట్టికృత్యావసానంబునందుసుకృతి
పుణ్యవంతుఁడు పురుషోత్తముండుగడక
మరలక్షితినొందె మాయికమానవుండు. 56

వ. అటఁతరువాత భగవంతుండగు వాసుదేవుండొకా నొక తామసీప్రారంభంబునందు పొందబడిన ప్రయోజనంబు సమర్థించుటకు బృందావనపరిసరంబున గ్రీడించుటకై యాశ్ర యించియుండెను. 57

వ. పిమ్మట దిగ్గజంబుల, కుశలంబు నడుగుటకుం బోలె దిగంతంబుల నుల్లఘించుటకు సమర్థంబులగు నంధకారధార లచే నాపాదింపబడియుండు నద్వైతంబు గలదియై జగంబు వెలయుచుండు నవసరంబున. 58

వ. ఇది పూర్వపర్వత శిఖరంబునందలి, కురువింద మణి కందళంబులకాంతి కదంబయుండునా! లేక సకల విలా సినీజనంబులను మోహింపజేయుటకు సాధనభూతంబగు మనో భవమణిమయ బింబంబైయుండునా! కాక పురందర దిగంగ నకు నయనాంజన స్ఫటికకరండంబైయుండునా! అదిగాక బంభ రసంభరితంబగు రజనీభామినీ విలాసకోకనదంబై యుండు నొ! అటుల గానిచో చకోరనికరంబులు భుజించుటకు పరి కల్పితంబగు మాంసవటకంబైయుండునా! ఆహా! అదిగాని

యెడల ననవరతప్రహారంబులచేత శిథిలీకృతంబగు మధ్యభాగంబుగల పురందర మందిరప్రాంతంబున వెలయుచున్న ఘటికాయంత్రఫలకంబై యుండునా! యని యివ్విధంబున నాలోకనజనంబుల కగు సంశయశలాకలచే శకలితంబగు శరీరంబును వహించి పురుహూతదిశారంభ పరీరంభంబునందలి సంరంభంబు నొంది మద్గుణైశ్వర్య సంపన్నుండు, సుధాకరకిరణుం డలరుచుండు తరుణంబున. 59

కం. వందారు జనులపాలిటి
మందారుండైన శౌరిమంజుల గీత
స్యందిత మురళీరవముల
నందముగ హరించె గోపికావళి మనమున్. 60

—• గోపికాగీతలు •—

చ. హరికృత గీతినప్డు గడు హాయిగ నల్లసుదృగ్గనావళుల్
సరగున నాలకించి గృహసఖ్య సగర్భ్య హృదీశమాతృ, తాత, రుచిరపుత్ర మిత్రులను ద్రవ్యములన్ విడి వల్లు వల్దనన్
మరలక, శౌరినారయగ మానుగ, గానకు నేగిరప్పుడ
బ్బురముగనాత్మసౌఖ్యమునుబొందెడువారికిగుందదెట్లగున్.

చ. ఎరువుగ జూచుటన్ మదికి నెద్ది రుచింపక సారసాక్షుడా
హరిమధురాధరాంచితసుధామితధారలు గ్రోలగోరుచున్

మరపున క్షీరదోహనము మాని మహాద్భుతలీల గ్రాలమం
దిరమును వీడి యేగెనొక ధీరసుదృఙ్మణి తత్ప్రవృత్తిచేన్.

గీ. పరగునా యాంతరంగిక ప్రాణమైన
ప్రభునివిడిచి బహిశ్చరప్రాణములగు
ధనములే లని తెల్పెచే ధనము గృహము
వదలి కేశవు దరికేగె ముదిత యొకతె. 63

గీ. కూర్మి సంతానసుఖ మది గోరబడిన
నెలమి హరియోగ సౌఖ్యమ దెట్టులబ్బ
ననుచు నాకలిచే గుందునట్టి శిశువు
లను గృహంబును విడి యొర్తు జనియెనపుడు. 64

వ. ఇవ్విధంబున గురుజనవచన నిచయంబును గూడ దిరస్కరించి యాభరణగణంబును వ్యత్యయంబుగా ధరించు కొనుటయుం బరిగణింపక, యేనె ముందేగెద, నేనె మున్ను జనియెదనని వచ్చుచున్న యాగ్రవ్రేత యన్నుమిన్నుల సంతసంబు నొందించి యావెన్నుండు సాదరంబుగా . వారలతో నిట్లనియెను. 65

ఉ. శీలము బాసి యీకటికిచీకటి నిట్టి నిశీథమం దెటుల్
బాలికలార ! యేల వనవాటికి, మాటికినందె చప్పుడుల్
గ్రాలగ నేగుదెంచుటకు కార్యమదేమి ప్రియంబ దెట్టిదో?
చాలగ దెల్పుడా ప్రియుల సంగతిబాయుట స్త్రీలకొప్పునే?

వ. ఈలీలను భగవంతుం డగు వాసుదేవుండు పల్కుచున్న సమయంబున.

గీ. ఇతరవంచనఁ జతురుఁడౌ నతని మతిని
సతులు దెలియక లజ్జచే నతినతలయి
జొక్కి వే మారుబల్కనిం పెక్కు పెక్కు
వాక్కు లక్కజముగ నెంత్రు మక్కువెక్క. 67

వ. అటుపిమ్మట నాభీరధీర తరుణీమణులు తదీయ మాయం దలంచి యనుమానించుచుఁ దమ!తమ యంతరంగంబును వెల్లడించి తదనుకూలంబుగాఁ గుటిలస్వభావంబుతో నివ్విధంబున నమ్మత్తకాశిను లుత్తరంబొసంగిరి. 68

గీ. అనిశరామానభీష్టదమగు విరాగ
మును వహించిన నీసన్నిధిని వచించు
ముగ్ధవృత్తుల మరతిబూని మిగుల
నలభవ ప్రతికూల చర్యాప్తిఁగొన్న
మాకు నిర్వాణ సుఖమెట్లు గాకయుండు. 69

గీ. అరయ భీరులము మనోభవాధి మిగుల
బూని నిన్నిపు డఖిలేశ! బుద్ధిచేత
శరణు జెందితిమో! యీశ! సంతసముగ
నిట్టియెడ్డను పరిగ్రహమందు విరస
మొంది యెట్టుల పౌరుషమూనితీవు. 70

—• రాసక్రీడాభివర్ణనము •—

వ. ఈలీల బలుకుచున్న వల్లవపల్లవాధరలయుల్లంబు గ్రహించి యపుడెంతయును నివారింపబడని ధైర్యంబు గల వారినిగా నిశ్చయించుకొని వారలతోడఁ గ్రీడించెను. 71

గీ. కమల రమణీయనయనయా రమణి యొకతె
యలశ్రమ ధురాధరయు మధురాధరయును
రుచిర యచిరాంశు రుచిరయై శుచిహృదయుని
కలితమురళునితరళునిగా నొనర్చె. 72

గీ. లలితమలయా నిలాలోల కలితతరుల
వాసిగొను కాన నెందు కలాసమాన
మరియొక మనోరమ సమాగమ పరహరికి
రక్తి గలిగించె నల రమారమణికరణి. 73

సీ. స్మరవరనారాచ సహజంబులును దర
స్మేరంబులును దృక్ప్రభారములును
మందస్మితాంచిత మధుపరిరంభణ
మహిత రసాత్యంత మధురములును
మహనీయ సత్త్వమలహరీల లఘ్ఘన
కల్లోల వక్త్రప్రభాకలితములును
పటుసమంచిత పంచబాణ సమేతముల్
శోభిత సౌందర్య సుభగములును

గీ. నైన రంగదనంగ మోహోద్ధితుంగ
ఘనతరంగములగు నపాంగముల గముల

నపుడొక కృశాంగి యామురరిపునిపైని
నెరపె నిరుపమలీల బల్ నేర్పుగాల.

వ. అటు తరువాత.

గీ. స్మరపరీతాప విధురలున్ సరసతర సు
ధారస, సుమధురాధర ధారిణులును
చంచలా పాంగదృశలునా సతులను హరి
నర్మవాక్సుధచే ముంచె శర్మమలర. 75

గీ. శాణఘర్షణముల మణిస్వర్ణములకు
బోలె మృదువగు నీకెట్లు బొందుశోభ?
యనుచు నీతను వొనరించి యల విరించి
గడగి లావణ్యరసమున దడపెనేమొ! 76

గీ. నీదు లసదూరుశోభచే నిర్జితాభఁ
దనరు రంభాతరుల్ దమ దంభము విడి
సార్థముగ నలమోచాఖ్యనందియుండె
జడులిల సదూరుసామ్యంబు బడయు టెట్లు. 77

గీ. ఉర్వీలతలకు నెచట పుష్పోద్గమంబు
గలుగు నచటనె ఫలములు గల్గుచుండు
ధరణి తరుణీ స్వరూప లతామతల్లి
వైన నీయెడ నిటగల్గె నద్భుతముగ
పుష్ప మొకచోట కాయలుబొడమె నొకట! 78

గీ. పరమతంబు హరించు నీ గురుకుచంబు
లంచు గట్టితి విట్టులఁ గంచుకమున

నైన నవి మానవయ్యెను, నైజగుణము
కఠినతరులు విడుతురె నిగ్రహమువలన? 79

గీ. చెలగి మున్నెన్ని పున్నెముల్ జేసికొనెనొ
యిట్టి కంచుకమో తన్వి! యెరుకపడదు
తపముచేనైన పొందగా దగని నీదు
నిరత కుచకుంభ పరిరంభ నియతిగొనుట. 80

గీ. విధిగ నీమోము విధునిచే విధి విధించి
యచటి సారంగ సారాంశమా హరించి
వదనమున మృగనేత్రముల్ ఫాలమునకు
తన్మదమునుంచె నిజమది తరుణి! వినుము. 81

గీ. తన్వి! యీమోవి నీముఖాదర్శమునను
వెలయు తుండీఫల ప్రతిబింబమగును
గాక యుండిన బింబ విఖ్యాతి యెట్లు
దనరుచుండును, దత్ఫలంబునకు జగతి? 82

గీ. అరయ నీదగునట్టి సర్వాంగములను
విమలతరమగు పసుపుచే విధి విధించి
విధిగ నధరమునను నిల్పె సుధ నచటను
గాక రాగాతిశయ మెట్లు గలుగు నబల! 83

గీ. అరయ బహుదూర దర్శినులయ్యు నీదు
నయనము లవారిత శ్రుతినియతి దాట

నల మలినవాలభారంబునందు నెట్టు
లెనగదు తమోగణ ప్రణయిత్వమతివ ! 84

కం. రఙ్గచ్చాటూక్తి రసత
రంగంబుల దడిపి యలకురంగాక్షుల, నా
నంగీ ప్రక్రమమోహారు
చింగొన నంగీకరింపజేసెను హరిదాన్. 85

శా. కేళీగోపవధూనవీనవిలసత్క్రీడన్ విలాసంబుగా
బాలావిద్రుమ పాటలంబులగు నీపాదంబులన్ బట్టనా?
లీలన్ మేనను మంచిగందమును నాలేపంబుగావింతునా?
హాలిన్ బూలనుగొప్పునన్ ముడుతునాయంచున్ ముదంబొప్పగో
పాలుండాడిన చాటువాక్యరచనల్ భవ్యంబుమాకీవుతన్ 86

గీ. అలబహిఃకేళిరిపుతను బరగులజ్జ
విడిచిపూబొదరింటినిఁబడసియటకు
మరలనదివచ్చిపడునని పరమభీతిఁ
గాంతయపుడు కవాటంబుఘటనపరచె. 87

గీ. పరగుచుండెడు మందాక్షభావము।నను
కామసంగరసాహాయ్య కలనయందు
శక్తిజాలమినలలజ్జనడలెనపుడు
పరుని నిరతాశ్రియముగల్గివరలుచున్న. 88

గీ. శౌరితన్నశయ్యనొందించు సరసమిషను
నబలలకరగ్రహంబుదానపుడొనర్చె

నదిమొదనాగ్ని సాక్షికమైనపెండ్లి
గానసతడెట్లుజారుడన్ గణనగాంచు. 89

క. సల్లాపలోలమై బలు
కొల్లదు జూచుటకువేడ్కనొందియుగసద
ప్లలరతిగోరియును నొక
వల్లవి వారించెనీవిబంధమువాపక. 90

గీ. హరిసమాగమమున సతియంతరంగ
మెంతసుఖమొందెననుచునునెంచుచుండ
వెలుపలనురోమహర్షంబె వెల్లడించె
నందుచేనమ్మచున్నారమధికముగను. 91

గీ. ముందుగానన్నిధికివచ్చు మోహనాంగి
సరసమగుమోవిచుంబించుశౌరికదియె
కలుగనైయున్నమన్మథకదనమునకు
వీరులొనరించుపానమైవెలయుచుండె. 92

గీ. నీదువక్షోజలక్ష్మకాచ్ఛాదికయగు
నిట్టికంచుకమెటుధరియించితబల
యనుచుఁబ్రియసతిమోహంబు నంద జేసి
దానిజడవట్టిలాగెశ్రీధరుఁడువేడ్క. 93

గీ. కోకతతులను నీరజకుట్మలముల
గాంచినిర్జించునీచన్నుగవకునిపుడు

వెలది! కంచుకధారణవృథయటంచు
రవికముడివిప్పివైచె శ్రీరమణుఁడపుడు. 94

క. ముదితరో! నీనిర్మలమగు
హృదయమునుఁ గఠోరకుచములిటులాక్రమణ౯
బొదలెననికృథను రవికెను
విదలిచిహారిదానురోజపీడయొనర్చెన్. 95

గీ. వలసియొకపరి గుచకుంభములుగరముల
నెలమిగ్రహించి తద్హృదయేశుఁడైన
యించువిలుదార కుపహారమిచ్చులీల
నలరెనయ్యెడ నెంతయునమ్మురారి. 96

గీ. ఒకపరిస్పృశింతు నీకుచయుగమురమణి!
యంతకన్నను మరివేరయడుగనిన్న
టంచు మాయికుఁడిటునటియించి యట్టి
తన్వి కుచములుగైకొనెన్ దన్విమీర 97

గీ. అలరుపయ్యెదకొంగుదాఁదొలగఁజేయఁ
జనులుకరములచేఁగప్పుకొనెనొకర్తు
అదియె సమయమనుచు దానిపెదవిగ్రోలె
కరనిరోధంబులేమినిఁత్వరనుశౌరి. 98

గీ. అతివకపుడు కుచాగ్రంబునందు కరన
ఖక్షతము లుదయాద్రిశిఖరసదరుణ
సన్మణీఘృణిలిప్తమౌ చంద్రఖండ
మునఁ విడంబించుచుండెనుబాలుపుమీర. 99

గీ. అలప్రియాకుచపరిపీడ నాదులందు
దనరహారియెంతనిర్దయత్వమువహించె
నదియొకింతయుబాధింపదయ్యెసతులఁ
జిత్తజుఁడుమది మత్తిల్లఁజేయుకతన. 100

గీ. ఎన్నఁడును హృదయమునంటెయున్నవైన
నితరమెరుఁగకె మోముముద్దిడెడుప్రియను
జారుకుచముల నెదనించుచాయనతఁడు
కౌగిటనుగట్టిగనుఁబట్టికౌగలించె. 101

గీ. మానుగానీవిసడలింపఁబూనుహారిని
తన్వి, తలనున్నపువ్వుల దండచేతఁ
గరములనుఁగట్టమాయికాగ్రణియొనర్చె
బంధమెడలించుకొనలేని భవ్యనటన. 102

క. తనపోకముడినివిప్పఁగ
గనుగొనివారించువనిత కాంచికమువ్వల్
ధ్వనిజేసెను స్మరదేవా
ర్చన, సూచకఘంటికావిరావంబనగన్ 103

క. వలువనొలుచుతరి నాయువ
కులకిర్వురకైనయట్టిగురుకలహమునన్
జెలిమధ్యస్థయయినమే
ఖలయదివారించుటకునా గలగలమ్రోగెఁ. 104

క. అలరదుకూలాపహృతిన్
వలదనివారించుతరుణివలయంబులు నె
చ్చెలి! నీప్రియమప్రియమున్
బలుకవిదేమని యదల్చుభాతిని మ్రోగెన్. 105

క. హరియొకకరమున జడనొక
కరమున, చుబుకంబుబట్టి కల్కికుచంబుల్
దొరకొననితరకరద్వయి
బరగమి వివరింపదలచె స్వచతుర్భుజతన్. 106

క. ముదమున పోకముడినివడి
విదళించి తదూరుమూలవీక్షణపరుఁడై
యదుబాలుడుండ దనకను
లదిమూసికొనంగ నొకతె హరికనుగప్పెన్. 107

గీ. అరయమందాక్షమోహమాయలుదొలంగ
దట్టమైన మనోజాధిదాటఁబడియె
నలరెనపుడొక యానందమతివలకును
నీవిమోక్షమె మోక్షమై నెగడకున్నె. 108

గీ. లజ్జచేరతివిముఖయై లలనయొకతె
మరలుచుండగగనియప్డు మాధవుండు
దానిసుందరమైన నితంబబింబ
మునుగనియభీష్టముగనెంచె ముదముమీర. 109

చ. అరయుపలాయయత్నములునార్ద్రములున్ స్మితగర్భసంగతు
ల్స్మరిపెపుభర్త్సనంబులును ముగ్ధకటాక్షములున్ గిరప్రరో
ధరుచిర ముఖ్యరీతులగు ధన్యవిలాసములన్ రచించి యా
హారికి ముదంబుగా నొకలతాంగిమెలంగెననంగలీలలన్ 110

* క. తరుణులకు వివిధబంధము
గురుతరరసయుతరతానుకూలంబయ్యెన్
బరజారసంగమైనన
పరబంధముగాదు శౌరి పరిచయకలనన్

ఉ. కోరుచుగోపికాళిహరిగూడఁగ బంధమనేకరూపమై
సారరతానుకూలముగ సౌఖ్యమొనర్చెనుగాని కానిదై
జారహృదీశసంగమని, సద్గతిరోధకబంధమాట లే
దారయనమ్మురారిప్రణయమ్మననైనప్రభావసంపదన్ 111

క. అలరురతాంతరమున ని
శ్చలతనుగొని సుఖవిశేషసంగతిచేఁగ
న్నులుమోడ్చి యొకవిలాసిని
యల మదనుని జింతసేయునట్లు రహించెన్. 112

క. పరమైక్యముగ, యువద్వయి
సురతక్రీడారసాబ్ధిజొక్కుటగని యా
మరుఁడిరువుర ఘటియించుట
కొరకైకొను శ్రమమువిడిచికొనె విశ్రాంతిన్. 113

వ. ఈవిధంబున ననంగసంగర దీక్షాధిగత దీక్షితులగు నాభీరమృగాక్షుల కతిశయించియున్న పతివాల్లభ్యంబునం దగు

గర్వావష్టంభ సంభారంబును, విఘటనంబును, గావింపఁదలంచి యశోదాదారకుం డగుశౌరి యపు డంతర్ధానంబు నొందెను.

చ. అరయఁగఁ గానుపించుచును,నంతనదృశ్యతనొందుచున్దటి
ద్వరకలనన్ హసించు హరి భవ్యవిలాసములన్ నిజేచ్ఛమై
నరయఁగ నీని శత్రువగు నాంధ్యమువా రపుట్టి దొందిరో
హరివిరహాంబునంగొనినయాంధ్యమదట్టిదిగాదు చూడఁగన్.

కం. హరి విరహమునను వల్లవ
గరితలు గడువడిని మోహగహనము గొనియున్
మరలను గహనమె జొచ్చిరి
మురహరు నరయుటకు నప్డు ముదమెద గదురన్. 116

కం. శ్రీమన్మథ మన్మథుడగు
న్మామాధవు సురతకేళి నలరించితివా
నేమాధవి ? హరిబోధక
మా మాధవి యనుపదంబు నందతిగానన్. 117

గీ. ఆమ్రమమా ! శౌరి యేదారి నరిగెనిపుడు
త్వరితముగ దెల్పుమా ! యల్లపల్లవగతి
పల్లవప్రణయివి నీకు బాగుగాను
బోధపడుచుండుగాదె విస్ఫురణ మెరయ. 118

కం. పరమ సుఖహేతువై తగు
హరి ప్రత్యక్షంబు గంటివటవె ! యశోకా !
మరి యెటుగాక యశోకత
యరయఁగ నీకెటులగు సకలాగమములలోన్. 119

కం. ధుత్తూర ! శౌరి నీతో
గుత్తంబగునట్టి చెల్మిగాని విడిచెనొకో ?
యిత్తరి విరహిణివలె ను
న్మత్తత నిటు జూపుచుంటి మది జింతిలుచున్. 120

గీ. ఈవిధంబున నున్మత్తభావమూని
ప్రలపిత మొనర్చు వల్లవ వనితలెల్ల
నల్లయదునంద నాద్వైతమంది రపుడు
భవ్యతద్భావ నామితబలముచేత. 121

గీ. ఒకతె పూతనలీలతో నొప్పుచుండ
నేనె హరినని యొక్క-తె దానిచనులు
పానమొనరించె మొదటిది ప్రళయమొంద
నగును రెండవదియు నొందె నబ్బురముగ. 122

గీ. ఒకటి మధుసూదనుడ నని యొప్పుచుండ
నయ్యెడ భుజంగభావంబు నొందెనొకతె
మొదటిది భుజంగజయమును బొందదగిన
విజితయయ్యె భుజంగ సద్విలననముల. 123

గీ. మురహరాద్వైతమునుగొని ముదితయొకతె
మానుగానల్పె దావాగ్ని పాననటన
దానిచేతాపభరమును దాల్చెనహహా
యల్లవిరహాగ్ని నగుగుందుకల్లయనగ. 124

చ. కనుపడకుండె నాహరిసుఖంబుగఁదత్పదపద్మముద్రిచే
 కొనునెడ నక్షిగోచరుఁడగున్ మరివేరగుయోగమేలటం
 చనుకొని యందెలగ్నమతులైన సుదృగ్జనపాళికద్దియుగ్
 జనఁగనరాదదొక్కెడరజంబుననొక్కెడనత్తఃంబునన్. 125

వ. ఇవ్విధంబున నతిదూరతమంబుగరా, వికటాటవీప ర్యటనంబుగావించుటంజేసి పాటవంబుగలవైనను బాటలవర్ణం బునొందిన పాదయుగంబుగలవారలై, యావల్లవలోలలోచన లు సాలోచనులై యొక్కచో నితాంతనిమగ్నంబగు నరవిం దలోచన చరణకమలముద్ర నవలోకించి యిపుడొక కాముక యగు మగువ ననురాగభరంబున నయ్యశోదాచారకుందు దనభుజంబున వహింయించియున్నవాడని నిశ్చయించుకొని ధై ర్యవిపర్యయంబునొందినవారలైయుండిరంతట. 126

చ. ఘనతరపంకమందుఁ గడుగాఢరజః ప్రకరంబునందునున్
 గనబడుచుండు టెట్లగు జగద్గురునున్నతమహాపదంబు కా
 మనమితమై జలించునలమానసమూనిన వారికెన్నడై
 నను బరతత్వనిత్యమననంబొనరింపకఁ గాంచశక్యమే. 127

ఉ. ప్రేమసుధాబ్ధినెత్తిపడవేయఁగఁ గోరినవానిలీలదా
 నీమెయినొక్కప్రేయసినిదే! ప్రియుఁడెత్తుక మోచెనొనుగా
 కామెయు పెక్కుతాతపములంది తపించి స్వకీయలీలలన్
 బూమెలచేతనింకొరులుబొందనశక్యునిజేసెనేమొకో. 128

గీ. చాలుచాలును విసువుము సరగజనెద
గురుజనులవలనను భీతిగొంటికతవ
యని పలుకుననన్ను మధురోక్తులాడికలియు
నట్టిహరియిప్డుకరుణదానెట్టువిడుచు. 129

మ. వరలావణ్య సుధారసామలపరీవాహాశ్రయుండౌచు దా
గరిమన్ ప్రేమలనుగానుపించుదయితుల్ గన్నారవీక్షించిమో
హరి! శౌరీ!వరవల్లభా!ప్రియుడ!పద్మాక్షా!దరిం జేర్పుమం
చురహిన్ గాలమునెప్డులీలజరుపన్ జూతున్,నిమేషంబు గాన్ 130

ఉ. ధర్మకథన్ దృజించి కడకన్ నిజనాయకకేళిజన్యమా
శర్మమువీడి మోహమున సంతతముచ్చసుఖానుభూతికై
నర్మములాడుచుండునిని నమ్మితిమిప్డు దయారసార్ద్రిమా
నిర్మల సత్కటాక్షముల నింపకపోయితివేని రెండిటన్
గూర్మినిబాయుమాకెవరుగోప్యుడికన్ గతియేది శ్రీపతీ? 131

గీ. ఈశ! నీముగ్ధమధురమై యెసగుమోము
నొక్కపరిజూపుమిప్డు వేరొకటిగోర
నిరపరాధ వధూవధనిరతుడైన
కితవశశి, లజ్జగొనుగాక! కృశత, గాంచి. 132

గీ. ఓరి! కందర్ప! యబలలనోంచునట్టి
యార్యనింద్యపరాక్రమ చర్యయెంత!
రూపశౌర్యాదులను నినురూఢిగెల్చు
హరినెదిర్చినఁబురుషుఁడ వౌదువపుడు. 133

గీ. అనిశకళ్యాణజాలసమాశ్రియుండు
నవ్యకరుణారసార్ద్రుఁడానందమయుఁడు
నబ్జముఖుఁడు త్రిలోకమోహనుఁడు ఘనుఁడు
నగువరునిగాంతుమెట నభాగ్యలమికయ్యొ! 134

చ. పరపగురోషమానెడల పయ్యెదకొంగుఁదొలంగఁజేసి మ
ద్గురుకుచకుంభమర్దనముఁ గొబ్బున సేయుమునిర్దయుండవై
కరనఖదంతజాలమునఁ గాయమొనర్చికపోతనాదభీ
కరతసుఖాబ్ధిఁద్రోయుముదగన్ వివశన్ ననుబ్రాణవల్లభా. 135

చ. అరయనకార్యమంచు గురులందరనర్థమునిర్ణయించిరా
పరమపతివ్రతాత్వమదిభగ్నమునొందెననింద్యసౌఖ్యమా
బరగుటలేదికన్ దదనువర్తినియై తగునాశవోదహా!
షురియుచునెంత జేసితివి మార్గశిఖామణివైనమోవిధీ. 136

వ. ఇవ్విధంబునబల్కి రోదనంబొనర్చుచు నతిశయించుచున్న విరహకృశానునిచే గృశించుచుండునను భావంబులు గలవారలును, శ్యామలయ్యును, విరహపాండురలును, దరుణులయ్యును బురాణపురుషాభిలాషిణులును నగు నాభీరభీరువులచే నార్ద్రీకృతహృదయుండై యశోదానందనుం డానందంబు గ్రాలనపుడు వారిమోలల సాక్షాత్కరించెను. 137.

వ. తరువాత నల్లవల్లవ పల్లవాధరలును నకాండపతితంబగు సుధాసారంబుపగిది నలరు నరవిందలోచనావలోకన సుఖంబు ననుభవించి, యొకతె పాదంబులువట్టియును, మరి

యొకర్తె కరావలంబనంబొనర్చియు, నికనొకర్తుక, చామరం
బున విసరియు, వేరొక్కతె చెమటపుటంబులం దుడచియును
మరియొకతుకపరాగజాలంబును బరిహరించియు, వేరొక్కరితె
తాంబూలవీటికనొసంగియు, నికనొకర్తె తాంబూలకరండంబు
నుధరించియును వేరొకరితి జిగురుటాకులచే దల్పంబుగల్పించి
యును వారివారి కోరికదీర, శౌరినారాధించి సేవించి పరిపూ
ర్ణమనోరథంబుగలవారలైరి- అదియుక్తమేయగును. 138

గీ. హరిపరోక్షమునను మాయనలరుశోక
జనితవహ్ని, సుదృగ్జనజాతమునకు
జల్లనగుచెట్లు శౌరిదర్శనవిశేష
ఘనరసాంచితసంతోషమునను గాక. 139

గీ. అపుడు హరిగోపికావళినాదరించి
భాసురవిలాసములనలరాసకేళి
గురుతరానందరసమునగూర్చిరతుల
నెనసివిరహాగ్ని పరితాపమునుహరించె. 140

గీ. ప్రమదలయ్యును గోపికారమణులపుడు
ముదితలై తమతమ గృహములకు నిరి
శౌరియనుభావమునజేసి సంతతమును
సరసమగుపతి వాల్లభ్యసరణిగొనిరి. 141

చ. వినునృప! మింటికై యెగసి వేజనుకన్యక నయ్యశోదికా
తనయగ, నల్లకృష్ణునిపదంపడి దేవకిసూనుగాబలున్

గనునదిరోహిణీసతిగ గాంచుమికన్ వసుదేవుఁడిట్టు లా
ర్తినిగొని చేసెనంచును ధృతిన్గలహాశనుఁడైనమానియా
జనవర్యుడైన కంసునకు సర్వముదెల్పెను సంతసంబునన్. 142

—• శ్రీకృష్ణుడు కేశివ్యోమాసురల సంహరించుట •—

వ అపుడు కర్ణపరుషంబగుదానిని విని మిగుల విషమ రోషావేశంబున మండుచుండెడు మానసంబుతో గంసుండ య్యెడ నారదనివారితుండై దేవకీవసుదేవులం జంపుటమాని, సంకెళులచే బంధనమాత్రంబుగలవారినిగా నొనర్చి, కేశియ నుపేరుగల యొకనిశాచరునిం గేశవుని జంపుటకై యంపించి, మంత్రిపుంగవులంబిలిపించి నారదునిచేఁ దెలుపఁబడిన యావృత్తాంతంబునంతయుం దెల్పి, ముష్టికచాణూరులనెడు మల్లుర నిర్వురను, హలధరవాసుదేవులకుం బ్రతిమల్లురగా నేర్పరచి, కువలయాపీడంబను మత్తగజంబును ద్వారప్రదేశంబుననుంచి, రంగస్థలంబు నున్నతాసనాదులచే నలంకరించుడని, కంచుక లంబంది బాణాసన సవనంబును గాంచెదరను మిషంబు గల్పించి, సపరివారంబుగా నయ్యశోదానందన్షుం దోడితెమ్మని యథార్థనామకుండగు నక్రూరునింబంపించెను. 143

వ. అపుడకౄరుండును వచ్చినవాడయి యట్టిసమయంబున, యమునివలె నతిభయంకరుండై హయరూపంబు నొందియున్న కేశినామకుండగు నిశాచరు నఖర్వగర్వ సర్వాం

కమంబగు ముష్టిప్రహారంబులచేఁ బశుమారణంబుగావించుకై వడిం బరిమార్చి, మరలి గృహంబునకువచ్చియున్నట్టి, మధుసూదనుంగాంచి, దండప్రణామంబుగావించి, యాకృష్ణబలరాములచే గౌగలింపంబడి, క్షేమసమాచారంబుల నడుగబడి, సహభోజనాదులచే మిగుల నుపలాలితుండై, తానువచ్చినకారణంబును దెల్పి, వారినిర్వురనరదంబునంగూర్చుండఁ జేసినము పహారంబులు గైకొని వచ్చుచున్న నందాదిగోపకులతోనను గమ్యమానుండై మధురానగరంబునకు బయలువెడలెను. 144

గీ. అశనిపాత సమంబగు నట్టివార్త
విని సుదృక్తతి పరవశతను వహించి
యెట్టి దశనొందెనది దెల్ప నెవ్వఁడోపు ?
ప్రకృతి సుఖహీన కఠినుఁడౌ శుకుఁడు దక్క ! 145

కం. ధరబ్రహ్మపుత్ర గతియ
ట్లరయగ నాపాతరమ్యమగు నామముతో
దురిత పరిపాకకలనా
కరుఁడ క్రూరుండు క్రూరకర్ముఁడు గాఁడే ! 146

చ. వరమతితో గృపావతినిఁ బార్వతిఁగొల్చి స్మరస్మరుండనన్
బరగు మురారి నాదుప్రియభర్తగ సేయుమటంచు నెయ్యెడన్
దురితములేమి యావిభునితో విరహంబును లేమి గోరితిన్
గరమదియెంతయున్ విధివిఘాత మొనర్చెని కేమి సేయుదున్.

చ. మురియుచు మాటిమాటికిని భుక్తమునొందియు గ్రొత్తరీతి బ్రే
మరుచికినాస్పదంబు భయమానసనంస్పృశమయ్యలభ్యతా
స్ఫురిత మనోహరంబు గడు మోహద మైసురతాంచితప్రగూ
త్కరకరణాదులొందకె సుఖంబిడు నీదగుచౌర్య సంగమం
బిరవుగనిష్డ నాదుమది నెట్లు దలంపకయుందు మాధవా!

గీ. లీలగా నీవు నిమిషంబు లీన మొంద
ననవలంబననై యాపదబ్ధిబడితి
సతత విరహాగ్నిని సహింపఁజాలనిపుడు
మరణమె శరణమని యెంతుమదిని శౌరి! 149

వ. ఇవ్విధంబున మిగుల దిగులొంది విలపించుచు, వివే
కంబువిడిచి వల్లవ విలాసినీ సమూహంబు ప్రయాణాసక్తి గల
దిమ్మై సపరివారంబుగా నపుడు రథారూఢుండై బయలువెడలు
చున్న మురరిపు నవలోకించి రోదనంబు గావించెను. 150

కం. తరళభ్రువు లగువారికి
విరహానల తాపకలన వెడలెడు నశ్రూ
త్కరమది ప్రయాణమంగళ
గరిమ విఘాతంబు సేయగా దగదయ్యెన్. 151

గీ. పిదప మృదుమధుర వచనల
మదయువతుల నూరడించి మరలించి త్వరన్
ముదమెలుదవగ, హరి, యమునా
నదిదరికిని నరిగెనపుడు నయగతి వెలయన్. 152

చ. బలిమి మరల్పగా బడియు వల్లవభామలు నన్నివీడి దా
మలరెడు కృష్ణవర్త్మగతి నందిరి వేగమె యట్టులయ్యునిం
పలరగఁ గోరు తత్ప్రియ సమాగమ మందగరైరి దీని క
ట్లలవడుచుండుజారదయితాశ్రయమేయగుహేతువెన్నగాన్.

వ. అటుః తరువాత భగవంతుండగు శౌరి నయన మార్గంబు నతిక్రమించి యుండునపుడు. 154

గీ. శౌరి సందర్శనా భావజనితఖేద
మెనసి యల్ల సుదృగ్జాలమెల్ల నప్పు
డస్తసర్వాశలై నివృత్త్యభిముఖముగఁ
దనరఁజేసెను తన మనంబును మరల్చి. 155

—♦ అక్రూరుండు యమునను శ్రీకృష్ణుని దర్శించుట ♦—

వ. అటుపిమ్మట నధ్యాసిత స్యందనులగునయ్యదునందనుల నిర్వురనల్ల యమునాతటంబుననుంచి యక్రూరుం డపుడు స్నానంబొనర్చ నిచ్ఛగలవాడై, తదీయజలంబుల . మునింగి యచ్చట, కరుణాపూరుండయ్యును సమున్నత ప్రవణుండును, ననుకరదర్శనుండయ్యును, సుదర్శనకరుండును, నిరంతరాబ్జాసక్తకరుండయ్యును, నబ్జాహితకర యుగళుండును, నవిరతానుషక్తగదుండైనను, గమనీయ విగ్రహుండును, దివ్యగంధానులిప్త సకలాంగుండైనను, నిర్లేపుడైనవాడును, ననావృతమూర్తియయ్యును, పీతాంబరావృత శరీరుండును, మాధవుండయ్యును, పలాశవికాశ విరోధియును; విధుడయ్యును, విగళిత కళం

కుండును; నశేషాధారుండయ్యు నశేషాధారుండును, మీనరూప ధరుండైనను, సుధీవరదురవాప్తుండును; నుపగతకమఠాకృతియయ్యును భూభారంబుసహింపనివాఁడును; నవిరతవసుమతీదయితుండయ్యును, నొకప్పుడుభూదారభావంబుగలవాఁడును; నాలంబితనరసింహరూపంబుగలవాఁడయ్యును, పరిపాలితమదావళుండును, నత్యున్నతుండయ్యును, పరిగృహీత వామనభావంబు గలవాఁడును, ననంత విక్రమయుతుండయ్యును, త్రివిక్రమ సంగతుండును, నిగృహీత భక్తబలియయ్యును, భక్తబలిపరిగ్రహోనక్తుండును, రాజరుధిరవిరచిత పితృతర్పణుండయ్యును, రాజవంశాభ్యుదయంబు గలవాఁడును; మనుష్యధర్మానువర్తియయ్యును, పౌలస్త్యప్రతిపంథియైనవాఁడును; నమోఘశరప్రసరంబు గలవాఁడయ్యును, వశీకృత శరభంగుండును; నుపగతబలభావుండయ్యును, సుత్రామసహజ మైత్రీపాత్రుండును, నర్జున గుణప్రణయియయ్యును, దమాలనీలుండును; చక్రియయ్యును, విగతభోగాభిలాషుండును, బభ్రువయ్యును, భుజంగరాజ బద్ధాదరుండును; బుష్పవద్విలోచనుండయ్యును, గమనీయ నయనుండును, విష్వక్సేనుండయ్యును, ప్రకటితాద్వైతుండును, నస్వాప్నరక్షకుండయ్యును, నిద్రానురక్తుండును, భవవల్లభుండయ్యును, భవసన్మూలన తత్పరుండును; చతుర్దశ భువనశరణుండయ్యును, త్రివిష్టప పరిపాలకుండును, నఖిల ఖేచరాధిగమ్యుండయ్యును, బుద్ధైకగమ్యుండును, ముకుందాంహ్వాయయుతుడయ్యును, కిన్న

శేశరక్షణా నపేక్షియును, ధార్మికజనదయితుండయ్యును, పుణ్యజనమారణపారాయణుండును, నిత్య పరితృప్తుండయ్యును, భక్తైకతత్పరుండును సకలాగమశిఖర లక్ష్యుండయ్యును, వట పత్రశాయియును, శమప్రధానుండయ్యును, శతమన్యుసంశ్రయుండును, నపరమితరుగాశ్రయుండయ్యును, విగతశోకుండును, నపునర్భవపదుండయ్యును, సపునర్భవపదుండును, పురాణ పూరుషుండయ్యును, నిర్జరుండును, హంసాఖ్యనలరుచున్నవాడయ్యును, మానసప్రవృత్తి రహితుండును, నజుండయ్యును, పితామహోపలాలితుండును; ననంతుడయ్యును, సంవర్ధిత మరుద్గణుండును; జనార్దనుడయ్యును, కరుణాతరంగితాంతరంగుండును, నతిదక్షిణుండయ్యునుసకలోత్తరుండును, భగవంతుండును నగు దామోదరునిం గాంచెను—అపుడిట్లు వినుతించెను. 156

—• అక్రూర స్తవము •—

చ. ఇలస్వపదంబె సేవకుల కిచ్చెదనంచు వచించి పిమ్మటన్
బలిమి ప్రపన్నులన్ విపదభావులజేతు వహో! పరాపరా!
వళులను జేరువారె మరివత్తురు తత్తర నీదుపాదముల్
గొలిచెడువాడురాడు మరికుంటిగనైనెపుడున్ పరాత్పరా!

చ. జనునొకనింగొనం బ్రకృతిజంబగు దుర్భవరోగమేగు ర
మ్మనుచు బలాత్కరించి విషమంబుగ జేసి తదీయవిత్తమున్
గొని,ననుగొల్వకున్న తరిగొందువుమృత్యువునంచునార్తునిన్
ఘనభయమొందజేసికడకన్ బహుమానముగొంతువోహరీ !

చ. అనిశము సేవసేయవలె నాఫలమున్ మదిగోరరాదు మె
ల్లన చిరసంచితంబగు ఫలంబె భుజింపవలెన్ గృతిన్ గణిం
చినదియు నీకొసంగవలె జెల్లునుగా కటు ప్రాంతమందహా!
బనుపడుచుండునయ్యమృతభావమెగొప్పఫలంబుమాధవా!
గనబడ దిట్టి సేవదొరగన్ సతిసేయుదు నీదుమాయకున్.

చ. శ్రితుల ననుగ్రహింతునని, చేకొని వారిధనంబ డెల్లనా
యతగతి నాహరింతు వది యట్టులనుండగ నెచ్చటోలస
ద్గతి మతికందరానిదియు దద్దయు నీవె యెరుంగు, నాప్రభా
పతి శశివహ్నిభవ్యరుచి పద్ధతిలేనిదిమళ్ళిరాని య
ద్భుతమగు తత్పదంబునను ద్రోసెదునీకిదియు క్షమే!హరీ!

చ. అనవుగ నీవు ముందుగను నస్ఫురితాంగుడవౌచు నీలస
ద్గుణ కృతజాల మల్లద్విజకోటికి గూర్చి సలగ్నమై జలిం
చునెడల తద్గుణచ్యుతునిసొంపుగ జేయుచుబతుపాతముల్
బనుపడసల్పి యప్డు గతిబాసిన దానిని జేర్తువాత్మతో
బొనరగనీదు సద్విజ విముక్తి కృపన్విని చూడలే దహా !

చ. కరము కృపాబ్ధివన్ బ్రథనుగాంచితి వీవును నేనుదీనతన్
బరగితినీకు దాసుడను వారకనియ్యెడగూడ దైన్యమున్
దొరకొనియుంటి నిట్టిదగు దోసము నాదియొనీదియో జగ
ద్గురుడవునీవున్యాయమును గూర్చిస్మరించుచుభక్తరక్షణం
బురువడిసేయుచుండుటదియుక్తముసుమ్ము,మురారి! మాధవా.

గీ. సకలకల్మష పరిశాంతి నెసంగితిపుడు
ప్రకటయత్నము కాయాపనముకొరకు

నరయ నీపదకమలా శ్రయంబుగల్గు
నంతదనుకయె పాపాప్తి యలరునవెను
నిగమవాదంబు నెరుగనే! నీరజాక్ష. 163

వ. ఇట్లక్రూరుండు స్తవంబుగావించి పిమ్మట భగవంతుండగు నరవిందలోచనుం డంతర్ధానంబు నొందియున్న తరి నూరకొని జలంబులనుండి సరగున లేచి యొప్పుగా నెప్పటిలీల శతాంగసంగతుండై యుండు నక్రూరునింజూచి యావాసుదేవుండు నీవేమి యపూర్వంబు నవలోకించితి వక్రూరా! యని సకపటంబుగా బ్రశ్నగావించెను. 164

—• శ్రీకృష్ణుడు మధురానగరప్రవేశము •—

వ. అపుడతండును సకలవిస్మయంబులకు భాజనంబగు భగవంతుండవైన నినువినాగా నేనెద్దియునెరుంగనని సదుత్తరం బొసంగి త్వరితంబుగా రథతురంగంబులం జేరి రేపించితత్క్షణంబున మధురానగర పరిసరంబునొందించి యచ్చట సపరివారంబుగా గేశవుంబ్రవేశపెట్టి తానును నగరంబు బ్రవేశించి కంసునితో తదాగమనవృత్తాంతంబునంతయుందెల్పి నిజసదనంబున కేగెను. 165

క. మధురా కారమునొందిన
మధురానగరమునుజూడ మాధవుడెలమిన్
బ్రథితబలభద్రయుతుడై
యధిగతభూషావిశేషుడై యటువెడలెన్. 166

వ. తరువాత పుండరీకలోచను నవలోకించుటకుఁ గుతూహల సమాకులులగు పౌరజనుల కలకలధ్వనిచే గబళితంబగు శబ్దాంతరంబుగలదియును, అమరనగరంబును దీనితోసాటి సేయరాదనిని షేధించుచున్నవి వలె వెలయు చలాంచలచేలాంచలంబులగుని కేతనంబులతో నుపశోభిల్లుచున్నదియును, భూదేవికి తాటంకంబులవలెవెలయు కాంచనప్రాకారంబులతో నొప్పుచున్నదియును, నాకసంబు నొరయుచున్న సువర్ణవిరచితంబులగు మేడలతోఁ గూడుకొని యలరుచున్నదియు, నవిరతధారాయంత్రంబులనుండి జారుచుండెడు సలిలశీకరంబులచే దడుపబడుచుండెడు రాజమార్గంబులుగలదియు, ముత్యాల తోరణంబులతో నలంకరింపబడియున్నదియు, నమరావతికి ప్రత్యాదేశంబుకరణి సత్యలోకంబునకు లబ్ధమనోరథంబువిధంబున, భోగవతీపట్టణంబునకా మ్రేడితంబుకైవడిని, కైలాసంబునకు బ్రతిబింబంబు చందంబున, వైకుంఠంబునకు ద్వితీయభావంబు భాతి విలసిల్లుచు, సకలభోగంబుల కాస్పదంబై, సర్వసంపదలకాలవాలంబై, యొప్పుచున్న యమ్మధురానగరంబు బ్రవేశించి, పురసుందరీనయనకమలంబులచే నభ్యర్చ్యమానుండగుచును, లాజజాలంబులచేఁ జల్లబడుచును నిరంతరా లోకకజనంబుల కలకలధ్వానంబులచే నభినంద్యమానుండైయశోదానందనుండపుడు, ధౌతాంశుకనికాయంబును వహించి వచ్చుచున్న యొకరాజసంబంధియగు రజకునీక్షించెను. 167

వానిదరి కేగి యిటుల యాచించెను. 168

గీ. లలితమగునీదుకూల జాలంబునిపుడు
మాకొసగునెడ సుకృతివైమనియెదీవు
నేత్రదోషంబు నమృతంబు నెరపివెలచి
జగతికుపకారమిడునీకు దగునునిదియు. 169

వ. ఈవిధంబున సవినయంబుగా బ్రార్థించుచున్నయా శౌరిని దుర్బుద్ధితో నప్పటపటల వాహియగు రజకుండు సకపటంబుగా నిట్లు మారువలికెను. 170

గీ. పృథుక! గోపక! వనచర! విమలమృదులు
చలువవలువలుగాక కచ్చరపటచ్చ
రములు నీకెట్లురుచియించు రాజుచిరము
గట్టువిడచినవివినీకు గట్టదగవ
లైన బలిమినిగొన ప్రాణహానియగును. 171

—శ్రీకృష్ణుడు వాయకసుదాముల పూజగొని మేలిడుట.—

వ. ఈరీతినతి గూఢంబుగా విప్రియంబులు పల్కునట్టి జల్పాకునల్పాయువుగా దలంచి, ఖరతరంబగు కరనఖరశిఖరంబుచే వానిశిరంబును విదళనంబునుగావించి తదనుచరనికరంబు పలాయమానంబై దశదిశలకుం బర్వులిడుచుండ వానికరతలంబునుండి విగళితంబులగుపట్టుపుట్టంబుల స్వేచ్ఛానుసారంబుగా, గట్టుకొని తక్కినవి తదనుచరుల కొసంగి యటమండి మరలి మరియొకవైపునకుం జని వాయకనామకుండను వానివలనరూ

పాను రూపంబులగు నలంకారంబులుగై కొని వానికి సారూప్య ప్రిధానంబుగావించి యనుగ్రిహించి పిమ్మట సుదామకుండ నువాడు భగవత్ప్రిభావంబు దెలిసినవాడుగాన వానిచే సమర్పితంబులగు నానావిధ సుగంధ బంధురంబులగు బూవుదండలు దండిగా నాదానపూర్వకంబుగా గ్రిహించి యపుడు సురభిగంధచందన విలేపనంబుగల గందపుగిన్నెనుబట్టుకొని వచ్చుచున్న కుబ్జయను నొక యబ్జాక్షిని బుండరీకాక్షుండు వీక్షించెను. 172

వ. అదియునుఁ జక్రిధరునిచే గోరబడి సానంగయై తదంగసంగతింగావించి ప్రచురంబులగు కాశ్మీరమృగమదఘనసారాదుల సౌరభంబుచే సమంచితంబగు మంచిగందంబును మేన నలంది యమందానందంబు నొందించెను. 173

వ. అపుడు భగవంతుండగుశౌరి, దయారసాంతరంగుండై తత్క్షణంబున గుటిలయగుదాని నకుటిలంగావించి మరియొకప్పుడనంగ సంగరంబునకై తదంగసంగతి నంగీకరించెను. అది యుక్తమేయగును. 174

క. ధృతవామన భావముగొను
నితడును నదికుబ్జవారలిర్వురుగొను సం
గతి యనుగుణగతియని
యంచితమతిగాని యెవరువినుతిసేయరుజగతిన్. 175

గీ. ఆయుధాగారమును జేరి యపుడు శౌరి
పాలకులు మొరలిడుచున్న వారకనొక
చాపముగ్రహించి యెక్కిడి శరముదొడగు
నపుడె యదిభగ్నమైచనె నబ్బురముగ. 176

గీ. గొప్పవంశముననుబుట్టి గురుగుణముచ
నమ్రతనుగొనియున్నను నయముమీర
నెనయుమార్గణ భృతినిసహింపకున్న
భగ్నగురు కాష్టత నదెట్లు బడయకుండు. 177

వ. అటుతరువాతనుఁ బిడుగువడుటకుముందుగా నురు
ముచుండెడు నంభోధరంబుల గంభీరగర్జితంబులకు ప్రతిభటం
బగు నుద్భట దనుర్భంగనిర్ఘోషంబు జగదండకరండపిచండంబు
నిండి యుండునపు డీతనిం బట్టుకొండు వీనిం జుట్టుకొండనిప
ల్కుచు త్వరితంబుగావచ్చుచుండెడు చాప పరిపాలకులను
శరాసనశకలంబుచేతనే శకలితులంగావించి యదివిని విస్మితాశ
యుండగు భోజరాజగుకంసుని దృణప్రాయునినిగా దలంచుచు
న్నవారలై వసుదేవనందనులగు బలరామకృష్ణులిర్వురు నానం
దంబునొందుచు దత్పరత్వంబున దత్పుర శోభనంతయుఁబరి
పూర్ణంబుగా నాలోకించి నిజనివాసంబునకుంజనిరి. 178

వ. కంసుడపుడు కర్ణపరుషంబగు దానినాకర్ణించి యా
రేయినంతయుంజాగరణంబొనర్చి తెల్లవారునపుడె మల్లాహవ
మహోత్సవంబు జరుగుటకేర్పరచెను. 179

గీ. అయ్యెడను దుందుభి ధ్వానమనుపమముగ
నలరెనది వినికొందరుజలదనినద
మనఁగ కొందరు గరుడవాహనుడొనర్చు
పటుధనుర్ఘోషమున బీటవడునజాండ
జరఠనిర్గత సలిలనిస్వనమనంగ. 180

క. అలదుందుభిరావముచే
బలుజెలమిన్ బిలువబడినవారివలెముదం
బలరార రామకృష్ణులు
వలనుగజనిరటకుపౌర వర్గముగదులన్. 181

—♦ కువలయాపీడమను గజమును వధించుట ♦—

వ. అటుల వారిర్వురు నగరంబు నిర్గమించి రంగస్థలంబునొంది యచ్చట ద్వారంబున కడ్డుగానుంచబడినదియును నాధోరణాధిష్ఠితంబైనదియును గువలయాపీడనామంబు గలదియునగు మదావళంబు నాలోకించి, లోనికిజనుటకుందగు మార్గమునొందక యామావటీనితో నిట్లనియెను. 182

గీ. రెచ్చిమద్గతి నంగీకరింపవేని.
యీవె యమగృహభాగంబు నెనయుచుందు
వపుడు వారణమునశక్తినలరదేమొ
వెలయు.స్వాత్మావబోధమున్ దెలియనట్టి
విధురుడవునీదు భక్తిమమెల్ల వృధయెసుమ్ము. 183

వ. ఈవిధంబున మర్మభేదకంబులగు భాషణంబులచే రోషణుండగు నాధోరణునిచేఁ బ్రేరేపింపఁబడి మిగులఁగోపించినదై మీదికి నెదురుగా వచ్చుచున్న యాకుంజరంబు; జముని తఱ్ఱాటితోటి సాటియగు తన తొండంబుతో జుట్టబెట్టి పట్టుకొని యుండునపుడు సచమత్కారంబుగా విడిపించుకొని దాని చరణంబుల నడుమ నిమిడియుండ నపుడు మరలం బట్టుటకుఁ గరంబుఁ గరంబు సాచుచుండు నెడ వీకం దానితోకం జేకొని జంఝూవాతూలంబు తూలంబును దూలించులీలనవ్వారణంబునవారణగతి నతిదూరంబుగా బారవైచెను. 184

వ. మరల నతిరోషంబుతో నది మీదికివచ్చి పడుచుండు నవసరంబున నాహరి యటు నిటు బరిభ్రమింపుచు నడుమ నడుమ దానిం గొట్టుచు దానుగొట్టబడక దానినే మిగుల నలసటనొందించి చేతంబట్టి కడువడిం బుడమిపయిం బడవైచెను. 185

వ. బలిమిన్ బెరిక్కివైచినదాని దంతంబుచేతనే సమూలఘాతంబుగా వధియించెను. 186

కం. హరి దాకిశోరమైనను
గరిఁ దునుముట యద్భుతంబుగా దరయగ నీ
హరిచే మతంగజం బది
పరిరక్షితమయ్యె ననుట బహు చిత్రమగున్. 187

కం. హరి బాలభావమందునఁ
గరి దునుముట నైజమచట గనమద్భుతమా?
హరి•గరుణమీఱ నొకతటి
గరిఁబ్రోచుట చిత్రమగుచుఁ గనవచ్చెఁ గదా. 187

కం. తనువొందిన తనయశమో
యనదగు గజదంతమూని యల రంగతలం
బును జొచ్చెను హరియపుడే
పనుపడ జనె ప్రకటబలుఁడు బలభద్రుండున్. 188

మ. సతులా మన్మథరమ్య విభ్రమఝరీ సర్వస్వదామంబుగా
గత దుస్సంస్మృతి దుఃఖశీర్ణహృదయుల్ కారుణ్యవారాశిగా
గతిమద్మల్లులు కల్పనాశమున నాకాలాగ్ని రుద్రాత్ముగా
బితరుల్ బాలునుగోలు బాలునిగనాభీరుల్ స్వమిత్రంబుగాన్.

శా. ధన్యుల్ దుర్గమ వేదపాదప శిఖాతత్వ ప్రవాళంబుగా
మన్యూగ్రుండగుకంసుడల్లస్వరమన్ మార్జించు కాలాత్ముగా
నన్యుల్ రాజునకా వ్రజాళు లిడనానాపూర్ణ పాత్రంబుగా
జన్యస్థానగతున్ హరిందలచి రంచద్రామునిన్ గాముగాన్.

గీ. ప్రేమమై ముచ్చటింపగ బ్రీతినెనయ
గౌగలింపగ నరికట్టఁ గాము కేళి
నెరప ముద్దుగొనంగ నే తరుణు లపుడు
యత్నమొనరింపరైరి తదంత రాయ
రూపమున వచ్చెగాని యాపాపలజ్జ. 191

వ. కంసునకైనచో నపుడు పైత్యోద్రేక ప్రకృతిగల వానికి మధురరసంబువోలె మధుసూదనుండు గడు వెగటుగా గానుపించెను. 192

గీ. అసమ తేజంబు శాంతి రసార్ణవంబు
స్మరణ గొనువారి కానందసాంద్ర పదవి
యభిముఖముగొను నరుహృదయంబు గరుగు
నది యితని కెట్లు దుస్సహమయ్యె నహహా ! 193

వ. తరువాత నుపహారంబులు సమర్పించియున్న నంద సునందాది గోపాలకులను గాంచుటకు సంతోషంబు గాంచి యున్న మరికొందరి రాజపురుషులను నొక్కచో వేత్రాసనం బుల గూర్చుండ నియమించి తాను రాబోవు నూర్ధ్వగతిని సూచించుచున్న వానివలె నొకసమున్నతాసనంబున గూర్చుం డి యుండెను. 194

ఉ. శ్రీ గిరిజా కృపారసఝరీ శుభసౌరభవత్కటాక్ష శో
భాగురు వీక్షణంబు లలభాసుర కల్పలతాసుమావళుల్
గా గొని సత్కవీంద్రు డనగా దగు శ్రీ నవకాళిదాసు బల్
బాగుగదా రచించెనట బండిత మానస సద్విలాసమా
భాగవతాఖ్యచంపువున బ్రాథితృతీయవిలాసమొప్పెడున్.

చ. శివగిరిజా దయారస విశేషపరీత కటాక్షవీక్షణో
ద్భవతత సాహితీ సుకవితారసభాసుర సుందరాఖ్య స

త్కవికృతమౌ ససౌరభ సుధారసధారల మీఱఁగ నాంధ్రభా
గవతపుచంపువన్ వినుతిగాంచు తృతీయవిలాస మొప్పెడున్.

గద్య.

ఇది

శ్రీమన్మహారాజ రాజేశ్వరీ కరుణాకటాక్ష వీక్షాలహరీ పరిత
సంగీత సాహిత్య సరసకవితాచాతురీధురీణ లౌకికవిద్యా
విశేష ప్రవీణ సత్కవివోలు కులకలశ జలధి కువలయమిత్ర
భారద్వాజసగోత్ర భగవత్కవివంశ పవిత్ర సోమరాజా
మాత్య పౌత్ర వెంకటరాయమంత్రి వరపుత్ర
రామాంబాగర్భశుక్తిముక్తాఫలోదయ సకల
సుకవి విద్వజ్జనవిధేయ సోమసుందరాఖ్య
నామధేయ ప్రణీతంబైన శ్రీమ
దాంధ్ర చంపూభాగవతమునందు
తృతీయవిలాసము

సంపూర్ణము.



శుభమస్తు. శ్రీరస్తు. అవిఘ్నమస్తు.

శ్రీ శాంకరీదేవ్యైనమః

# శ్రీమదాంధ్ర చంపూభాగవతము

## చతుర్థవిలాసము.

— శ్రీకృష్ణ బలరాములు చాణూర ముష్టికులను వధించుట —

గీ. ఆహవపరుండు చాణూరుఁ డపుడు హరిని
గాంచి బలగర్వమునఁ బల్కె కపటముగను
సహజబలయుక్తుగని బలరహితునిగను
గాంచువాఁ డెట్లు మూఢుండు గాకయుండు. 1

గీ. మీఱు లిర్వురు బలిష్ఠులే మీఱిరనుచు
వేట్క నిచటికి మిమ్ము రప్పించె విభుడు
సత్యమిది మీదు యుద్ధకౌశలము జూపి
చెలగు నీతని మనము రంజించు టొప్పు. 2

వ. ఇవ్విధంబున బల్కుచున్న యనాత్మవేదియగు వానితో మధుసూదనుండు సకపటంబుగా నిట్లుపలికె. 3

గీ. మొనసి యీనృపు నుపకంఠముననె ప్రాణ
మును ఘటించెద నిది నాదు ముదమె యగును
గాని•బాలా నుచితకార్యకలన మెలగు
నీ కిది శుభంబుగానిదై నెగడుగాక. 4

గీ. మానితోత్సాహకలనను మాటుసేయ
దీనవాక్యముచే వారి మానసమును
బడయఁజాలని వీడెయీ బాలిశుండు
తత్వము గ్రహించునట్టి మాధవుఁడు గాడు. 5

కం. శూరుండగు కేశిని మద
వారణమును దునిమి బాలభావము నెల్లన్
దీరుగఁ జూపితివయ్యెడ
వారకనిపు డెట్లు బాలభావం బలరెన్. 6

వ. అని యీలీల చాణూరుండు వల్కుచుండ భగవంతుండగు వాసుదేవుం డది సరియే? యని నుడివి మిగుల యుద్ధవిద్యాపారీణుని తీరున గొప్ప చప్పుడప్పు డుప్పతిల్ల కరతలాస్ఫాలనంబు గావించి చాణూరుగదియు నవసరంబున బలభద్రుండును ముష్టికునిపై గదిసెను. 7

చ. అతుల శిరీషపుష్ప లలితాకృతి బాలకు డీత డెక్కడ
ద్భుతమగు నమ్మహాభుజగ భోగకరాళ శరీరధారి యు
ద్ధతుడగు నీత డెక్కడ నధర్మము మీఱగ జూచుచున్న దు
ష్కృతియగునీనృపాధమున కెట్లుశుభంబులభించునియ్యెడన్.

వ. ఇవ్విధంబునం, బురజనులందఱును జింతాసంక్రాంతంబగు నంతరంగంబు గలవారలైయున్న సమయంబున. 9

సీ. తోరంబుగా సముద్భూతంబులైనట్టి
సింహనాదంబులు జెలగుచుండ
ఘనతరధ్వనుల నుద్గతములై తనరారు
వీరవాదంబులు వెలయుచుండ
పటుతరోద్వృత్పరిభ్రమణంబు లెంతయున్
బహుళంబు లగుచును బరగుచుండ
రహిమీఱ నూహిత రంధ్రమార్గంబులు
సాంద్రంబు లగుచు నెసంగుచుండ
గీ. శత్రువున కభిముఖముగా సరగఁ జనుట
యిరిదపక్రమణంబుల మెలగుటయును
బగులయును లేమ చుండుటఁ బరగుచుండ
సమ్భృతంబుగ మల్ల కృతాజియయ్యె. 10

చ. ఘనముగ స్వేదబిందువులఁ గ్రాలెడు మేనునుదీతకంపమున్
దనరెడిలోలదృష్టులుమదారపునూర్పులచాలు మ్లానియున్
బెనగొను ముంగురుల్ గలుగు వీనిముఖంబునుఁ జూచునట్టి వే
శినులఁ దినాత్ములైనను గరంగిదయార్ద్రులుగాకయుందురే!

తరువాత —

ఉ. బాలుడనంచు నెంచవెడ భావమి కేలను వీరవాదముల్
మాలిమిసేయు టెందు కిక మత్తతపీడుము నీకు నియ్యదే

గాలము లీలఁగ్రాలు ఫలకాలమటంచను శౌరివాఁడుధా
జాలము గ్రోలువారుఁగడుసంతసమొందిరిడెందమందొగిన్.

వ. ఇవ్విధంబున బలికి చమత్కారంబుగా బైకెగిరి వాని కరియుగళంబును బట్టుకొని గరుడుండురగంబునుం బోలె నంబరతలంబున కెగురవైచి మరలం బట్టి కొంతవరకుం గిరగిరం ద్రిప్పుచు మిగుల శిథిలంబులగు సకల సంధిబంధంబులు గలిగి రక్తధారలం గక్కుచున్న చాణూరుని మధువైరి కడు వడిన్ బుడమిపయిన్ బారవైచెను 13

వ. అపుడు సంకర్షణుండు ముష్టియుద్ధ సమర్థుండన నెను దురభిమానంబుగల ముష్టికుని గర్వంబు సర్వంబు నెడలించి పిడువుల వడువుల నడరుచుండు పిడికిటి పోటులచే నురమ్ము గ్రమ్మవైచి శరీరబంధంబును గొన్న కంసమనోరథం బును బోలెఁ బుడమిపయిం బడవైచెను. 14

కం. చాణూర ముష్టికుల ని
ర్వాణంబను గ్రతుసుపూర్తి బడయుగఁ బూర్ణా
నూనాహుతిగా నపుడు వి
లూనత, చల, కూట, తోసలులు మడిసిరటన్. 15

గీ. ఐదుగురు మల్లురును మృతినంద, మిగులు
వారితోఁ గూడజనెఁ గంసు ధీరతయును
బాల! జయ! జీవ! బాగను పౌరజనుల
వాక్కులతోఁ గూడ భేరీరవంబు వెలసె! 16

—• శ్రీకృష్ణుడు కంసునివధించుట •—

ఉ. బాలుర నీయవార్యులను బాపుడికన్ పురినుండియంచు నీ
వేళనుబట్టికట్టుడిదె విత్తవిహీనులజేయుడెల్ల గో
పాలురనాదుతాతనుసపత్నగు,వీడుడు మాయులన్మహో
ద్వేలురగన్నయట్టి వసుదేవుని జంపుడటంచుఁగ్రోధియై
బాలిశుడైనరాజు శభవాద్యములాపి భటాళికిట్లనెన్. 17

వ. ఈరీతిం గంసనృపతి వల్కుచున్న సమయంబున భగవంతుండగుశౌరి యనివారితరోషణభీషణుండై త్వరితగతిం భూతలంబులనుండి మీదికెగసి సమున్నతాసన శిఖరంబునొందియున్న యతిపాంసనుండగు కంసుని మత్తమాతంగంబు నలహరితెరంగున గరంబులం గట్టిగాబట్టుకొని పుడమిపయిం బడవైచి యతనిమీద తానునుంబడియెను. 18

గీ. పెక్కురాత్రులనిద్దుర విడిచిచింత
చేత జాగరమొందుటఁజేసి శ్రాంతు
తీరుగాను నశ్రాంతంబు దీర్ఘనిద్రఁ
జెందెనయ్యెడ గంసుండు చిత్రముగను. 19

శా. హాహాశబ్దము భూమిపై నరులకష్టమ్యెన్ విషాదంబుచే
నాహా శబ్దము నద్దివిజసురలకష్టమ్యెన్ బ్రమోదంబుచే
దేవాళుల్ ఖిన్నతఁగంసుగాంచిరిటభూదేవీసమాక్రాంతునిన్
బ్రాహర్షంబునఁజూచిరప్సురలుజ స్వర్గాంగనాలింగితున్.20

గీ. కంకముఖులగు నెనమండ్రు కంససహజు
లైన దుష్టులురుష్టులై యాహవమున
కమితకండూతితోఁ రాగ నల్ల శౌరి
పశువులనుఁబోలెవధియించె వారినచట. 21

వ. అది యుక్తమేయగును.

గీ. అరయనే కామినిపరిణయమువహించి
కంకముఖతతిమృతుడగు కంసుగాంచి
యుద్ధభూమికి నేతెంచి యుండుగాక
కోపమున హరియెదుటను గూరుచుండ
ప్రకటతరజీవితాశ వ్యర్థంబుగాదె. 22

వ. అటుపిమ్మట నిజనాథుని ప్రమథనవార్తచే విరా
వార్తలై సంగతమనోగదలచే సంచలితాంగదలై తదంగనలు
సరభసంబుగావచ్చి రోదనంబుగావించుచు నతిదీనరవంబుతో
నిటుల విలపించిరి. 23

గీ. చెల్లమోనాథ! ప్రియ! త్రిజగల్లలామ!
యెందుచే నిట్టిదశను నీవొందితిపుడు
రూఢిచేసీదు రూపానురూపక్షలన
వంచన మొనర్చి దివమునొందించబడితె
నిరతసురతాప్తి సారసుందరులచేత. 24

చ. హితములుగానినీదగు నహీనచరిత్రలమాన మెందు భూ
సతినటు ప్రేమబంధమున సారెకునూరడఁబల్కి కౌఁగిటన్

గుతుకముగొంటి వింతవరకుఁ సరయూనుతివట్టినీవు సం
గతి విరహార్తిఁ బ్రియసినికన్ ననుజూడవు పల్కవేల నీ
గతి నశరణ్య నన్గరుణఁగైకొనునాథ! యనాథనిమ్మెడన్. 25

చ. పరగుచు నెప్డొ నేనలస్వభావముచే బెడమోముపెట్టినన్
త్వరగొని యూరడించెదవు తద్దయు శంకవహించి యట్టినీ
వరుదుగ నారకొంటి వరయన్ గురరీరవరీతిగుందుచో
నిరవుగ వీనులన్వినవదేల!దయాకర!మోమనోహరా. 26

గీ. ప్రియవు నీవయి నాసక్తి వెలయునాదు
బుద్ధిస్వర్గాంగనలఁద్రుణంబుగనుదలప
దనిసదాఁదెల్పి తద్వశ్యుఁడైతివిగద!
ప్రేమఁనన్మృతవచన చాతురీధురీణ. 27

గీ. నీదుతోడవీడి లజ్జచేసిరతశంక
గర్భగృహగాఢతమమునఁగ్రాగుచుండి
వ్యర్ధజీవననై మరణాప్తిఁగోరి
దివసములనెట్లు గడుపుదునవని, నాథ. 28

వ. ఇట్లు మిగుల, విలపించి దరినున్న హారినరసి యిట్లు
పలికిరి. 29

క. కరుణాంబుధి! మామక దు
ష్కర కర్మసమీరణంబు గదపనిచో మా
గురుతర సౌభాగ్యవిహృతి
కరయగనీబుద్ధి కలుషయగు నెట్లుహరీ. 30

చ. గురుకృధ వైరి యైన నృపకుంజరునిన్ దయమాలి జంపుటల్
హరివగునీకు యుక్తమనయంబును దత్సహచారిణీస్థితిన్
దొరకొనియుంటిమవ్విధియుద్రుంప గజాలనికూరులన్ సుదు
ర్భరమదమున్ దొరంగుమమువారకజూడవదేమి శ్రీవరా. 1

శ్రీకృష్ణుడు దేవకీవసుదేవుల చెఱమాన్పి యుగ్రసేనునికి పట్టంబుగట్టుట

వ. ఈవిధంబున జీవితోపక్రోశంబుగా నాక్రోశించు చున్న తదీయ ప్రాణనాయకలగువారి నూరడించి తల్లిదండ్రులను కారాగారంబునుండి విడిపించి యదునందనులగునాబలరామకృష్ణులిర్వురును సానందంబుగా వారికివందనంబు గావించిరి.

గీ. అంబ యని తాత యనివారలాడునుడులు
గాంచి తలిదండ్రులట చిరకాలమునకు
విలయు కారాగృహాప్తి చే నలరునార్తి
నెల్లవిడిచిరి ముదము వే నుల్లమలర. 33

వ. అటుపిమ్మట తల్లిదండ్రులగు దేవకీవసుదేవు లిర్వురును దమనందనులగు బలరామకృష్ణులం గాఢతరానురాగంబుచే గౌగలించుకొని మరలమరల సందిటంబట్టి నిరంతరానందబాష్ప జలాభిషేకంబుచేతం గంససంహారదీక్షాపరిసమాప్తి యందగు నవభృథస్నానంబునుంబోలె నొనర్చుచున్న పితృలనుగాంచి మధుసూదనుండు మధురంబుగా నిట్లుపలికెను. 34

గీ. బాలలీలలమిము మోద పరుప లేదు
మీవిపత్తులనెల్ల శమింప లేదు

యేనుతనుజుండనై నందుకిపుడు మీకు
ముక్తిమాత్రిమె ఫలముగా బొల్పుచుండె. 35

గీ. తనదులీల విజాతీయ జనునిగూడ
చెలగి రంజించు సుతనిర్విశేషుడగుచు
ధరణినబ్బాలుడె, పురుషోత్తముడు దూర
మందునాపితరులకేన నందనుడను. 36

గీ. మధురతరములు తత్వమర్మస్ప్రశంబు
లయ్యు లోకానుసారంబులైనవాని
ధన్యవాక్కులచే తలిదండ్రిలపుడు
నొనరమోహితులగుటది యుచితమగును. 37

వ. తరువాతను యదువుల కవనిపరిగ్రిహంబునకు యయాతి శాపరూపాంతరాయంబును దెలిపి మాతామహుం డగు నుగ్రిసేను ననునయించి రాజ్యభారంబునం దనువర్తిం చుట కొప్పఁజెప్పి, నందగోపాలుని పార్థనాపూర్వకంబుగా వ్రిజంబునం దుండ నియమించి యదుకుల పురోహితుండగు గర్గమహర్షిచేత వసుదేవునాజ్ఞగొని యదునందనులిర్వురు నుప నయనసంస్కారంబులు గలవారలై తేజరిల్లుచుండిరి. 38

గీ. వరలు నిజసూత్రిలబ్ధమా బ్రిహ్మచర్య
మునకు మున్నె వ్రిజాంగనాతనుసుసంగ
మున గృహస్థాశ్రిమము శౌరిపొందెనద్ది
జెలగ వాత్స్యాయనునిసూత్రిసిద్ధమగుచు. 39

క. యదునందనులిర్వురు నటు
పిదపన్గురుకులముఁ జేరి వేదములెల్లన్
జదివిరి గాని హరిన్ శ్రుతి
ముదమున గ్రహియింపఁదయ్యె పొల్పుగనెపుడున్ 40

క. హరికలశ్రుతి భావమునం
దరయగను పద, క్రమంబులం దెచ్చటఁ జా
తురిగల్లదైన ప్రథవే
మరుగాౕనె త్రిపదక్రమాప్తి మాత్రమువలనన్. 41

వ. తరువాత నరువదినాల్గురోజులలో సకలకలాకలాపంబునొంది భగవంతుండగు శౌరి యొప్పుచుండెను బలభద్రుండునటులనే యొప్పుచుండెను. 42

క. ప్రకటవిధుండగు నీతడు
సకలకళలవృద్ధినెరపి చాపష్టికిన
ప్రకరమునకైన నాఁటవీ
నికళలు క్షీణింపకుండె నెలకొనియెపుడున్. 43

వ. అటుతరువాత యదునందను లిర్వురును జలధిమధ్యంబున నణగియున్న తనతనయుం దెచ్చి యిచ్చుటయే గురుదక్షిణగా గోరుచున్న మునివరుండగు గురునిచే బ్రేరేపింపఁబడినవారలై వరుణాలయంబునొందిరి. 44

వ. అచ్చట ససంభ్రమంబుగా బూజ గావించుటం జేసి ప్రసన్నుండైన సముద్రంబునుండి వచ్చుచున్న జలచరుండగు

పంచజనాహ్వయంబుగల రక్కసుం డొక్కరుండు శంఖరూపం బును ధరించియున్న వానిం గని తదపహారకుండు వీడెయని తెలిసికొని సలీలంబుగా సలిలంబునందు మునిగి వానింబట్టు కొని తదుదరంబునం దక్కొడం గురుతనయుం గానక వానిం జీరితద్గర్భంబునుండి యర్భకుంగొని యాశంఖంబును గూడ గ్రహించి సంయమినీ నామకంబగు శమననగరంబునకుం జనిరి. 45

గీ. అపుడు హరికాలవశమున నాద్విజసుతు
గరిమమీరగనుపనీతుగా నొనర్చి
గురుని సన్నిధి జేర్చెను కొమరు మిగుల
నదిద్వితీయపు జన్మమై యలరుటరుదె ? 46

గీ. శాంతుని ధరామరకుమారు శౌరి యతని
తనువుచేతనె భూమి స్పృశునిగ జేసె
నబ్బురము మాయియై విధి నతిశయించు
నత డొనర్పని దెద్ది పరార్థ కాంతు. 47

— జరాసంధుడు మధురమీదఁ దండెత్తి కృష్ణునితో యుద్ధము సేయుట —

వ. అబుపిమ్మట నొకప్పుడ స్తిప్రాస్తియను నామం బులు గల కంసభార్యలు నూతన వైధవ్య విధురలై దుర్బో ధంబు సేయుటవలన మగధదేశాధీశుండగు జరాసంధుండు దండెత్తివచ్చి మధురానగర ప్రాకారంబు నాక్రమించెను. 48

సీ. పూర్వపు ద్వారముఁ బొలుపొంద
సాళ్వాది మేదినీపతు లాక్రమించి రపుడు
దక్షిణద్వారమున్ దగులీల విందాను
విందు లాక్రమణంబు నొందిరపుడు
పశ్చిమద్వారంబు ప్రమదద్రుమ ముఖులు
బలిమిని నరికట్టి తరలిరపుడు
నుత్తరద్వారంబు నొనర శకున్యాది
ముఖ్యులావరణను బూనిరపుడు
గీ. కలిత కల్పాంత తాండవా ఖండఖండ
పరశు నుద్దామఘర్ఘరా ప్రవటునినాద
సోదరంబగు డిండిమాత్యుగ్రరావ
భరముచే నిండె బ్రహ్మాండ భాండమపుడు. 49

వ. తత్క్షణంబున తద్వృత్తాంతంబు నంతయుం దెలిసి కొని యద్ధుకదనంబని దెల్పుచు నారోహితస్యందనుండగు నయ్యను నందనులు నగరరక్షణకై కృతవర్మసాత్యకి ప్రముఖుల కాజ్ఞయొసగి నియమించి వివిధాయుధంబులం గైకొని యుద్ధంబుకొర కుత్తరద్వారంబునుండి కడువడిం బయలువెడలి రప్పుడు. 50

మ. హరిపూరించెను పాంచజన్యముసముద్యద్వైరిసైన్యంబుదు
ష్కరభీతిన్ జన, భూమిఘూర్ణిలగ లోకంబుల్ జలింపన్ బయో

ధరముల్ రాల గిరుల్ బడంగ నరిదిన్ దానన్ గళన్మాగధీ
శ్వరువ్యూత్కంధరనుండి ధైర్యహారిదా జన్దించె వెన్నూచుచున్.

వ. అప్పు డనేకవిధంబులను యశోధనంబగు నాయో
ధనంబు బయలుదేరెను—అది యుక్తమేయగును. 52

చ. సరయము శౌరిసంగరము శత్రువిదారణ కారణంబుగా
మెరయుటలొప్పునయ్యదియెమిత్రఘనాంగవిభేద హేతువై
బరగు శుచిత్రమౌనతని వైరులు దారితగాత్రులౌట వే
మరుశరభాధచేనుపయమంబును జెందుట లొప్పుఁజూచునా
మరతరుణీగణంబుపయమంబునుబొందుటచిత్రమెంతయున్.

చ. ఉరుతరసంగరంబున సముద్ధతుఁడౌ హరి కాలరుద్రుఁడై
వెరవుగ విండ్లయందు నవి వేట్కధరించునరాజులందు జ్యా
విరహము సేయుచుండు నతివేగముగా నలవంశఖండనం
బిరవుగ సేయు చాపములకెంతయుఁ దుచ్ఛనరేంద్రజాతికిన్
సరగున స్వీయచక్రమును శాత్రవచక్రముపట్టెనొక్కడన్.

చ. పరగ ననేకయుద్ధముల భానునిజిల్చి నిజప్రతాప భా
స్కరుని సృజించు శౌరి, యదిగాక కళంకితరాజమండలం
బురువడిమాటుసేయుచునిజోన్నతిజాతయశస్సుధాంశునిఁ
బరపెడుస్వప్రయోజన వివర్తిజగద్ధితుఁడౌట యెట్లొకో !55

వ. తరువాత శిశుపాల జరాసంధుల కెదురుగా వచ్చు
చున్న మధుసూదనుని గాంచి జరాసంధుఁడు గర్వోద్రేకంబు
తో నిట్లు పలికెను. 56

గీ. శౌర ! హరి ! రాజసింహుడనైన నాదు
యెదుట నీగంతులివిశోభ నెనయు టెట్లు
తనవున్నను వ్రాలు నీగలు దలగుటకును
వాలహస్తంబుఁ గదుపుట ప్రకృతిగాదె. 57

వ. ఈరీతిని ధీరదూషణంబులగు వీరభాషణంబులు వలుకుచున్నవానింగని యమితరోషంబున భగవంతుండగు వాసుందేవుం డిట్లు సంభాషించెను. 58

ఉ. ధీరత నూరుమారులు మదీయ శరాహతిచేత నీతనూ
భారము జీరినన్ మరల బాగుగ నజ్జరగూర్చునంచు నా
శారుచి బూన వద్దికను శక్తియు మాకు బరాఖ్యనుండెఁగా
మారియనన్నినున్ దునుముమానుగన త్తృణతన్ వహించునీ
శారయఁగృష్ణవర్త్మదరినందెడు నంతకె ప్రాణముండుటల్.

వ. ఈవిధంబునఁ బలికి మధుసూదన మాగధాధిపతు లిర్వురును శరంబులు సంధించుటయు విడుచుటయునుం గూడ జూడక మిగుల నన్యోన్యజయంబును గోరుచున్నవారలై యధికతరంబగు బాహుబల కుశలతం జూపుచు కలహాలాలసుండగు మునివరునిచేతనైనను మున్నెన్నడుం గన్నదియును విన్నదియు గానిదియు ఆరాధించుచుండు సురాసురులు గలదియు నగు సంగరంబుఁ గరంబు గావించిరి. 60

వ. అటుపిమ్మట హాలాయుధునిచే పట్టుబడి రథంబువిడిచి శిగ్గుచే దలవంచుకొని యున్నట్టి యా జరాసంధునిం

గార్యగౌరవంబునంజేసి కరుణచేతంబోలవిడిపించి మధువైరిమ
ధురానగర బునకుంజనియెను. 61

—• శ్రీకృష్ణుని కాలయవనుడు వెంటనంటిపరుగెత్తుట. •—

వ. ఈపగిది పదియేడుమారులు సంగరంబు జేసినదియె
మరలఁజేయుచుఁ బరాజితుండై మరల పదునెనిమిదవమా
రుగూడ జరాసంధుండు సంగ్రామకామంబుచే సన్నాహంబు
సేయుచున్నవాఁడై యున్నసమయంబున నారదప్రచోదితుండై
జవనుండగు యవనుండు మధురానగరంబునొంది యామధు
సూదను నాహవంబు కొరకాహ్వానంబుగావించెను. 62

వ. యదుపతియును నావృత్తాంతంబువిని యతివిషమ
స్థితి సముపస్థితంబైనదని మంత్రులతో నాలోచించి స్వజన
గోపనంబుకొరకు సముద్రమధ్యంబున పదిరెండామడ వైశా
ల్యంబుగల ద్వారకానగరంబను పేర నొక పట్టణంబు విశ్వక
ర్మచేత నిర్మింపజేసెను. 63

వ. అపుడా సలిలదుర్గంబున నిజదాయాదులగునయ్యా
దవులనందఱనుంచి యాయదునాయకుండు బలభద్రునితో
గూడి సంగ్రామ కామంబుచేత మధురానగరంబునుండి బయ
లువెడలెను. 64

వ. ఆలీల వచ్చియున్నయతనింజూచి మును నారదుని
చే దెలుపబడినరూప రేఖలనెంచియరవిందనాభునిగా గ్రహించి

మనంబున నిశ్చయించుకొని దురితభవనుండగు యవనుండు సోత్కంఠంబుగా నతని యువకంఠంబున కేగెను. 65

వ. అపుడు భగవంతుండగు వాసుదేవుండు శీఘ్రంబుగా నబలునింబోలె పలాయమానుండగుచు దనతోఁగూడ బట్టుకొనుటకుఁ బర్వులిడి వచ్చుచున్న నయవిహీనుండగునీయవనుని ధరాధరకంధరంబునొందించి తానంతర్ధానంబునొందెను.

వ. దుర్బుద్ధియగునయ్యవనుండచ్చట గిరిగుహాంతరాళంబున, మాంధాతృసుతుండును నిక్ష్వాకుకులుండును సురాసురసంగరసంగతంబగు శ్రమనివారించికొనుటకు నింద్రాది దేవతలచేత ననుజ్ఞగొని శయనించియున్నవాడును నీదునిద్రాభంగంబొనేయువాడు భస్మీభూతుండగునని వరంబు గొనియున్నవాడును నగు రాజర్షియైన ముచికుందునిగని ముకుందుండని యెడు బుద్ధితో సక్రోధంబుగాఁ గాలితోఁడందన్నెను. 67

వ. ఆముచికుందుండంతట మేలుకొని లేచి కన్నుదెరచి నలుదిక్కులంజూచుచు నక్షిపాతంబువలన నెదుటనున్నవాని భస్మంబుగావించి చూచి, యాహా! యేమిదీ! యిట్లనుచితంబగునిది తటస్థించినది యని మనమ్మున జింతించుచున్నవాడై తనచెంత సముపవిష్టుండైయున్న యక్షీణమహిమాన్వితుండగు నధోక్షజు నీక్షించి యిట్లునుతించెను. 68

—• ముచికుందుడు శ్రీకృష్ణుని నుతించుట •

చ. అనిశమసత్తులౌ గుణములన్నియునీయెడగొల్పి సన్నుతుల్
మనిపెడువారిపై కృపను మత్సరమెద్దియు లేదులోకమం
దనుచును నాత్మసన్నుతినయంబునఁదెల్పెద మట్టివాక్కుల
య్యనువగునట్టి నీపరిచయంబది తోరముగాగ మిథ్యలౌ
ననవిరహంకృతిన్ గొనెదవంచుయశంబుజనించెచిత్రమా. 69

చ. కనభవదిష్టమై యసతిగా దగుమాయనినుఁగ్రహించిదా
బెనగొను భేదబుద్ధి నొదవించి స్వజాతిజులైన జీవులన్
ఘనమగునట్టి నీగృహముఖంబునుఁజూడనివారిఁగాగఁబెం
పొనరిచినీవునైన యటనుందువొ లేవొయటంచుసంశయం
బునుఘటియించెదానినికబోవఁగ ద్రోయుముమాకులాభమా.

చ. వటుతిగ్రుణంపు తాడులను బాగుగ దేహులగట్టి వేదనో
త్కటులయియంత దీనులముతద్దయుఁబోవ్రుమటంచుముక్తికై
పొటుకునఁబల్కు జీవితులముక్తులఁజేసెదు లాభమద్దియం
తట నమృతంబు దుర్గమునదార్చెదవద్దియునార్తిలేమికిన్.

మ. మనుకళ్యాణమనంతమీవఁగొని రమ్యంబౌచు నిస్సారమై
యనువాక్కోశములన్ ఘటించుచునుజీవాళిన్గడుం వేరుగా
సనిశంబున్రచియించి మోహమిడుమాయావిన్నినున్గాంచియా
ర్తినిగొంచున్ భవదైక్యలబ్ధికయి భుక్తిఁమ్మాని ఖేదింతుర
య్యనఘంబౌ శ్రుతిధర్మ మర్మములనాహా! నీకళాచాతురిఁ.

చ. పరువడినిన్ ద్రివిక్రముడవంచునెరింగియు బండితుల్ సదా
దరమున మానసంబునను దాల్తురదే మొకొ యానవిద్యచే
మరచినస్వాత్మముల్ గలుగుమత్తులకయ్యది యేహితంబగున్
గరిమనుముందుగా మదినిగైకొనివెన్కతదాత్మనెంతయున్
దొరకొనిస్వాత్మలో నెరపి తుంతువు వారలనామరూపముల్. 73

చ. కరములులేకె చేకొనెదు కాళులులేకయె పర్వులెత్తెదా
గరిమను కన్నులన్ గానకె కాంతువుపీనులులేకవిందువా
పరమగుచూపు ప్రిచ్యునకు ప్రత్యకుగా నెటులయ్యెనంచు ధీ
విరతిభ్రమింత్రుతత్వపదవిన్ గనజాలక బ్రహ్మముఖ్యులున్

వ. ఇవ్విధంబున మిగులదూరతరంబుగాసన్నుతించుచు
న్న యా ముచికుందుని ముకుందుడు సాదరంబుగా నభినం
దించి వరంబుగూడ ప్రసాదించి సకల తుష్టి సంహారంబుగావిం
చి మధురానగరంబునకు మరలివచ్చెను. 75

వ. తరువాత ముచికుందుండు కందరోదరంబునుండి
బయలుదేరి గంధమాదనగంబునొంది యచ్చట నరనారా
యణాశ్రియమందలి బదర్యాశ్రిమమందు మురహరియగుశౌరి
నిమిగుల నారాధించి పూజించెను. 76

—♦ జరాసంధుడు ప్రవర్షణగిరిని దహించుట ♦—

వ. అపుడు భగవంతుండగు వాసుదేవుండును యవను
నికి దోడుగావచ్చియున్న తుచ్ఛులగు మ్లేచ్ఛులనురుముజేసి
తదీయంబగు సర్వధనంబును ద్వారకానగరంబు నొందించి

యున్న సమయంబున జరాసంధుండుమరల సమీపించి మకర వ్యూహంబుగావించి మురవైరికడ్డుగామార్గంబునరికట్టెను. 77

వ. మరియు నానావిధంబగు సమరంబుగావించి జాత రూపజాతంబు నాక్రమించి సముపజాతకుతూహలంబుతో సంగరాకాంక్షియై యరవిందనయనుని సమీపంబున కేగెను. 78

వ. అప్పుడు భగవంతుండగు శౌరి తదీయసంరంభంబునుసహింపలేనివానివలె బలరామునితోఁగూడి చపలంబుగా పలాయమానుండై పవమానవేగంబుతో కరవీరపురంబునందారాత్రిని వెళ్లించి సూర్యోదయసమయంబుననే గోమంతంబను పేరుగల సానుమంతంబు నారోహించెను. 79

వ. అచ్చట ప్రవర్షణాభిధేయంబగు గిరిశిఖరంబునారోహించి ఫలమూలాశనంబుల గావించుచున్న యదునందనులనిర్వురంబట్టుకొన నిచ్ఛగలవాడై మాగధుండు సపరివారంబుగా నాశిఖరిం బరివేష్టించి దానిపైకెక్కియచ్చటెచ్చటనో! డాగియున్నవారిం బొడగానగ యాపర్వతంబునంతటను నగ్నినంటించి కాల్చివైచెను. 80

వ. అపుడనలపరీతంబగు నప్పర్వతంబును వారిర్వురును విడిచి సచమత్కారంబుగా నెగిరిపోవుచు దశయోజనంబులు గడచి బహువేగంబుగా సాహసించి భూమికిందిగిరి. ౮1

గీ. మాగధుని వంచనమొనర్చి మాధవుడును
బలుఁడుద్వారక కేగిరి భద్రముగను

ముగ్ధుఁడగుమాగధుఁడు వారుదగ్ధులైర
టంచు ముదమొంది తనపురికరిగెనపుడు. 82

అటుతరువాత మరియొకప్పుఁడానర్త దేశాధిపతి యగు రైవతుండనెడు రాజు చతురానన నియోగంబువలన దననందనయగు రేవతియను గుణవతిని బలరామునకు భార్యనుగానొసంగెను.

గీ. రమ్యసన్మార్గవర్తియౌ రౌహిణేయు
డట్టివిధివశతను కన్యనందకున్నె!
యైనను సమున్నతగృహోత్ప్రహర్షితుడయి
యటఁగృతాశయతఁజెలింపడద్భుతముగ. 84

—• రుక్మిణీకల్యాణకథాప్రారంభము. •—

గీ. విమలగుణలోలయౌభీష్మ విభునిబాల
విధునికరము గ్రహింపగా వేట్కఁగోరె
ముగ్ధత సమున్నతుడు దురాపుడగునతని
నామెమదిఁగోరుటది యుపహాస్యమగునె. 85

గీ. కామమోహితుఁడై రాజకన్యకనల
విధుఁడు మోహించె ప్రియయౌచు వెలయుటకును.
సరగనిదితగుఁ దగదను సంశయంబు
నెట్లుగాను విధినిరసించియేగువాఁడు. 86

వ. ఈవిధంబున నన్యోన్యగుణాకర్ణనంబువలన నిర్ణయించుకొనఁబడిన సంపర్కంబుగల రుక్మిణీకృష్ణులకు ప్రతిసా

లచారియై శిశుపాలపక్షపాతియగు రుక్మికగు దృష్టహృదయం బుదెలుపుటకై రుక్మిణీదేవి, సందేశహారియు నాప్తుండునునగు నొకబ్రాహ్మణోత్తముని మధుసూదనుని సన్నిధికంపించెను. 87

గీ. ద్విజుడు దెల్పినయామె సందేశమపుడు
హరివినుచు ముందెకాదగునట్టిశుభము
ననుభవించెను తద్వివాహాఘమహోత్స
వంబుగనుటయె మిగిలెను వసుధనింక. 88

వ. అపుడు సందేశహారుండగు భూసురునితో యదునందనులతివినతానందనంబగు స్యందనంబు నధిరోహించి యొకరోజునకు పరివారంబుతో గూడ రుక్మిణిం బరిణయ మొందగోరినవాడై కుండిన నగరంబునొందిరి. 89

వ. అపుడె శిశుపాలుండును సాల్వజరాసంధాది స్వపరివారంబుతో రుక్మిణిం బరిణయమొందగోరినవాడై కుండిన నగరంబునొందెను. 90

గీ. అంతలో శౌరి వేట్కతో నలరుచుండ
నామె విమతినిశంకించి వ్యసనమొందె
దైవమనుకూలభావంబుఁ దలచుగాక
యట్టిదియెరుంగవశమె బ్రహ్మకునుగాక. 91

వ. అటుతరువాత భూసురవరుండును శీఘ్రగమనంబుతో వచ్చి యదునాయకుండగు హరివచ్చియున్నవాడనిరుక్మిణికివిన్నవించుట కంతఃపురంబున కేగెను. 92

గీ. మహితద్విజరాజు దర్శనమాత్రముననె
శుభదముదమిడె నలరాజసుతకునామె
నిచిర రుచిభంగకృత్యుడై నిరతమంద
తనుజభాక్సవిత్రునిభీతిఁదాల్పదయ్యె. 93

గీ. మహీసురుడు దెల్పవిని సుదృగ్మణికినపుడు
శౌరి యాపాతబుద్ధినిశ్చయముగల్గె
దానిచేతను ప్రత్యక్ష దర్శనమున
బరగునటు పరమానందభరమునొందె. 94

వ. తరువాత విదర్భాధిపతియగు భీష్మకుండు వసుదేవనందనులిర్వురును నిజతనూజయగు రుక్మిణీ వివాహమహోత్సవంబు నాలోకించుటకై వేడుకగలవారలై వచ్చియుందురని నిశ్చయించుకొని వారలకెదురుగా జని విధిపూర్వంబుగానర్ఘ్యపాద్యాదులిచ్చి పూజించి బాహ్యోద్యానంబునందున నివసింపజేసెను. 95

వ. అప్పుడే చేదిరాజతనూజుండగు శిశుపాలునిజామాతగా దలచుచున్నవాడై లెస్సగాబూజించి నగరంబునకుదోడ్కొనివచ్చి ప్రవేశపెట్టెను. 96

క. దమఘోషవిధర్భేశులు
తమసుతునకు సుతకునపుడు దగుశుభమలరన్
విమలాంగమంగళక్రియ
లమరగనిజ జనులచేతనలరించిరొగిన్. 97

వ॥ ఆహా! యిది మిగుల నాశ్చర్యముగానున్నది.

గీ॥ చెలఁగి శుతిమంతయయ్యును చేదిపతికె
కౌతుకాప్తి శుభోత్తరగానిదయ్యె
ద్విజునిలౌకిక మంత్రసిద్ధినివహించు
నదియె శౌరికి శుభమునకయ్యెనహహా! 98

రుక్మిణీదేవి వర్ణనము — గౌరీనిలయంబున కరుగుట.

99 వ॥ అటుపిమ్మట ననర్గళంబగు మంగళతూర్యరావంబుచే దిశాముఖంబులు ముఖరితంబులగుచుండ, వారింపదరముగాని పరివారవారవరవర్ణినుల గళవిగళితంబులగుమంగళగీత కలవరంబులచే దిగంచలంబులు వాచాలితంబులగుచుండ, విపణిశ్రేణులు నానావిధంబులగు నుపహారంబులతో మనోహరంబులై యలరుచుండ మహోత్సవంబును జూడవచ్చిన నాగరికజనంబులాలోక శబ్దంబులు బల్కుచుండ, షండజనసమూహపరివృతయై వివిధాయుధ విశేషంబులచే సమధిగతంబగు యోధయూధంబుతోఁ బరివేష్టింపబడినదై శచీదేవి విధంబున హరిపరాయణయు స్వాహాదేవివలెఁ గృష్ణవర్త్మదత్తచిత్తయును సంయమినింబోలె జీవితేశహృదయయు తామసిలీల నిరంతరాశ్రితులగు పుణ్యజనులచే ముఖ్యముగా బొందదగినదియు భార్గవిచందంబున భువనాధిపానురక్తయు, సదాగతి రీతి ప్రియస్పర్శనాభిలాషిణియును; సర్వసంపత్కలనవమువున మనుష్య ధర్మానువర్తినియు, పార్వతిగతివృషాకపి

ప్రిణయినియు, భారతితీరున విద్యానుకూల్యకామయు, ఛాయకైవడి పద్మాప్తాభిలాషిణియు, రోహిణికరణిని విధుసంగమాభిలాషిణియు, తారతీరునకమనీ యధిషణయు దేవసేనవిధంబున కౌమారవిభ్రమప్రిణయినియు రతిగతికందర్పవశగయు ద్రుపదాత్మజంబోలె ధర్మానురక్తయు సుభద్రపగిదినపార్థగామవర్జితయు చిత్రాంగదభంగిప్రియ విజయాభిలాషిణియు, నిలవలెబుధశ్లాఘనీయయును, సతిగతి తాతానభిమత పతికాముకయును, నూర్మిళలీల రామానుజానురక్తయు, దేవయానింబోలె కమనీయకచయు నహల్యవలె రచితాతిరిక్తపతికాముకయు మరియు పాతివ్రత్యంబునకు రూపాంతరయగు దానింబోలె వెలయుచున్నదియు, గతిరామణీయకంబుచేతను, హరిసవిూపంబునొందు నిచ్ఛచేతనుంగూడ హంసగామినియు, హరిద్ర వసనంబు ధరించుటచేతను మాధవానురక్తతగలదగుటచేతనుంగూడఁ బీతాంబరప్రిణయినియు, సత్యకామతచేతను హరివాంఛచేతనుంగూడ నచ్యుతకామయును మంజీరమంజుల శింజితంబుచే రంజితయగుటచేతను జలజవిజిగీషచేతనుంగూడ గర్జవలె పదయుగళంబును బుడమిపైనుంచుచున్నదియు తపఃప్రభావంబువలన సంభూతంబగు జంగమభావంబుగల రంభాస్తంభయుగళంబువలె వెలయు నూరుయుగళంబును ధరించియున్నదియు, కాంచీపదత్వంబుచే మదనునకు తపఃసిద్ధిక్షేత్రంబువలె నలరు నితంబబింబంబు నవలంబించి

యున్నదియుఁ దదంగనిర్మాణసమయంబున లంబోదరు నారాధింపనివిధిచే, మరువబడినదివోలె వెలయు నవలగ్నంబును ధరించుచున్నదియు, హృదయంబున శయనించుసంగజ మతంగజంబునకు గల జగతీధరలంఘనేచ్ఛచే ముందరకుఁజూచిన ముఖంబునందలి కుంభంబులననుకరించు కుచయుగళంబుతోడను శుండాదండంబుననుకరించు రోమరాజితోడను శోభిల్లుచున్నదియు, ముఖచంద్రసేవ సేయుటకు వచ్చియున్న నక్షత్రమాలికలీల వెలయునిరువదియేడుముత్తెంబులుగల నక్షత్రమాలికచే వలయితంబగు గళ ప్రదేశంబుగలదియు, చంద్రునిదిరస్కరించి యున్నదైనను వాస్తవంబువలన నిదిచంద్రసహోదరంబనియెడు దుష్కీర్తినిఁ బరిహరించుకొనుటకుంబోలె జన్మాంతరంబును స్వీకరించిన, వదనారవిందంబుతోఁ బ్రకాశించుచున్నదియు, ముందుగా మధుమాత్రవైరియు, దరువాత ననేకప్రకారంబుల చేఁబరిత్యక్తమధురుండగు హరిచేవాఛింపఁబడుచుండు మాధుకీధురీణంబగు నధరంబును ధరించి యున్నదియును, బింబాధరమాధురి నభ్యసించుటకుంబోలె సమీపంబునకువచ్చియున్న సుధాబిందువు చందంబున నలరు నాసామౌక్తికంబుచేనలంకరింపఁబడినదియు, అపరిపూర్ణంబగు వదనసౌందర్య సాగరసేతువు రీతినొప్పుచున్న నాసికచే విరాజిల్లుచున్నదియు, మధుపసోదరతచేతశ్రితివిలంఘనమందు నిర్విశంకంబగునట్టి నయనయుగళంబుచే రంజిల్లు

చున్నదియు, కీన్నగేశపరితారణంబునకు ముకుందకళ్యాణ నిధివిలోకనంబున కనుకూలంబగు సిద్ధాంజనంబు కైవడినలరు కస్తూరీతిలకంబునళిక దేశంబున ధరియించియున్నదియు, నను భూతసీమంత కర్మంబులుగల శుక్తియువతుల గర్భకుహరంబు నుండి యావిర్భవించిన వాలజాలంబును శిరంబుచేత శ్లాఘింపుచున్నదియు, తటిల్లతికపోలిక పారివృషేణ్యతగలిగి యతి నైల్యంబునొంది యమృతంబును విడుచుచున్న ఘనుననువర్తించుచున్నదియు, తారకవలె విష్ణుపదలోలయు, చంద్రికవలె కువలయామోదినియు, వాసరలక్ష్మివలె రాజమండలంబును మలినంబుగావించు వేడ్కఁగలదియు, దీపశిఖవలె ననంతస్నేహనిక్షేపయోగ్యయు, కల్పలతతెరంగున జగదాదరణీయ పల్లవానుషక్తయు, కామధేనువువలె గోవిందాధీనజీవనయు, చింతామణింబోలె నభీష్టస్పర్శనంబున బద్ధాదరమైనదియు, నమృతధారతీరున ముఖ్యంబుగాఁ గాదగిన విష్ణురథాపహారంబుగలదియు సిద్ధరసంబుహారి కరణి జాతరూపరూపౌన్నత్యలాలస ధన్యజనైకలభ్యయు దివ్యౌషధివలె సకలాంగజరుజాపహారిస్పర్శయుఁ గుముదినిపగిది విధుస్పృహణీయపుష్పోద్గమంబుగలదియు, రత్నమయమేఖలంబోలె కళ్యాణసంబద్ధయు, మణిమంజరిరీతి నాలంబితగుణగణయు, రత్నమాలికపోలిక నంతరావేశిత నాయకరత్నయు, శాంతిచందంబున హరియోగానుకూలయు, కరుణకరణి పరసుఖావహాయును

క్షమవలె పురుషోత్తమనిర్వాణ హేతుభూతయు, శ్రద్ధ
వలె పురుషోత్తమకృత సకలేష్టసాఫల్యసంపాదికయు, ముక్తి
కైవడి విబుధశ్లాఘనీయయు, తీర్థయాత్రచందంబున శిశుపాల
దురవాపయు సురభిభాతిగదాధరభీరు భావోచితయు, భాగీ
రథిపగిది జగతీపతి తపోలభ్యయు యమునతీరున కృష్ణగుణ
ప్రణయియు సరస్వతివలె విశ్వంభరాంతర్గతజీవనయు, కవేరతన
యంబోలె చోళదేశగత మధురతరపయోధరయు, సరయూ
నదింబోలె హంసావాసంబగు మానసంబునుండి ప్రసరించు
చుండెడు సర్వతోముఖ సంభ్రమంబుగలదియు, విరజవలె
వైకుంఠసమీపగామినియు, తుంగభద్రచందంబున మధురత
ర సర్వతోముఖాటోపయు కుసుమ మంజరిరీతి సదాళికదంబ
కరంభితయు కీర్తింబోలె సుఖస్వరూపయు సుకృతపరంపరలీల
హరిప్రీతి జనకయు భగవతియు నగు భీష్మకతనయయైన
రుక్మిణీదేవి స్వయముగనె సర్వమంగళోపాసితయయ్యును సర్వ
మంగళనుపాసించుటకు నంతఃపురంబునుండి బయలువెడలిపుర
మార్గంబు నిర్గమించి భవానీ భవనంబునొందెను. 99

వ. అట నామెను యథావిధింబూజించి తన్మందిరంబు
వెలువడి సఖీజనంబులతోఁగూడ నడుచుచు దేవమాయంబోలె
మనుజదురవాపయు నఘటితఘటనాపటీయసి చందంబున పూ
ర్వపక్షవాస్తవ్యంబగు సకలమైన రాజమండలంబు ననాలోక
పాత్రతాపాదనంబుచేత స్వల్పంబుగా జేయుచున్న కృష్ణప

పాశ్రితరాజ మండలంబు నభివృద్ధినొందించుచు లజ్జతోఁగూడుకొన్నదై మంద మందగమనంబుతో ముకుందస్యందనాభిముఖంబుగా నేగెను. 100

—• శ్రీకృష్ణుడు రుక్మిణీదేవిని గొనిపోవుట. •—

క. దరినున్న రాజమండలి
వరువడి విడనాడి చక్రిభాసురపద్మా
దర రథమునఁ జేరె మనో
హారసవిత్రుపేరిమ పాత్రమగుటసతియుదార్. 101

క. అరయఁగ పేరియసి హారణమె
హారణము మరియెద్దిగొనక హార్షముతోఁడర్
వెరవరి రాజులు జూడఁగ
మురియుచు రుక్మిణినిగూడి మురహారి వెడలెన్. 102

వ. అటుతరువాత జరాసంధాదులు యుద్ధంబునకుబద్ధాదరులై మధుసూదను ననుసరించి వర్త్రిత్తుచు, ననేకప్రకారంబుగాసమరంబువిడిచి పరాజయంబునొంది భగ్నరథులునుశిథిలమనోరథులును నయి తిరిగివచ్చి త్రిదివంబునుండి పరిభ్రష్టుండగు నహుషునిచందంబున, పురుహూతునిచే ద్రోసివేయబడిన త్రిశంకునికైవడిని ప్రమాదగళిత విద్యుండగు పండితునిరీతి, పశ్యతోహారుండగు స్వర్ణకారునిచే నపహృతంబగు రత్నంబుగల షాహుకారునితీరున నతిదూనమానమానసుండై దుఃఖంచుచున్న శిశుపాలున్నూరడించి పలికి వానితోఁగూడ తమతమ భవనంబుల కేగిరి. 103

క. హరి ననిమునుమక నాసో
దరిఁగొనకయె వత్తునే ముదంబున ననుచున్
వరరుక్మి కోపముననిటు
నెరపుప్రతిజ్ఞయును నపుడు నిజమైయలరెన్. 104

వ. ఈవిధంబున రాజబంధువులయెదుట నక్రోధంబు
గా బ్రతిజ్ఞగావించి యక్షోహిణీపరిమితంబగు సైన్యంబుతో
గూడుకొని మధుసూదను ననుసరించి బర్వులిడుచుండెను.105

గీ. కనుగొన స్వదారమాదాయగతయనంగ
నలరు నలవశ్యతో హరుడతడు రుక్మి
కిపుడు మరల నొసంగునే యిటుస్వమృత్యు
వునకునై కృష్ణవర్త్మను బొందువాని
విపులనెచ్చట గనలేదువినగలేదు. 106

వ. అట్లు మధుసూదనుని దరికరిగి యిట్లుపలికెను.107

గీ. కర్కశముఖాప్త మార్గణౌఘంబురుక్మి
బ్రతికియుండ స్వసారమపాప్యయనగ
మరలిరాదిక ఖలభావ మలినవిడుము
గాఢముష్టిని నిడకున్న గలుగునీదు
స్వపరిపాలన బుద్ధిదుష్టయగుగాదె. 108

వ. రుక్మి యిట్లుపల్కుచుండునపుడు.

గీ. అరయశౌరియెకాదు గతాహిభీతి
నతనిసదృశమును చంద్రహాసమొందె

నపుడు రిపువపువులనెకాదమరసతుల
తనులతలసాత్వికాసముల్ దడిపెనహహా. 109

వ. తరువాత నిహతవాహినీ వాహనుండును సముప
జాతపరాజయుండును నగు రుక్మియనువానిం జంపుటకు యో
ధయూధంబులుం గాంక్షించుచున్న సమయంబున. 110

క. సారెకు రుక్మిణిదైన్యా
సారంబగు వాక్సుధారసము హరిగోల్ల
గా రుక్మిగదియె మరణము
వారింపగ హేతువయ్యె బహుచిత్రముగాన్ 111

వ. తరువాత కేశవునాజ్ఞచే రుక్మిని ముండితముండుని
గా జేసి వైరూప్యంబునొందించి పగ్గపు త్రాళ్ళచే యోధవరు
లు బంధించిరి—అది యుక్తముగనేయున్నది 112

గీ. అలధనుర్వేదనైపుణ్యమంత మొందు
తరిని సేయగ దగునదే దగెనుపీని
కరయ సంగసమావర్తనాప్తి చికుర
ముండనంబు శిరఃశ్మశ్రుముండనంబు. 113

—• శ్రీకృష్ణుడు రుక్మిణీదేవిని పెండ్లాడుట •—

వ. అటుపిమ్మట పరమకారుణికుండగుబలభద్రునిచేత
విడిపింపబడినవాడై రుక్మియునునతండు ప్రాణమాత్రావశిష్టుం
డై మరలిపోవుచుండునపుడు శౌరియును త్వరితంబుగా ద్వార
కానగరంబునొంది యథావిధిపూర్వకంబుగా రుక్మిణిం బెండ్లి
యాడెను. 114

క. హరిచేపాణిగ్రహణము
బరువడి ద్వివిధంబునొందబడియెను దొలుతన్
ధరణీసురసాక్షికమును
సరసంబుగఁ బిదపనగ్నిసాక్షికమునుగాన్. 115

వ. తరువాత నొకప్పుడు పూర్వకాలమున పురారి నయనానల జ్వాలలచే దగ్ధుండగు కాముండు శరీరకామంబు నొంది కమలాపతి హృదయంబునం బ్రవేశించెను. 116

వ. తరువాత వైదర్భి గర్భసంభూతుండైన ప్రద్యుమ్న నామకుండగు నీతని బురిటిదినంబులలోననే శంబరాసురుండు తనకువైరిగాఁదలంచి యపహరించి సముద్ర మధ్యంబునం బడవైచెను. 117

గీ. మీనకేతనుఁడీతండు మేలుమీఱ
గంబమునమము చిరముగాఁ గట్టెననుచు
వైరివలెమీనమయ్యెడ వచ్చికడగి
యామహాశిశువును మ్రింగెనద్భుతముగ. 118

వ. అపుడామీనంబును శంబరాసురుని కొరకు బల్లె వాండ్రచేఁ గానుకగానర్పింపబడినదపుడువంటలవాడు దానిం గొని చని కత్తిపీటచే దరుగు సమయంబున దానిగర్భంబునం దున్న శిశువునుఁ బైకిదీసి పాకశాలాధ్యక్షురాలుగు యచ్చట వశించియున్న మాయావతియను నపరనామంబుగల్గు రతిదేవి కొరకు నివేదించెను. 119

వ. ఆమెయపుడి దేమిచిత్రమని శంకించుకొనుచున్నదై పిమ్మట నారదవచనంబువలన నితని యాదార్థ్యంబును దెలసికొని పతిలాభంబువలన పరితుష్టాంతరంగయై బాలకుం బోషించెను. 120

వ. తరువాత మఱికొంత కాలంబునకు సంజాతయౌవనుండై యాప్రద్యుమ్నుండు స్వశరంబులకు లక్ష్యభూతుండయ్యెను. 121

గీ. సాంగుడయ్యెనుఁ దన్నుదా స్వశరములను
కొట్టుకొనుటెట్టులగునది యట్టితగును
క్షీణమయిన మధ్వపాయిదా గాకయున్న
నచట స్వహితాజ్ఞతయు గల్గుటబ్బురంబె. 122

వ. అపుడు ప్రియురాలగు మాయావతిచేత ప్రతిగ్రహింపజేయబడిన మాయాభంజన విద్యచేత ప్రకాశించుచున్నవాడై ప్రద్యుమ్నుండు సత్వరంబుగా శంబరాసురుని సమరంబున కాహ్వానంబుగావించెను. 123

వ. అవ్విధంబున బిలచి వానియెదుట నావిర్భవించి మిగుల మాయను సృజించి యమితాయాసంబునెరపుచున్న యాశంబరు నంతకసాన్నిధ్యంబు నొందజేసి విధేయురాలగు మాయావతితో గూడ వానిగృహంబును విడచి యంబరమార్గంబున కెగసి విర్గమించి నిజోత్పత్తి స్థానంబును బొందెను— అచ్చటను. 124

గీ. అపుడు కాంతాసమేతుడై యరుగుదెంచు
వాని పరుడని యవరోధవధువులెల్ల
లజ్జనొందిరి రుక్మిణీ లలనదెలసి
తనకుచక్షీరధారలు దనర నతని
గన దనన్యజుడైనను కామమతిని. 125

గీ. పోయినధనంబు మరలనుబొందినటుల
గాంచెరుక్మిణి ప్రద్యుమ్న కలననెంచి
భూరిలాభంబుగా నామె ముదమునెంచి
చెలులును స్వలాభముగ సంతసించిరపుడు. 126

శ్రీకృష్ణుడు లోకాపవాదనివృత్తికొఱకు శమంతకమణినిదెచ్చుట.

వ. తరువాత మఱియొకప్పుడు సత్రాజిత్తను నతండు దినమణి ప్రసాదంబువలన పొందబడిన శమంతకనామంబుగల దివ్యమణిని ధరించి రెండవసూర్యునిభాతిం దేజరిల్లుచు ద్వారకానగరంబునకు వచ్చి నిజభవనంబునొందెను. 127

వ. అపుడు చూడశక్యంబుగాని మణి కిరణంబులచేత మసృణిత శరీరుండగునతనింజూచి యాకర్మసాక్షియగు సూర్యుండు నిన్నుజూచుటకై ప్రత్యక్షంబుగావచ్చెనని శ్రీకృష్ణునితో నాగరికజనులు దెలుపుచుండునపుడతండు మందహాసంబుజేయుచు లోకంబు మోఘదృష్టి గలదని భావించి సత్రాజిత్తుని మందిరంబునకేగి తనకామణినిమ్మని ప్రార్థింపగా నతండా ప్రార్థనంబును వ్యర్థంబుగావించెను. 128

వ. మరియొకప్పుడు సత్రాజిత్తునకు సోదరుండగు ప్రసేనుండను వాడమ్మణి నలంకరించుకొని మృగయా వ్యాపారంబుచేత నయ్యరణ్యమార్గంబున దిరుగుచు మణిలోభంబుగల్గు నొక సింహంబుచే జంపబడియెను. 129

వ. అటులాసింహంబు శమంతకమణిని గ్రహించి కందరాంతరంబుజొచ్చుచుండ దానిని వధించి జాంబవంతుండా మణినిగైకొని నిజతనయాక్రీడనంబుకొరకై యుపయోగించియుండు నవసరంబున సోదరవిరహవిహ్వలుండగు సత్రాజిత్తుచేత నిశ్చయంబుగాఁ జక్రిపాణి మణిలోభంబుచే నతనివధించి మణినపహరించెనని యారోపింపబడిన ప్రవాదవాక్యంబును విని సహింపజాలక హరియపు డరణ్యమార్గంబున కేగి యచ్చోట జచ్చియున్న ప్రసేను నాలోకించి పరిచరజనంబుల వెలువలనుంచియే జాంబవతీకన్యకచే నధిష్టితంబగు గిరిగహ్వరంబునుఁబ్రవేశించెను. 130

వ. అచ్చట మణిని గ్రహించుటకు బాలికామణిసమీపంబునకు శౌరిఁ జేరియున్నతరుణంబున జాంబవంతుండతిరోషణుండై సత్వరంబుగాఁబ్రవేశించి గర్వించి హరితోముష్టాముష్టినవష్టంభంబుజూపి సంపిండితాఖిలావయవంబులు గలవాడగుటచే క్షీణబలుండై క్షితితలంబునంబడి యప్పుడు సంజాత ప్రత్యభిజ్ఞుండై హరియని గుర్తెరింగి యయ్యరవిందలోచనుని మిగుల వినుతించి మణితోగూడ నాత్మజయగుజాంబవతియను రమణీమణి నతనికి సమర్పించెను. 131

వ. ఆహరియునుతదీయరమణీయరమణీమణులంగైకొని కందరాంతరంబునుండి వెడలివచ్చి యనుచరసమేతుండై పురంబుజొచ్చి సత్రాజిత్తునింబిలిచి తదాహరణప్రకారంబు నంతయుందెలిపి యామణినతనికొసంగెను. 132

వ. సత్రాజిత్తుండును లజ్జాక్రాంతచిత్తుండై యానందనందను నానందింపజేయుట కుపాయంబెద్దియని యోచించి పిమ్మట నమ్మణితోగూడ సత్యభామయనుపేరుగల తనతనయంగూడ శౌరికి సమర్పించెను. 133

క. హరి, రమణీమణిఁమాత్రమె
గరిమఁగొని రత్నమేల! గైకొనుమనుచుఁ
సరసమృదుసూక్తితోగ్ర
మ్మర సత్రాజిత్తునకును మణినొసగెదగన్ 134

గీ. ఎలమికురుపులఁగనహరి యేగుసమయ
మరసి యకూరకృతవర్మలాప్తులుగను
గూడి శతధన్వుడనువాడు కూరతమణి
గొనగ సత్రాజితునిజంపె కోపముననుం 135

క. జనకునిమృతికిని దుఃఖముఁ
గొనిచని యాసత్యభామ కురువులదరిశౌ
రినిపురిఁ జేర్పగనతడున్
గొని శతధన్వునివధింపగోరెను మదిలోఁ. 136

క. మణినకూ్రిరునియెడనిడి
ఘనభయమున బర్వులిడుచు బారెడునతనిన్
గనిశత యోజనములు హరి
వెనువెంటన్ దరిమివాని విడువకజంపెన్. 137

క. అతని దరి మణినిగానక
నతిఖేదమునొంది యడిగెనకూ్రిరుని దా
నతడిడగమణినిగొని తన
సతికిచ్చెను మరలశౌరి సంతోషముతోన్. 138

—• శ్రీకృష్ణుడు ఇంద్రప్రస్థమునకరుగుట. •—

గీ. ఏగెనర్జునుఁ గనుగొన నెలమిశౌరి
యాహరి ప్రస్థపురమున కతిముదమున
పార్థుడు జనార్దనుని యాయపార్థఖేద
సాదరునిగని పరభాగసక్తుడయ్యె. 139

క. అలకృష్ణార్జును లిర్వురు
గులుకుచు నవగూహనంబు గొనిరక్తులుగా
నలరిరి చిత్రముగాదది
బలుమిత్రత వారియెడల భాసిల్లుటచేన్. 140

వ. తరువాత మరియొకప్పుడు కృష్ణార్జును లిర్వురును దూరీకృత దురితులయ్యును పాపర్ధికాంక్షులయి విగతమోహులయ్యును గహనావగాహనంబొనర్చి వృష్టైకగవేషణానురక్తులయ్యును నానామృగాన్వేషణ పరులై తరువాత పరి

తృప్తులయ్యును తృష్ణాపరీతులయి యమునానదీ సమీపంబున కువెళ్లి విపీతపరజీవనులయ్యును స్వాదూదకంబును పానంబు గావించి యామార్గంబున సంచరించుచున్న వారలందు యొక కమలలోచన నచ్చట నవలోకించిరి—శౌరియాజ్ఞచే నర్జునుం డామెతోనిట్లుపలికెను. 141

వ. ఓకళ్యాణీ నీవొక్కదానవె వనదేవతవలె నీకాననంబున నేమికోరికచే సంచరించుచుంటివి అని యడిగెను. 142

వ. ఆమెయును సవ్యాజంబుగానిట్లు నదుత్తరంబిచ్చెను నీచేత యుక్తముగనే పలుకబడినది సూర్యతనయనగునేనీ వనదేవతనేయగుదు నీక్షేత్రంబునకు మనోహర తరుణాతిలోభనీయంబును నాసన్నపుష్పోద్గమయును నగు మాధవుసమాగమంబును గోరుచున్నదాననై యీవనమధ్యంబునం దిరుగుచున్నదానను. 143

—♦ శ్రీకృష్ణుడు కాళింది మున్నగువారల బెండ్లాడుట. ♦—

క. అనవిని హరికొరకై తగఁ
గనుచుండిన సూర్యపుత్రి కాళిందిగ, నా
మెను నిశ్చయించి హరికిఁ
గొనబుగ విజయుండు దెల్పెకూర్మిదలిర్పన్. 144

క. హరి తనరథమున నామెను
సారదిగనెక్కించి కుంతి సుతులకనుజ్ఞం
దొరనిడి ద్వారకకుంజని
నరుదుగఁబెండ్లాడెనప్పుడామెను విధిగాన్. 145

క. హరి, పితృకులవీర్యంబున
సురుచిరవిందానువింద సోదరియగుచున్
బరగునలమిత్రవిందను
హరియించి విధిని వివాహమయ్యెనపుడు దాన్. 146

వ. అటుపిమ్మట కోసలదేశాధీశ్వరుండగు నగ్నజిత్తు డాత్మజయగు సత్యయను నామెను వృషభసప్తకవిజయలబ్ధను గానెఱింగి పరిణయంబునొందు కోరికతో నాశౌరి కోసలపతి పురంబునొందెను వృషభంబుల జయించెను. ఆమెను పరిణయంబుగూడ నొందెను.

గీ. శౌరి భద్రాత్మగోపతి, సతనువృషుడు
గానెరింగియు వృషసప్తకంబునెట్టు
లీతడు జయించెనంచును నెల్లవార
లాత్మలోనబ్బురమునొంది రపుడుమిగుల. 148

క. శ్రుతకీర్తి సుతనుభద్రను
ధృతిమాద్రిని లక్షణను బరిణయమొందెన్
ధృతలక్షణుడీవిధుడీ
క్షితివికలంకుండు నగుట చిత్రముగాదే. 149

నరకాసురవధ—శ్రీకృష్ణుడు దేవలోకంబునుండి పారిజాతంబుదెచ్చుట.

క. తరువాత నరకనిశిచరు
బరిమార్చి మురారితాను బడసెనలనిశా
చరవరుడార్జించిన యా
నెరవగు పదియారువేలనృపకన్యకలన్. 150

క. ప్రేమను కన్యారాశియు
భామునితో భోగనిరతి బడయనిదయ్యెన్
ధీమతిని విధుడు స్వగృహము
గామదిగని యనుభవించెకడు చిత్రముగాన్. 151

క. ధరకుసుతుని జీవనమున
జరుగు ననర్థంబటంచు జంపెనతని త
త్తరుణులభోగించెనుహరి
కరమబ్రింబైన నరకకథలేదయ్యెన్. 152

వ. అపుడు ప్రేయసీప్రేరణంబున నందనవనజాతంబగు పారిజాతంబును బెల్లగించియుపగతసమరులనందఱం జయించి శౌరి, సత్యభామాగృహారామంబునొందించెను.

క. అందమగు పారిజాతము
నందమునతికెసఁగ నందనందనుడెలమిన్
నందనమునుండి తెచ్చియు
నందనమొందించె ప్రియకు నయమలరారన్. 154

గీ. కలిత దివ్యశిలీముఖగణముపారి
జాతహారుహారివెన్నాడి చనుచునాప్త
గంధమై సుమనస్తతికడఁ జనెమతి
భాసిలుటయెట్లు మధుహరాప్రాప్తినద్ది, 155

గీ. అరయ జగదాదృతసపల్లవాప్తిముదము
తనరు హరిచేత పారిజాతముననైన
నువిదచే జగపతియు నియుక్తుడయ్యె
సరసతత్సుమనః పరీక్షణముకొఱకు 156

ఉ. శ్రీగిరిజాకృపారస ఝరీశుభసౌరభ వత్కటాక్ష శో
భాగురువీక్షణంబు లలభాసుర కల్పలతాసుమావళుల్
గాగొని సత్కవీంద్రుడనగాదగు శ్రీనవకాళిదాసుబల్
బాగుగ దారచించెనటఁ బండితమానస సద్విలాసమౌ
భాగవతాఖ్యచంపువునఁ బ్రౌఢిచతుర్థవిలాసమొప్పెడున్.157

చ. శివగిరిజాదయారసవిశేష పరీతకటాక్షవీక్షణో
ద్భవతతసాహితీసుకవితారస భాసుర సుందరాఖ్యస
త్కవికృతమౌ ససౌరభ సుధారసధారలుమీరునాంధ్రభా
గవతపు చంపునన్ వినుతిగాంచుచతుర్థవిలాసమొప్పెడున్.

గద్య

ఇది

శ్రీమన్మహారాజ రాజేశ్వరీ కరుణాకటాక్ష వీక్షాలహరీ పరీత
సంగీత సాహిత్య సరసకవితాచాతురీధురీణ లౌకికవిద్యా
విశేష ప్రవీణ స[illegible]వోలు కులకలశ జలధి కువలయమిత్ర
భారద్వాజసగోత్ర భగవత్కవివంశ పవిత్ర సోమరాజా
మాత్య పౌత్ర వెంకటరాయమంత్రి వరపుత్ర
రామాంబాగర్భశుక్తిముక్తాఫలోదయ సకల
సుకవి విద్వజ్జనవిధేయ సోమసుందరకవి
నామధేయ ప్రణీతంబైన శ్రీమ
దాంధ్ర చంపూభాగవతమునందు
చతుర్థవిలాసము
సంపూర్ణము.

శుభమస్తు.    శ్రీరస్తు.    అవిఘ్నమస్తు.

శ్రీ శాంకరీదేవ్యైనమః

# శ్రీమదాంధ్ర చంపూభాగవతము.

## పంచమవిలాసము.

శ్రీకృష్ణుడు కేళీగృహంబున రుక్మిణితో విరసోక్తులాడుట.

క. హారికారమణులతోఁ దగ
నరయగ సురతాపవర్గహారి విహారం
బరిదిగనిటు వనమాలి ద
నర మోదంబు సుమనోగణంబపుడొందెన్. 1

వ. తరువాత మఱియొకప్పుడు సకల మహోత్సవమహనీయంబునం, గగనంబునుం బోలె చంద్రికాంతాలంకృతంబును రజనీకర హృదయంబుభాతి బుష్య రాగాశ్రితంబును సత్యలోకంబు చందంబున ముక్తౌఘ సంకులంబును కమలాకరంబుకరణి పద్మరాగశోభితంబును కేసరామోదితంబును పాకశాసనునికైవడి వజ్రరమణీయంబును వాసంతిక వనంబుపగిది

పరివాళసమృద్ధంబైనదియు శరత్కాలగగనంబుమాడ్కిసితా భ్రభాసురంబును హంసమండితంబును నందనవనంబు చందం బున నాపన్నపారిజాతంబును హరిచందనామోద వాసితంబు ను గోష్ఠంబులీల భద్రరసాస్పదంబును గోపాలవాసయోగ్యం బును స్వర్గంబురీతి సుమనస్సంకీర్ణంబును సురతాధిగమయో గ్యంబును కైలాసంబుభాతి సదాశివైక నిలయంబును నీలలో హిత స్పృహణీయ రత్నాస్పదంబైనదియు శరత్కాలపులినం బువడువున హింమవాలుకాలంకృతంబును శార్దూలంబును బోలె మృగమదామోదహారిణియును మయూర మేచకంబుపరికారంబున నుపబ్వర్హభాసురంబును చంద్ర మండలంబుకైవడి నాదర్శలేఖానువృత్తంబైనదియు భాగ వతంబులీల శుకాలాపరమణీయంబును బౌద్ధదర్శనంబుపోల్కి సాధుదూష్యంబైనదియు పాండుసంతతిపగిది పాంచాలికార మణీయంబును కల్పపాదపంబు తెఱంగున రమణీయచిత్రఫల కంబును మేరుశృంగంబుభంగి కళ్యాణనిలయంబును సురతసమ యంబుచాడ్పున కపోతకూజిత రుచిరంబైనదియు పుష్పకంబు భాతి విష్ణుపదసంచారయోగ్యంబును బలిభవనంబునిభంబున ననంతభోగాస్పదంబును మేరుకందరంబు చందంబున భల్లూక బాలాలంకృతంబును హరిశ్చంద్ర చరితంబు వడువున సత్యాన పాయిని యైనదియు రామచరితంబునట్లె లక్ష్మణానపేతంబును మహారాజకులంబుగతి భద్రాసనయోగ్యంబును గంగాప్రవా

హంబు చందంబున కాళిందీమిశ్రితం బైనదియు న్యాయదర్శ
నంబుభాతి జాతిమాలానపేతంబును చైత్రరథంబు విధంబున
మనుష్యధర్మాశ్రిత లోకపాలవిహారయోగ్యంబును ప్రాగ్వం
శంబు పగిది నిష్టగంధసంపన్నం బైనదియు సత్కావ్యంబు చం
దంబునసుత్తమశ్లోకగర్భంబును స్వయంవరస్థలంబువలె జగతీ
పతిసమాశ్రితభూరిమంచాంచితంబును సుగ్రీవసైన్యంబుకై వడి
కుముదామోదితంబును హిమగిరి కందరంబువిధంబునపుండరీక
కమాలాలంకృతం బైనదియు నిందిరామందిరంబు చందంబునస
దాళిగీతాదృత కమలానుషక్తం బైనదియు నగు నొక దివ్యభవ
నంబున, పర్యంకంబు నధిష్ఠించియున్నట్టియు, సత్ప్రబంధంబు
విధంబునవిదర్భసుదృక్ఛాతిరీతిబద్ధాదరుండును సారసంబుతీరున
లక్ష్మణాలాపలోలుండును ధర్మాత్మజునికై వడి సత్యోల్లంఘన
భీరుండును. భార్గవుని వడువున రవితనయానురాగియు ఋక్ష
రాజసుతానురాగియు సిద్ధరసంబుకైవడి ప్రద్యుమ్నజనకుండు
ను నారామంబుపోల్కె భద్రాగమసంవర్ధితామోదంబు గల
వాడును బ్రహ్మలోకంబువలె ప్రసన్నమానసుండును దుర్యోధ
నుని తెఱంగున మిత్రవిందానురక్తుండును మందహాసముఖార
విందంబుగలవాడును నగు ముకుందునారాధించుటకు సంతో
షాంతరంగయై భగవతియగు భీష్మకతనయ సన్నిధికివచ్చి
నిలచెను.

ఉ. అంతటిలోవ భీష్మతనయాంచిమా ననురాగసంపదన్
వింతగ నాత్మలోననిడి వేపరిహాసకథాప్రధానుడై
సంతతజీవితేశుని దిశావశయై తగునట్టిభీరువున్
చెంతను నుగ్రశబ్దములశ్రీహరికంపమునొందఁజేసెదాన్. 3

వ. అటులనేకదా! ఓబాలామణీ! విదర్భరాజపుత్రీ! నీవిట్లుగా నాసన్నజీవితేశపదంబునొంది పుణ్యజనాగ్రగణ్యత వహించి యతి మృదుహృదయుండగుటచే భీరుజనానురక్తుండై ఖద్యోతాతిశాయితేజస్కుండై సంపదయందు కిన్నరేశుండై శాంతనవకీర్తిగలిగి నీసహజప్రేమ పాత్రుండై గురుస్పృహా విషయతగలిగి మదుపసర్పణావసరంబున మిగుల నభీకవగునీచే నవలోకింపబడినవాడును గనుకనే, యసుసదృశుండును ననంగైక తులనీయరూపుండునునై యసుకుమార ప్రభావతగల మాచేతనుగూడ ననాక్రమణీయుండై నాపైని నిశ్చితాసు హృద్భావంబుగలిగి యంతర్గతధనుర్వేదనిపుణత్వంబు నహించి పరాశుపీడనప్రవీణుండై తనకు నిరపాయతాణంబుకొఱకా శ్రయింపబడిన భూభృదంతరంబుగలవాడై విశేషంబుగా మాగధభావానువర్తియై యర్జునగుణంబునకుంగూడ మాలిన్యసంపాదికయగు నన్యకీర్తినార్జించుచు నాశ్రయాశతేజస్కుండై నిజప్రతాపంబున బాకశాసనునందుగూడ నశక్తిని వ్యక్తీకరించుచు నిగీర్ణపరపక్షరాజమండలత్వంబుచేత దర్శానుకారియై బలాత్కారంబుగా ధాత్రినాక్రమించి యుపభోగించుచు

పురుషర్షభుండై యుండునట్టి శిశుపాలుని విడనాడి, దోషాకర కులసంభవుండనై యసత్ప్రకృతికాశ్రయుండనై యెయ్యెడలను బరాక్రమావిషయుండనై బలివిరోధంబున సంకుచితాత్మ వృత్తిభావంబుగలవాడనై భూతలంబున పరోత్కర్షంబుగాంచి యిపుడు విశేషంబుగా క్షమనాశ్రయించి యక్షమవిషయంబున శాసనకామంబుగలవాడనై యభద్రాసనయోగ్యుండనై యనతిదుర్లభరూపంబుగలిగి పరానక్తహృదయవైనను దైవాధీనవగు నీచేతంబొందబడినవాడనై యత్యున్నతబలానువర్తనంబున కాలంబుగడుపుచు భుజంగభోగంబులందాసక్తుండనై సర్వదార్జునవాహినీశు, ననువర్తించుచు నగణితరిపుభయంబువలననిపుడు పగవాహినీశు శరణంబుగోరినవాడనై యజాతరూపసంపన్నుండనై హరిపూజానివారణంబుచేతను గోత్రోత్పాటనంబుచేతను గువలయాపీడనాశంబుచేతను సధేనుశకటంబువలన గలుగు స్వలాభంబుచేతను పరసుదృగ్భాగ్యతచేతను నతిరిక్తకీర్తిగలవాడనై యనంగలేశుండనై యదూరదర్శనుండనైయుండు నన్నుబెండ్లియాడితివిగదా. 4

గీ. రాజపుత్రిక! నీవనురక్తవౌరయ
నిష్టవరలాభమొందుమీయిపుడువేట్క
నందుచేనీకు వరలోకహానిలేదు
విమలమతిదీనికైమది వెరువవలదు. 5

వ. ఇవ్విధంబున నెన్నండును గని, విని, యెఱుంగని, విప్రియాభాసభాషణంబులు వాసుదేవుండు బల్కుచున్నసమయంబుననామె యశనిహతయగు లతగతి దవదహనపరీతయగు హరిణికరణి దశవదనకరగతయగు సీతభాతి దృష్టాపరాధగౌతమకాతరయగు నహల్యాసుందరి చందంబున దూర్వాసక్రోధ విషయీకృత యగు శకుంతలవలె సంజ్ఞావిరహితయైపుడమిపయింబడియెను. 6

గీ. గణనసేయనసామాన్య గుణయునట్టి
గతియదృచ్ఛానుశబ్దసంతతిదలంప
నటసుదృగ్మణికపుడు క్రియకనుసంజ్ఞ
కొఱుకఁగాదయ్యె నాశ్చర్యసరణికయ్యె. 7

చ. సతికటు విప్రియంబౌనరసల్పుటఁ దాపము శౌరిబొందగా
నతివకు జూడనప్డు సకలావయవంబులస్వేద మొప్పెనం
చితదయితాపరాధమున చిత్తము శౌరికి వ్రక్కలైనచో
సతిహృదినస్రధారలు వెసంబ్రవహించెను చిత్రరీతిగాన్ 8

—• రుక్మిణి శ్రీకృష్ణలాలితయై యతనిస్తుతించుట. •—

వ. పిమ్మట నబ్భగవంతుండును శతవిధంబుల . శకలితహృదయుండైశయ్యనుండిడిగి పరిహాసకౌశలంబునెఱుంగని యాప్రాణప్రియను దొడపై నిడుకొని యమృతమధురంబులగుమాటలచే నూరడించి మరల మరల కౌఁగలించుచు గండస్థలంబులందు ముద్దుగొని యిట్లనివచించెను. 9

చ. కనుగొననాదుప్రాణములకన్నఁగడున్ప్రియురాలవై తపం
బుననయినన్ లభింపకసుమూర్తినిబూనుపతివ్రతాత్మమా
నినునలకించురాయివలెనే కడుగుందఁగఁజేయు పాపినా
ననుఁగుచశైల పాతనమునన్ దగుశిక్షవిధింపుబాలికా. 10

క. వడినిటులాశ్వాసింపం
బడిమరలఁ బ్రసన్నవదనపంకజయై య
ప్పుడు శ్లిష్టవచనతత్త్వము
గడకనుగ్రహించి భీష్మకన్యకబలికెన్. 11

గీ. నెరతనంబునఁజక్రివాసి నిగూఢ
వచనవిన్యాసమిట్టెడ ప్రౌఢిమీరఁ
గానజింహ్వాగతినిగొను నేనెరుంగ
దగుటయెట్లగునిది విచిత్రంబుగాదె. 12

క. పురుషాధమతనుఁజైద్యుని
దరినటుసర్వాతిశాయితనునీయెడలన్
బరగునలనీదువాక్కుల
బరతత్వంబెరిగి సుఖముఁబడసితినేనున్. 13

గీ. తనపరప్రేమ కపటాయమొనరజేయ
దగువరాసక్తినెరుపగాదగునటంచు
ప్రింతమందువఁ బల్కితివటులదాని
నిపుడునేగోరుచుంటినిహితవుమీఱ 14

వ. ఈలీల ప్రాణవల్లభయగు రుక్మిణి వల్కుచున్న
యెడల. 15

క. వెలయగవిదర్భభూపసు
వలదిష్టాయోగశంకఁబడ మాధవునన్
గలితతదయోగభయమున
నలరకుశంకామమార్గయుదఁనగఁజేసెన్. 15

—♦ అనిరుద్ధవివాహాదికము. ♦—

క. తరువాత నల్లసతులకు
నరయుగ ప్రత్యేకదశ దశాత్మజులలరన్
ధరవారి పుత్రపౌత్రులు
వరసంఖ్యావంతులైరి బహుజనులయ్యున్. 16

క. ఆరయ బ్రద్యుమ్నుడు దా
వారకరుక్మిసుత రుక్మవతికరముగొనెన్
భూరితరకాంతిఁ దగునత
డూరకెటు మనోజుభ్రాంతినొందడుదానన్. 17

క. అనిరుద్ధుడామెయందున
జనియించె సదానిరుద్ధ చణవిక్రముడై
ఘనరోచనయగు రోచన
జనియించెను రుక్మిపౌత్రిసంతసమెసగన్. 18

వ. పిమ్మట ననిరుద్ధ వివాహమహోత్సవవిలోకనసంబు

కొరకు బలరామకృష్ణులిర్వురును రుక్మిణీదేవితోఁగూడ రుక్మి నగరంబగు భోజకటకంబునకుం జనిరి.

వ. అచట కరగ్రహణమహోత్సవంబు సమాప్తినొంది యున్న సమయంబున. 19

గీ. ఘనుడు జయరాముడితడ నక్షజ్ఞుడనుచు
రమ్యకాళింగుడతని బేరిరణమొనర్ప
నక్షములతోడనాడె భీష్మాత్మజుండు
నతనిదగు పాశ్రణములతోడనాడెయముడు. 20

క. మునురామదాసు డగుకపి
కినినక్షజయంబుగలిగె కీర్తింపగరా
మునకే యీయెడనహహా!
కనఁ దదపజయంబుగలిగెఁ గడునబ్రిముగాఁ. 21

వ. పిమ్మట మరలనధిగత విజయుండయ్యును గతవిజయుండగు బలదేవునిఁగాంచి కాళింగునితోఁగూడ నీకగోపాలకుల కక్షకౌశలంబెక్కడదని రుక్మి బరిహసింప బలరాముడు రోషంబున బయలుదేరి పరిఘుదాల్చి కాళింగునింబట్టి పండ్లూడగొట్టి రుక్మిని, శమనభవనంబునొందించెను. 22

క. ఘనుడగు ననిరుద్ధుని రో
చనునిన్ రథమందునిల్పి శౌరియపుడుదా
ననుచరులగూడి వెడలెను
దనపురికిఁ దగుమనోరథంబలరారఁ. 23

వ. పూర్వకాలంబునం దాండవంబుచే నారాధింపబడి న ఖండపరశునిచే నొసంగబడిన బాహుసహస్రంబులుగలబలి తనయుండగు బాణాసురుండు స్వసంరంభలక్ష్య భూతుండగు ప్రతిపక్షునింగానక ప్రమథనాథునిట్లు ప్రార్థించెను.

వ. ఓ భగవంతుండగు పరమేశ్వరా! యప్రతిహతుండ నగు నాకీభుజసహస్రంబు భారంబున కేయగుచున్నది! గాన నేనీ తోడంగూడ జోరొనరింపఁగోరుచున్నాడను. 25

వ. కర్ణకఠోరంబులగునట్టి మాటలువిని మిగులఁగోపించి యావృషభకేతనుండగు నీశ్వరుండు, నీకేతనభంగసమయంబున నాతో సదృశుండగు నొక్కరుండు నిన్ను నిగ్రహించుటకుద్భవించునని దెలిపియంతర్ధానంబునొందెను. పిమ్మటను.

గీ. స్వప్నమున బాణసుత యుషాసతిఁ రమించె
క్రియననుభూతపూర్వుడైన యనిరుద్ధు
డాత్మసుఖలాభమగుటచే నట్టిస్వప్న
మామెకానందమయకోశమయ్యెనపుడు. 27

క. ననువిడిచినాథ! యెచటికి
జనెదనుచును దెల్విగొనె విచారమునన్ దె
ల్విని సుఖమగునని యలశ్రుతు
లననీమెకు దుఃఖమునకెయగు దెల్వియహా!

వ. అపుడిట్లు స్వప్నంబునుండి మేలుకాంచినయామెను జూచి బాణాసురుని మంత్రియైన కుభాండకుని పుత్రికయగు

చిత్రలేఖ యనునది సమీపంబున శయనించియున్న దిగావున నదివిని లేచి నీకు వల్లభుండెవండు మెవనినిట్లు వెతుకుచుంటి వని యడిగెను. ఆమె యిటులమారుపలికెను. 29

చ. జనయషునెట్టివాని వినునంతనెమోహముగాంతురోసుదృ
గ్జనులన జూచితీరవలెగాని వచింప దరంబె యాతనిన్
ననుసుఖవార్ధిముంచుచుగనంబడె చేతికిచిక్కినట్టు లా
వెనుక గురుప్రభావుడయివింతగమాయమునొందెసుందరీ.

వ. అట్లయిననుం జెప్పెదవినుము.

క. ఘనపీతవాసుడును గుణ
గణవాసుడు శ్యామలుండు కంజాక్షుండున్
తన మధురాధరమును వే
ట్కను గ్రోలగనిచ్చి యంతగనబడకేగెన్. 31

వ. అదివిని చిత్రలేఖనకుశలయగు నాచిత్రలేఖ నర సురాసుర గంధర్వ కిన్నర విద్యాధరలందు సౌందర్యముచే బెం పొందు పురుషుల నెల్లర చిత్రపటంబున లిఖించి నీకిందెవ్వడ భిమతుండని యడుగునెడల నామెయును గడునంతసించి యీ తండే యగునని యాపటంబునందలి ప్రద్యుమ్న కుమారుం డగు ననిరుద్ధుంజూపించెను. 32

క. వరచిత్రలేఖ! నీచే
దరయగ నన్వర్థమయ్యెనని మోదముతో
బరగెయు ముగ్ధమరలపతి
చరణము వ్రాయుటను నీర్ష చాలగగొనియెన్. 33

క. గురుకృత్యయామె యటువే
సరి ద్వారవతీపురంబు జనియునునిశనా
తరి రక్తుని ననిరుద్ధుని
మురియుచు శోణితపురంబు బొందించెదగన్. 34

క. అలచిత్రరేఖ దెచ్చిన
వలపిడుననిరుద్ధుగూడి ప్రాణసమునిగా
దలచి యుషాకన్యక క్రీ
డలు సలిపెను నరులకగపడనిచోటులలోన్. 35

వ. పిమ్మట మరికొన్ని దినంబుల కంతఃపురజనంబుచేత దత్సంకేతస్థానంబెట్టకేలకు దెలియబడినదై యుండునపుడు. 36

గీ. కన్యలు శుభగ్రహాఢ్యమై గానబడిన
వారలప్పుడసత్క్రియాపాత్రతగని
యపు డగల్గిన దుస్సమయంబు దెల్ప
దవిలిగోపించె దోషజ్ఞతను ప్రభుండు. 37

క. తనకన్యాకాముని దై
దనరు కరగ్రహముకొరకు తద్దయురతుడై
తనకింకరులననేకుల
బనిచెనుపయమమున కజ్ఞబాణుండంతన్. 38

వ. తనచే బంపబడిన భృత్యజనంబులెల్ల నిహతులై యుండ నంత నితాంతరోషణుండై, బాణుండు కన్యకాంత.

పురగతుండగు నయ్యనిరుద్ధునింబట్టి భుజంగ పాశంబులంగట్టి హాహాయని మిగుల విలపించెడు నుషాకన్యనుగూడ గణింపక యొక కారాగారంబునంబడవైచెను. 39

—• భా ణా సు రు ని యు ద్ధ ము •—

వ. పిమ్మట నారదవచనంబువలన యావద్వృత్తాంతంబు నెరింగి ప్రద్యుమ్న సాంబపురస్సరులై యాదవులందరునుబలరామ కేశవులం దోట్కొని సేనాపరికరసమేతంబుగా యుద్ధసన్నద్ధులై బాణనగరంబగుశోణితపురంబుప్రాకారంబునరికట్టిరి.

వ. అటులనే భగవంతుండగువృషకేతనుండును కింకరకరుణాపరవశుండై సానందంబుగా నందివాహనంబు నధిష్ఠించి షణ్ముఖునితోడను పరిపంధి ప్రమథనులగు ప్రమథులతోడ నుగూడి తత్ప్రదేశంబునకేగెను. 41

ఉ. ఆరయనచ్చటన్ దగుమురారి పురారి భటాళికయ్యెగం
భీరరణంబు భారతియు భీతిలి దానిని దెల్పజాలదా.
సూరుడు నాత్మఘాత భయశోషితుడౌచువిలీనుడయ్యెదా
వారక ఛాయయున్మిషను భాసురనందక మందుశోణితా
పూరితమాట నానగరపున్వరనామము సార్థతన్దగెన్ 42

సీ. అలపాండుకీర్త్యావహావిజయగరిమమి
ర్వ్వరకుస్వాధీనమై వరలుచుండ
నుహాసీయ గజదైత్య మర్దనరసముని
ర్వ్వరకు సామాన్యమై బరగుచుండ.

ఘనసత్కలాపినాకగ్రహంబెన్నని
　　　　ర్వరకు తుల్యంబుగా మెరయుచుండ
క్రూరతరఖలాంతకారి చరిత్ర మి
　　　　ర్వరకుసాదృశ్యమై గరలుచుండ
గీ. పశుపతిత్వము సమమౌచు బరగుచుండ
మిగులదుర్ధర్షతనుగాంచు మేనకాత్మ
జానిశప్రపుత్రునింగాంచి సంతతంబు
నందిలంఘించె రణమున హరియతండు. 43

మ. అరయన్ స్కంధుని యందుశక్తిదగెబ్రత్యక్షంబుగానట్టిద
త్తరిపద్యుమ్నునియందు లేదతడొగిన్ దాల్చెన్ మహాసేనతన్
ధరనీతండు బలాల్పతగానియెనాతండొందెపృష్టంబునన్
దరి మీరంగను నీలకంఠధృతి యీతండన్యఖేలద్బలో
త్కరుడున్ గాడటులైన షణ్ముఖుని నీతండేజయించెన్ భళీ

మ. కరమన్యోన్యన దృక్షలక్ష్యమున వేట్కన్ యుద్ధసంబద్ధులై
యురుబాహుద్వయజాతకండువునెట్లో వీడిరయ్యిర్వురున్
గరిమన్ తదగ్రిణ వర్ణనాకలనచే కావ్యామృతోత్పాదియౌ
గురువిద్వత్తతి నాల్కపై దురదబోకుండెన్ గదానేటికిన్ 45

వ. ఈవిధంబున గదాధరునకు పశుపతితోడను షారికి
శోరమున కజాత్మజునితోడను ముసలికికుభాండకుని తోడను
కృతవర్మకును బాణునితోడను గొప్పయుద్ధంబు గలిగియుండకృ
ష్ణునకు విజయపరిణయిత వ్యక్తమైయుండునపుడు బాణునితల్లి

యా కోటర, యనునామె తనయరక్షణకొరకు గేశవునిశరణు నొంది బాణుని మరణంబునుండి విడిపింప నతండు నిజనగరంబు నొందుసమయంబున. 46

క. వరమాహేశ్వరు జ్వరమును
బరిమార్పగ శౌరిఁబనిచె వైష్ణవుజ్వరమున్
గురుతరసమరంబయ్యెను
బరువడి యారెంటికపుడు పటుగతి వెలయన్. 47

వ. తరువాత వైష్ణవజ్వరంబువలనం దిరస్కరింపబడి మాహేశ్వరజ్వరంబు మధురిపుని శరణునొంది యిట్లు సన్నుతించెను. 48

—• శివుండు బాణుని రక్షింప శ్రీకృష్ణుని నుతించుట. •—

సీ. నీకిష్టతమయామ నెగడు ప్రకృతినైజ
గుణములచేతబల్ క్రూరయామ
బాధించి జనులను బాధించునీవును
వారిధనంబులవారిగొనుచు
గుణబంధమునుబాపి గూఢమానసమృతాఖ్య
దుర్గమంబగుచోట దోఁచివైతు
భళిర నీదగుకృపాపారంబునెంతయు
నరయంగమాకిప్డు తరముగాదు
గీ. మీరలిర్వురు నొకరీతి మెలగుచున్న
నరయ నంతయు నీమాయ ననతియనుచు

నిన్ను సద్గురునిగ బుధు లెన్నుచుందు
రౌర జగమున నిదియెంతొ యబ్బురంబు. 4.

సీ. అరయంగ నొకపురియందె నిచ్చలు భక్తి
కాంక్షనై దినకరు గాంచుచుండ
స్వేచ్ఛమీర జుగుప్స జెందకయే స్వాదు
గా భుజించును వీడు గరిమనాత్మ
విదుడుగాడని చాల మదిలోన నెంతయు
తదపరాధంబును దాల్చి పిదప
శ్రీనుడీతండని జెన్నుగా గ్రహియించి
వరములిదరి జేరు పాపరహితు

గీ. డైన జీవుని గైకొని వానికైన
నామమును రూపమును గూడ నాశనముగ
జేయుచుందువు గదనీవు జెన్నుమీర
నట్టి నీయెడ దయ యెట్లు గలిగె భళిర. 50

సీ. అనుమానందనించుకైనను గానరాని ద
నుత్తమంబయి యొప్పుచుండునట్టి
సూర్యచంద్రాగ్నులు జొరరాని మత్పద
మందు బొందగదగునదియు లేదు
కనుగొన నిహసౌఖ్యకాములకని తెల్పి
యరయ నీవొకడవె యానుఖంబు
ననుభవించుచునుంటి వనిశంబు నీరహ
స్యంబు నుగన్న పుణ్యాత్ము ...చ

గీ. యట్టి పదమునజేర్చెవ వాదరమున
మరలనాధన్యు విడువవు మరచియైన
నిట్లు రహిమీరు చాతుర్యమెట్లునీకు
గలిగి విలసిల్లుచుండెనో తెలియరాదు. 51

సీ. ముగ్ధత కనఁరూపముగనుత్తరోత్తర
గురుతనొందియు నల్పతరములైన
వవియొసంగుచు మర్త్యదివిజాధిపముఖుల
వంచించి నీవు బల్ బలిమిమీర
నానందకోశంబు నపహరించెదవప్పు
డదిగోరువారలకాశదొలగ
నేనించుకైనను నెరపువాడనఁగాను
భోగవైధుర్యంబు బొందువాడ

గీ. సంగరహితుండనగుచు నెసంగుచుందు
బొల్పుమీరిన మద్పదంబునను నేను
దక్కనించుకమరిలేదు నిక్కమనుచు
నొప్పుగానిజకృశతను జెప్పెదార. 52

సీ. ఖరతరంబగువహ్నికన్నను ఛండతన్
బరగుచుండెడునుష్ణకరునికన్న
పూర్ణవడానలవిషపూరంబుకన్నను
పటుసర్వలుంఠనపదముకన్న
పరమునిర్భయమునై బరగునావాసంబు
నాశ్రయించిన వాడవగుచు ధన్యు

సర్వస్వమును తమస్సంచయంబగుతరి
హరియించుచుండెదవది దలంప

గీ. సద్భుతముగాదు దగుబోధమతడు జెంది
యట్టి ధనమునకై దుఃఖమందడపుడు
ధనముతోగూడ ఖేదంబు దగహరింతు
వట్టి నీచౌర్యచాతుర్యమద్భుతంబు. 53

వ. ఇట్లు వినుతించి యభయంబునొంది మాహేశ్వర జ్వరంబు మరలునెడల బాణుండు మరల సమరవాంఛచే మాధవునెదుర్కొనునెడలనంత. 54

గీ. సకలదోషాపహృతిసల్పి చక్రియపుడు
బాణునిచతుర్భుజుని జేసె వాడునటుల
నియ్యను భవానువర్తియై యలరుచుంట
ఘనవిశోకత యయ్యెడ గల్గదయ్యె. 55

వ. పిమ్మటను భుజచతుష్టయంబుతో విశిష్టుండగుబాణునికొరకై క్షోభనొందిన శంభునోదార్చి ప్రద్యుమ్నసుతుండగు ననిరుద్ధుని యుషాకన్యకను దనరథంబునందిడుకొనియదునందనుండు సానందంబుగా దన నగరంబునకేగెను. 5

గీ. అటుపిదప శాపవశతకృశానుభావ
మొందుచు నృగుండు తొండయైయుండనతని
హరియె శాపవిమోచనన్ మరలనృగుని
జేసి దేవగు నొనరించె చిత్రముగను. 57

— కృష్ణుడు పౌండ్రకవాసుదేవుని సంహరించుట. —

వ. తరువాత మఱియొకప్పుడు పౌండ్రకనామధేయుం డగు కరూశాధిపతి తనయాత్మను పరమాత్మునిగా నెంచుకొను చున్నవాఁడై యొకసందేశహరుని హరిదరికంపించెను. 58

వ. ఆసందేశహారకుండును హరిసన్నిధి నొంది సందేశం బు నిట్లు విన్నవించెను. 59

గీ. పుడమిరక్షింప వాసుదేవుండ నాచు
నేఁజనింపఁగ నసముండవీ వెవండ
వవ! శరణొందు లేనిచో ననికిరమ్ము
మాయవేషంబు గొనఁ నీకు మంచిగాదు. 60

వ. ఈవిధంబులగు కర్ణపరుషంబులగు మాటలువిని తక్షణంబ రథంబునధిష్ఠించి యదునందనుండు సపరివారంబుగాఁ గాశీనగరంబున కేఁగి పార్ష్ణిగ్రాహుని కాశీరాజుతోఁగూడ పౌండ్రకునిం గృతాంతనికాంతంబున కతిథినిగావించి పంచిశరల నిజభవనంబునకు వచ్చెను. 61

వ. తరువాత కాశీరాజతనూజుండగు సుదక్షిణుండను వాఁడు తన కంటికి కుత్తరక్రియాదికంబులుగావించి పితృవధచే తన్నైన శత్రుత్వంబుసాధించుటకై పురోహితునిగూడముందు గాచాకిది యహితంబని సత్వరంబుగా మధుసూదనుంగూర్చి యభిచారహోమంబు గావించెను. అపుడయ్యభిచారికానలం బు భయంకరంబగు పురుషవేషంబుతో శీఘ్రంబుగా ద్వార

కానగరంబునొంది యచ్చట వాసుదేవ ప్రచోదితంబగు సుదర్శనంబుచే,బీడింపబడి మరలివచ్చి యాజకునయ్యజమానుండగు సుదక్షిణుంగూడ భక్షించివైచెను. 62

గీ. అపుడలసుదక్షిణేష్టిజమైన వహ్ని
చక్రిభయవారణమున కెసంగదయ్యె
హరివిముఖుడౌచు నున్నచోనట్టి యిష్టి
శ్రుతివిధినొనర్చినను నెట్లు సఫలయగును. 63

గీ. వరవృషాకపివైరియై వరలునట్టి
దక్షయజమానుడొనరించు తరినియిష్టి
నష్టగుణరహాట నెంతయు నయశుభహిత
ములనిడునె సర్వమంగళామోదమగుచు. 64

గీ. పరగుచుండు గుణాల్పతబడయునష్ట
తంతుజాలంబుచేతను దవిలిహరిని
బద్ధునిగసేయబూనిన బాలిశుండు
త్వరగనసుదక్షిణుండౌచు దనరెనహహ. 65

వ. తరువాత సుగ్రీవమిత్రుండును మైందసోదరుండునునగు ద్వివిదుండను వానరుండుఁ గృతపాతకివలె నరకప్రణయియు చక్రివాకంబుపగిది మిత్రవిపత్తిపరితృప్తుండును నై మిత్రుసిఋణంబుదీర్చుకొనుటకు నత్యంతంబు నానర్తవిషయకదనంబు నాపాదించుచు నొకప్పుడు మదిరాస్వాదనంబున మేదురీకృతకుదుండగు బలదేవుని లలితగీతంబు నాలకించి రైవతకునిం బొందెను. 66

గీ. ధన్యనీలాంబరుని, చలత్తారకలగు
రామలవృతు, నమందకరప్రచారు
సాధుతరగీతు రేవతీనాధుగాంచి
బాలహరి యాక్రమింపగాఁబర్వులెత్తె. 67

క. కిలకిలరావంబులతో
బలువికృతులనిర్మలముగ బరవుచుఁగపియా
లలిశృంగారరసాంచిత
జలజాక్షుల బరిహసించె చంచలవృత్తిన్. 68

వ. అట్టి వానరుండు సకలాగమాగ్ర లక్ష్యత్వఁబుచే
తను హరిపరాభిధేయత్వంబుచేతను పూర్వకాలంబునందగు
సుగ్రీవమైత్రికి బాత్రతగలుగుటచేతను వనవాన రసికత్వంబు
చేతను రామసామ్యంబుగలిగియున్నను దా నచ్యుతాగ్రజుండ
గుటచేత శత్రువులనుగూర్చి యసహాయశూరత్వంబు గలిగి
బర్వులిడుచు నచ్యుతాగ్రజుండగు నీ బలదేవునితనకన్నతక్కు
వవానిగా దలంచుచున్నవానివలె నిశ్శంకగా ఘాతసేయుటకు
నతనియెదుట కుపసర్పించెను. 69

వ. ఆబలరాముండును నవ్వానరుని బూర్వంబున ప్రి
ధూనయన సాహాయ్యకారియు నిపుడుగూడప్రియానయనాను
కూలవ్యాపారంబులచేత నుపకారియునైనను వారుణీమదంబు
వలనలక్ష్యంబుసేయక యే వివిధాయోధనంబుగావించి వానిని
శమనభవనంబునొందించెను—అటుతరువాత .. 70

క. ఘనధర్మరాజసుత ల
క్ష్మణయను కన్యకను బలిమిమెయి జాంబవతీ
తనయుండు సాంబుండొక్కఁడె
దనరు స్వయంవరము నందదగహరియించెన్. 71

వ. అపుడా కౌరవులందరును సుతాపహారియగువానిచే వృద్ధినొందింపబడిన పరితాపంబు గలవారలయి యాతనింగ్ర హించుటకు నిచ్ఛగలవారలగుటచే వెళ్లియును నచ్చట గ్రోధ యుక్తులగు కృపణులవలె మార్గణవ్యథితులై యతికష్టంబుగా విరథుండగు నతనింగట్టి స్వనగరంబునొందించిరి. 72

వ. పిమ్మట నారదవచనంబుచే విదితోదంతంబుగల వారలును సమర్థప్రకర్షంబుచే రూషితులగువారును నగు సమ స్తవార్ష్ణేయుల నుపలాలించుచు బలదేవుండు స్వయంబుగా హ స్తినాపురంబునకేగి దన్నెదుర్కొనిన సుయోధనాదుల ననా మయప్రశ్నపూర్వకంబుగా నిట్లువలికెను. 73

చ. మహితనృపాలమౌళిమణిమండితపాదసరోరుహుండుదా
రహిగొను నుగ్రసేనుడు గరంబిటులన్ వచియించె నెట్లనన్
స్పృహానబలావశత్వమును జెందినయాహరి సత్కిశోరు,దు
స్సహానముచేత భర్జనము సల్పుటకెంతయు సార్వభౌమన
న్నిహితమదాభివృద్ధిగొనునీకిదియుక్తమెయంచునెంతయున్ 74

వ. కర్ణపరుషంబులగునట్టి మాటలువిని యాయంధక వృష్ణినాయకుని శాసనం బతిక్రమింపదగనిదా, విశేషించియు

తంపు వృద్ధుండుగదా! యని పరివాదజల్పితంబులతో సమం
బుగ నమర్షజ్వలితహృదయులై బలదేవుని బురస్కరించుకొన
కయే యాకురువీరులందరును మరలిపోవునవసరంబున. 75

చ. వేడుకమీరగా భువనభుత్కృతి సచ్ఛపలాంతరంగుడై
వీడక గర్జఁజేసి పృథివిం దగనిర్గత ధార్తరాష్ట్రగా
పాడొనరింపనెంచె బహుభంగుల నయ్యెడ సీరపాణిబల్
పోడిమి సేయు క్షోభమున భూమిజలించె జడాశయాళికిన్
జూడక హాని గల్గుననుచున్ మదినూహయొనర్పగాదగెన్.

— బలరాముడు హస్తినాపురంబును గంగలోఁద్రోయఁబూనుట. —

వ. తరువాత నభ్రగంగాప్రవాహమార్గానుసారంబు
గా నిజభవనీభూతంబగు రసాతలంబు నొందించుటకుం బోలె
విలాసమాత్రంబుగా లాంగలాగ్రంబుచేత హస్తినాపురంబు
నున్మూలించుచు రెండవకాలాగ్ని రుద్రునివలె నున్న బలభ
ద్రుని సుయోధన పురస్సరులై కురువీరులు ససంభ్రమంబుగా
సమీపించి సలక్ష్మణుండగు సాంబునిగానుకగా సమర్పించు
చున్నవారలై యనేకవిధంబులగు ప్రస్తుతస్తుతులొనర్చి యతి
కష్టంబుగా బలభద్రు నుపశాంతునిగావించిరి. 77

గీ. విధుఁడు లక్ష్మణయుక్తుడై వెలయుచుండ
విధుసుతుడు దానులక్ష్మణాన్వితుడుగాడె
యతడు మును గలుషుండు దదాప్తివలన
విమలుడైయుండె నితడెంతొ విస్మయంబు. 78

గీ. అపుడు మిత్రులచేత దానను మతిగొని
కొమరునలకోడలనుగొని కుతుకము లర
ద్వారకకు జేరె నటుబలభద్రుడరయ
పూర్ణమైనమనోరథమును గ్రహించి. 79

పదాఱువేల గోపికలతో విహరించు శ్రీకృష్ణుని మహిమ
నారదుండరయుట.

వ. అటుపిమ్మట మరియొకప్పుడు నారదుండు వేడుకగా నొక్క కేశవుండెట్టుల ననేక ప్రేయసీజనుల నేకకాలంబున సముచిత క్రీడల రంజిల్ల జేయుచుండునని యవలోకించుటకుకోర్కె గలవాడై రమణీయరూపంబగు ద్వారకాపురంబు జేరి యచ్చట విశ్వకర్మదగు శిల్పికౌశలంబు మూర్తీభవించినలీల నలరుచు నవలక్షప్రాకారమండితంబును పీతామృతంబుగలదాని చందంబున ప్రకటితసౌధరుచివిశేషంబు గలదియు చంద్రమండలంబుకైవడిని సుధాధవళితంబును. సేవితదివ్యౌషధంబు గలదాని తెరంగున ముక్తామయంబును షోడశసహస్రాంతఃపురగర్భంబునగు యదునందనుని సదనంబునొంది యచ్చట నొకయామె యంతఃపురంబున దుర్వర్ణభిత్తి బహుళంబైన దయ్యును మనోజ్ఞభిత్తికలితంబునగు నొకదివ్యభవనంబున ప్రియురాలితోడంగూడ బర్యంకంబునధివసించి యున్నట్టియు గల్పతరువు తెరంగున సుపర్ణలోభనీయుండును వసంతునిపోల్కె శ్రీవత్సానపాయియు కామధేనువుపగిది వృషానురక్తుండును భద్రాశ్రి

రాగియును చింతామణివలె భువనైకయోనియు సకలరుచివిష యుండును స్థిరసంబునుంబోలె రుక్మి పరిభవానుకూలుండును సుకృతి సంచయంబుభాతి నరకధ్వంసియు విద్యుత్పుంజంబుభంగి ఘనాగమలభ్యుండును జ్వలనునిచందంబున సమిత్ప్రచండుడును సుధాకరుని కరణి రోహిణీయానురాగియు సుకుమార భావంబువలన సహింపదరముగాని కుశేశయభావంబును విడిచి విదర్భభూవిశదంబగు పీతాంబరావృతకోమలోత్సంగంబు నాశ్రయించిన కమలయుగళంబువలె వెలయునదియు, నిరవధికరుచి సంపాదనంబుకొరకు మరలమరల కమలారాధితంబై నదియు కమలాకరనిరతసేవ్యత్వంబుచేత నర్ధసిద్ధంబగు కమలంబుచే సేవ్యమానంబైనదియు సారస ప్రతిమల్లతచేత లక్ష్మణాశయ సంస్పర్శంబునొందినదియు పునర్భవరుచిప్రకాశంబువలన సకల జగన్మోహంబైనదయ్యును సంసారభేషజంబగు పదయుగళంబుచేత లోభనీయుండును సకలోరుసేవ్యతగలదిగావున ప్రకటితనిరుపమ భావంబుగలదియు హరిప్రతీతభావంబుచేత పొందబడిన ప్రసిద్ధిగలదాటచేత హరిభీరుకవేదండ శుండాదండంబును గణనసేయనట్టి యూరుయుగళంబుతో నుపశోభితుండగువాడును సర్గోపసంహారంబులకు చతుర్దశభువన నిర్గమద్వారంబువలె వెలయు నాభీకుహరంబుతో బ్రకాసించుచున్నవాడును ననేక పౌరుషకృత్యంబులొనరించుటవలన గలిగిన యశోమండల మాలికలవలె నలరు ముక్తాహారంబులచేత నాలింగి

తంబైనట్టియు నీరస భద్రాశ్లిష్టమైనదయ్యును సరసభద్రాలింగితంబైనట్టియు శ్రీనికేతనంబయ్యును విశాలంబై నట్టిదియు నగు వక్షస్థలంబుతో రంజిల్లుచున్నవాడును నిరంతర పలాశాక్రాంతిచే గలుగు ఖేదంబుదొలంగించు కొనుటకు పలాశశంకకనాస్పదుండగువాడును సకలాగమశిరోమణియని తలంచి యాశ్రయించిన కల్పతరుశాఖాయుగళంబువలె నలరు బాహుయుగళంబుతో దేజరిల్లుచున్నవాడును సకలోత్తరత్వంబు గలదగుటచేత పరిణయ సమయంబున నిందిరాకరాధరీకరణంబును సహింపనిదానివలె తత్క్షణంబున తత్పీడనాభి నివేశంబుగలకరయుగళంబుతో విరాజమానుండును ద్విజరాజలంఘన జంఘాలంబును ననధరపరిభాశ్రితంబును నతిశుచియును నగు మందస్మితంబుతో స్పృహణీయుండైనవాడును తాను సదాదర్శపరిభావియగుటచేత సదా దర్శాభిభూతుండగు కుముద బంధురుని దృణంబుగా దలచుచున్నట్టి వదనారవిందంబుచేత లోభనీయుండును వాస్తవంబువలన కమలౌజ్జ్వల్యంబును నిరంతరంబును గ్రహించుచున్నదగుటచేత సమారోపిత కమలకాంతిస్తేయంబువలన నిఖలసుందర పురుషనయన యుగళ మాత్రంబుకన్నను నుత్కృష్టంబగు నేత్రయుగళంబుతో దీవ్యమానుండును నుదాసితకర్ణ తన్ ప్రసిద్ధుండగు వానికింగూడ నిరవధికరుచిసంపాదనంబొనరించుటంజూచి సముపజాతానందంబు గల సహజరుచిశాలియైన నయనయుగళంబుచేత నాలింగితం బగు

కర్ణయుగళంబును భరించుచున్నవాడును బూర్వ జన్మంబునం దంతటను బ్రన్నావరించిన హిమకరకరంబులచేనగునట్టి పరిభవంబునఁగల్గు రోషంబుచేత నిపుడాననరూపంబు నొందియున్న చంద్రునంతటను నాక్రమించిన కళంకంబుచేతంబోలె శ్మశ్రుమండలంబుచేత నలంకరింపబడిన వాఁడును సకలసుమనో విలక్షణంబగు మధుహార, విరోధితచేత జేయబడిన యపయశంబును దొలగించుకొనెడు కామంబుచే దపోబలంబువలన సకల సుమనోభి మతంబుగల మధుహారముఖ చుంబనంబున కనుకూలంబగు చంపక కలికవలె నలరు నాసికతోడ విరాజమానుండైన వాఁడును నవచనీయ వర్ణాశ్రయత్వంబుచేత వచనీయ వర్ణాశ్రయంబైన లలాటమాత్రంబువలన నుత్కృష్టంబగు ఫాలఫలకంబుతోడ విలసిల్లుచున్న వాఁడును భగవంతుండునునగు నమ్ముకుందుని మూర్తీభవించిననిజతపః ఫలంబునుంబోలె విలోకించెను. 80

క. హరి త్వరగ లేచి యమ్ముని
నురుతరసింహాసనమున నునిచి యెలమిఁదఁ
చ్చరణములు గడిగి తజ్జల
మిరువుగ శిరమున ధరించెనెంతయుభక్తిన్. 81

గీ. శాంతకాముఁడ వగునట్టి సంయమీంద్ర
యెటుల లభియింతువైననీవెలమినాదు
మందిరము జెందుటది యెన్న మామకీన
కులజులొసరించు బహుతపఃఫలముగాదె.

గీ. నిహతదుష్కాముడగు భవానీదృగాప్త
డెటుల లభియించు నైన దానెంతొ వేడ్క
నెనసి గృహాసక్తి గొనుటదియెంచిచూడ
గోత్రజైకతపఃఫల గురుతగాదె. 82

వ. మహాత్మా! మీకిష్టమగు విధేయ విషయంబులం
దు నన్ననుగ్రహించి నియోగింపుమని సుధాసారసరసంబగు
వాక్యంబును బలుకుచున్న భగవంతుండగు శౌరితోడ నార
దుండిట్లు పలికెను. 83

క. నినువిడిచి మరివిధేయము
లను గనుగొన నిపుడు నిన్నులక్షించుటచే
తనె సుకృతార్థుడనైతిని
గ* నద్భుతమైననీదు ఘనలాభముచేన్. 84

వ. ఇట్టులఁ బలికి మరియొక రమణీగృహంబును నార
దుండు పొందియున్న సమయంబున. 85

గీ. అవునె! పద్మిని! ప్రియయిది యెట్టిదగునొ
హరికి ప్రణయానుబంధ సంసరణమిట్లు
పాదతాడనముల గోపభరముగొనక
యిదియె ప్రియదయయనిమదినెన్ను నతడు. 86

గీ. కేళికలహమునందు దాగినియు కాంత
నొప్పగానిట్లు దరిజేరి యూరడించు
చునె యటకు వచ్చునారదుజూచి మరల
స్వాగతమొనర్చి ప్రశ్నించె శౌరి యపుడు 87

వ. నారదుండూరక యే మరలనొక సుందరీ మందిరంబు జేరు నవసరంబున. 88

ఉ. తాలిమి బాలునిన్ బిలిచి తాతవు తల్లివి నీవె యాదు వీ
మేలగుపండు బాలకులు మెండుగ నెవ్వరు జూడకుండ నీ
వేళను నీకొసంగితిని వేగమె గైకొను మన్న డైన యే
బాలుడు గానకుండునటు బాగుగ బెల్లముగూర్చి ధానముల్
జాలగ నీకొసంగెదను సమ్మతిమై జనిరమ్ము బాలకా. 89

గీ. బాలునీలీల నెంతయు లాలనంబు
సేయుచును మాయమాటలు సెప్పుచున్న
హరిని గనుగొని నారదుడపుడు మరల
నన్యతరుణీ గృహంబునకరిగె త్వరగ. 70

వ. ఇవ్విధంబునం బ్రతిగృహంబునందును విలక్షణవ్యాపారానుషంగంబు నొందుచుండియును నదృష్టపూర్వునింబోలె స్వాగత కుశలాను యోగాదుల నభినందించుచున్న వెన్నునింగని కడపటి యంతఃపురంబునం బ్రవేశించి నారదుండు నవ్వుచు నిట్లనియెను. 91

గీ. జనులనెంతయు విశ్వేంద్ర జాలములను
మోహపెట్టుట నీకు నద్భుతముగాదు
వింతయిదె మాయయనియెడు పింఛమిచట
నర్ధచంద్రావిషయమందునందు మెపుడు. 92

క. నారదుడిటు పలికి యపుడు
శౌరివలన ముదమునొంది సరసతదీయం
బౌర్షుచిరయోగమాయా
భారముగని విస్మయంబు బడయుచునేగెన్. 93

—• శ్రీకృష్ణుడు ధర్మరాజు రాజసూయంబుజూడ నేగుట. •—

వ. మరియొకప్పుడు నారదవచనంబువలన నజాతశత్రుం డగుధర్మరాజు యజ్ఞంబుగావింప దలంచియుండెనని విని మధుసూదనుం డవరోధవధూజనసమేతుండై కొన్నిదినంబులలో నింద్రప్రస్థంబునుగూర్చి సమీపించి సంతసంబుతోనుండెను. 94

వ. అపుడు పాండవులును, తన సతులతోగూడ వచ్చియున్నట్టియుఁ దమ కారవపాళింబువలె వెలయుచున్నట్టియు నక్షయంబగు తమకుల ధనంబైనట్టియు నంగ దేవతాసహితంబగు చేయబూనిన యాగ ప్రధాన దేవతవలె నలరుచున్నట్టియు నణిమాద్యష్ట విభూతులతో గూడుకొనిన ధనదునివలె నున్నట్టియు పృథివ్యాద్యష్టమూర్తి పరివేష్టితుండగు శశిశేఖరునివలె నున్నట్టియు లోకపాలమాత్రాష్టక, నలయితంబగు రాజన్య తేజః పుంజంబు చందంబున నున్నట్టియు నలయష్టమహాసిద్ధిపరివృతంబగు సిద్ధ మంత్రాధి దేవతలవలెనున్నట్టియు పద్మాద్యష్ట విధసౌందర్యనిధి సహితంబగునట్టియు•నవకుందలావణ్య నిధియగునట్టియు నవరత్నమాలికయందుమధ్యస్తంబగు నింద్రనీల మాణిక్యంబుకై వడి నన్నట్టియు నామా

ధవున కెదురుగా జని పరిరంభకుశలానుయోగాదులచే నభినం
దించి వానితోఁ గూడ తమ భవనంబునొందిరి. 95

క. అలకుంతియుఁదన తనయుల
గలసియు నేతెంచునట్టిఘను మేనల్లున్
గులుకుచు తగునుపచారం
బులచే సుఖముగను స్వగృహముననుంచెదగన్. 96

క. అతులితమయ మాయాని
ర్మితమగు సభనుండి ధర్మనృపవరుడంతన్
నతుడై హరితోనిట్టుల
హితవుగ బ్రార్థించి పలికె నెలమిదలిర్పన్. 97

గీ. శుభదనవరాజమగు రాజసూయమనెడు
మఖ మొనర్చెద నినుగూర్చి మాధవ! యిక
దీనికర్హుండనై యుంటి నేని నన్ను
గూరిమి ననుగ్రహింపగా గోరుచుంటి. 98

వ. ఇటుల బలుకుచున్న యజాతశత్రుం గాంచి భగ
వంతుండగు వాసుదేవుండిట్లు పలికెను. 99

ఉ. వీరుడవైతి వుచ్ఛపదవిన్దగి యుంటివి సుస్థిరుండవై
మీరు బుధుండవౌట నిక మించితి సోమరసాతిపాత్రతన్
నేరనిమందుడున్ చలుడు నీచపదాధి నివాసుడై సదా
క్రూరతరాగ్రహాక్రమ ఖలుండగునన్యుడునీకుసాటియే. 100

గీ. గొప్పదగు నీసహజ తేజ మొప్పుమీఱ
జగతి నాక్రణ మొనర్పజాలియుండ

సమితకళ్యాణలాభంబు నగుచునుండు
నగుటనది యిష్టసాధన మనితలంతు. 100

• ధర్మరాజు శ్రీకృష్ణుని యనుమతిని భీమార్జునాదుల
దిగ్విజయంబునకు బంపుట.

వ. తరువాత యుధిష్ఠిరుండును చతురులగు చతుస్సహోదరులను మధుసూదను నాజ్ఞగొని నలుదిశలకుంబంపించెను. 101

వ వారును కొలదికాలంబునకు యోగులవలె వశీకృతాశులై యపుడధ్యయనంబువిడిచిన వారలవలె గురువుకొరకు గనకోచ్చయంబును సమర్పించి ప్రమదాశ్రితులై యొప్పుచుండిరి. 102

గీ. పాండవులచే పరాభూతి బడయడయ్యె
మాగధుండని చింతించి మాధవుండు
వాని ప్రాణమె హరియింపబూని మదిని
జెన్ను మీఱదలంచెను చిత్రముగను. 103

గీ. బాడబాకృతి వహియించి భాసురముగ
నపుడు భీమార్జునులును జనార్దనుడును
ననిశపరవాహినుల మ్రింగునట్టివాని
గ్రసన మొనరింప నేగి రాగ్రహముతోడ. 104

వ. అపుడు జరాసంధుని జెంది యశనోద్యుక్తంగాను నతిథులవలె యాచించిరి. 105

గీ. అలజరాసంఘటితమూర్తి వగుట నిన్ను
దుర్గతంబగు మార్గణవర్గముగను
బొందితిమి మేము నిర్వృతి నొందగలము
జీవనగ్రహణప్రాప్తిచేతనైన. 105

వ. ఇవ్విధంబున, గపటంబుగా బలుకుచున్న వీరలను గలహాలంపటులనుగా నెరింగి మాగధుండిట్లు మారువలికెను.

మ. పరగన్ రావణబిక్షుగార్జునగతిన్ వామార్థులైముగ్ధభూ
సురభావంబు వహించు మీరలెవగో చూడంగనాత్మప్రకా
శ్యరుచిర్దత్పరపూరుషాథ్యనెడవామాచారమున్బూనియు
త్కరతన్మీరెడుమీరలిమ్యెడగనంగాభీరువుల్గారొకో.

వ. ఈవిధంబుగా నశనిపాతసదృశంబగు ననల్పపరీవాదజల్పితంబును విని మిగుల, గోపించి భగవంతుండగు శౌరి యిట్లనియెను. 108

గీ. భువనగారణుడను నేను బొలుచునతడు
భీముడు ధనంజయుండన వెలయునితడు
దమిని త్రేతాగ్ని తేజస్కులమగు మేము
బుట్టితిమి తృణతాప్తులంబొరిదహింప. 109

వ. అదివిని కరాస్ఫాలనంబు గావించి నవ్వుచు జరాసంధు డిట్లనియెను.

ఉ. బాలురుఫీర లిర్వురును వైరివిమర్దనమే యెరుంగరే
లీలనో యుండుగ్రాక రిపులీలలడంచు సుకీర్తివీవునున్

గాలికినేస్తకాడ వనగాడకునా సమరంబునందహో
హేలబలంబునుండి పనునెన్మిదిమారులు బారిపోవవే?
చాలుదిశావిలంఘనసుజాంఘికతన్ బరుడొందశక్తుడే! 110

వ. ఈరీతిగా వ్యాజస్తుతి భంగినంగీకరించుచున్న వాని తో భగవంతుడగు మురారి దానిట్లనియెను. 111

గీ. సకలరాజస్తుతివచో విషయుడవౌచు
తనరు మాగధుడవు పూర్వగుణుడవౌట
నీదువాగ్విభవము వచనీయమగును
గానిచోనిట్టి స్తవరీతి గలుగుటెట్లు. 112

వ. మాగధుండీప్రశంసా భాసంబుచేత దూయమాన మానసుండై మరల నిట్లనియెను. 113

గీ. బాధకృన్మార్గణా పాతభయమునొందు
వారిసన్నుతి మాగధసూరిచేయ
తనరురసికైకవేద్యమై తద్రిహాస్య
వేత్త గోపాలుడౌటది వింతదోచె. 114

వ. ఈప్రకారంబున నుత్తరోత్తరశుభదయగు చతు రోక్తి ప్రత్యుక్తికలనచే గొంచెముకాలము సంభాషించి మేము కలహాలోలురమని తమయంతరంగంబును వెల్లడించి తెలిపిన వారలనుద్దేశించి మగధాధిపుడిట్లనియెను. 115

గీ. నిరతమ్మును భీతిఁ బర్వెత్తునీకుసిగ్గు
లేనిమామకదుర్బాధ లేదుగాత

బాలుడు ధనంజయుండటు బరగుగాత
భీముతోమాకు కలహంబు వెలయుగాత. 116

—• శ్రీకృష్ణభీమార్జునులు జరాసంధుని వధింపబోవుట •—

వ. ఈరీతింబలికి వృకోదరునకొక గదయొసంగి తాను గూడ నొకగదంజేకొనినవాడై కుతూహలంబుతోనిదినిమ్నోన్నతస్థలంబని యెంచి నగరపరిసర ప్రదేశంబును సమరసముచితంబగు భూమిగాదలంచి జరాసంధుండు కృష్ణభీమార్జునులతోగూడి నగరంబునుండి బయలువెడలెను. 117

వ. అచట భీమజరాసంధులిర్వురును నామయంబులుగలవారలవలె గదాపాతకదర్థితశరీరులై పిశునులవలె రంధ్రాన్వేషణతత్పరులై శివాభేదభాజులవలె ఙ్వేళానుబద్ధకంఠులై సుభద్రాంగదాశయులవలె బరస్పరవిజయకాంక్షగలవారలై చతుర్ముఖభుజస్తంభంబులపగిది నలరుచు సురసుందరీలోభనీయంబగు నొక యపూర్వవిగ్రహంబునొందిరి. 118

క. అడరెడు మగధునడంచియె
కడువృద్ధిని భీముడొందె గనయుక్తముగన్
కడిమితదున్మేషనివతి
నొడగూడదె తద్వృకోదగోత్కర్షధరన్. 119

క. ఇలను జరాసంధాత్యయ
మలరగ పరతేజ మప్పుడణగగదగును

జ్వలవాత జాతదోషో
త్కలన నివారింపనెవఁడు గడుశక్తుండా. 120

వ॥ పిమ్మట యదునందనుండర్జునునితోఁ గూడ భీము నింగాఁగలించుకొని జరాసంధుని తనయుండగు సహదేవునకు రాజ్యపట్టాభిషేకంబొనర్చి తద్బందీకృతులగు నఖిలరాజన్యులను కారాగారంబునుండి విడిపించి వారివారిసింహాసనంబులం దెప్పటిరీతి నిల్పి పరిపూర్ణ మనోరథంబున హరిప్రస్థంబు నొందెను. 121

క. తరువాత ధర్మసుతునిం
హరిభీమార్జునులు జూచి యటువందనముల్
నెరపుచు మాగధవధ దె
ల్పిరి తగనాద్యంతమెల్ల వేడుకతోడన్. 122

వ. ఆజాతశత్రుండగు ధర్మనందనుండును తద్వదన చంద్రాలోకంబున వృద్ధినొందింపబడిన దగుటచేత శరీరము ధ్యంబును బరిగణింపక నయనమార్గంబునం బారుచుండు సంతోషసాగర స్రోతస్సుచేతంబోలె బాష్పధారావళిచే విన మ్రులగువారల నభిషేకించి తత్సంసిక్తతచేత ద్విగుణితానందంబుగల మధుసూధనుంగని మధురంబుగానిట్లుపలికెను. 123

క. అలకృష్ణ పక్షపాతము
వలనను నహింభయము దొలగ వరముఖకాంతిన్

వెలయసుమనోగణమునకు
బలపడవే! జూడసోమపానోత్సవముల్. 124

గీ. చెలగెడు ననంతగుణసమంచితుడవైన
నీదు సేవకులము కృపనిగ్రహమున
శక్తిగలిగిన మాకికసప్తతంతు
సంభవముగల్గుటబ్రమే గుంభితముగ. 125

## — శిశుపాలవధ-ధర్మరాజు రాజసూయంబు సంపూర్ణము సేయుట —

వ. ఇట్లుత్తమశ్లోకుడగు హరిని వినుతించి యాతనియనుజ్ఞచే నధ్వరసంభారంబుల నెల్లగైకొని ధర్మరాజు రాజసూయ యాగంబుసేయ సమకట్టెను. 126

మ. ఘనరాకేవల యాగభూములచటన్ స్వాహారవైరాశ్రితా
యనునట్లాటయెకాదు సంతతహవిర్వ్యా దానతానాదరో
న్మను లిందాద్రిదులుగూడ ప్రేమ్యపదమామంత్రంబునే [కాదుసా
ధ్యనరాధీశులయందునన్ క్రియలప్రాయశ్చిత్త వైకల్యమె
య్యనగాదల్ల దరిద్రులందుదగునాహా చిత్రమా నెంతయున్ 127

వ. అటుతరువాత నజాతశత్రునకర్ధిజనులతో గూడ నిష్టపరిపూర్తి యగుచుండ కీర్తితో గూడ నమరగణంబులు పరిపూరితాశలు గలవారలైయుండ పరిషదారాధనంబు కొరకు సంపాదింపబడిన సంభారంబులుగలవాడై యుధిష్ఠిరుండ పుత్రగ్రపూజగావించుట కర్హులెవ్వరని సంశయించుచున్న

సమయంబున సహదేవుండు సకలసభాజన భాజనంబగు వచ
నంబు నిట్లుపలికెను. 128

గీ. కరితురగపతి గర్వితాగనుచుమున్నె
ఎవనిగోత్రోద్ధతిని శరణెనసెమదము
వీడిపురుషోత్తముడతని విడచిపరుడు
భువిగ్రితువానర్చ్చ మనకు సంపూజ్యుడెవడు. 129

వ. ఇవ్విధంబున నుపపత్తిపూర్వకంబును నమృతధా
రామధురంబును నగు సహదేవవాక్యంబును విని సకలసభాస
దులును ముదముగదుర గుదురుగానందరు నొక్కమారిక్క
రణి వక్కాణించిరి. 130

గీ. బాగు, వర్ధిల్లు! సహదేవ! బాగుబాగు
శాలుడవె? బుద్ధిశాలుల వరగురుడవు
నీదునాసత్యతయు భువినెగడెనిపుడు
సత్యవాక్కుల దుర్వచఃశాలులకును. 131

క. తరువాత దానియర్థము

[illegible]
బుగా సుదర్శనంబుచే విలాసమాత్రంబుగానతని మస్తకం
బును దునిమివైచెను. 135

గీ. అలసుదర్శనముననె వైరులనుజంపు
స్వాయముగ గదావలంబియై బరగుచుండు
విగ్రహంబునవైరిని విగతుజేయు
నిట్టి మాయాధిపతిగెల్వ నెవ్వడోపు. 136

వ. ఇమ్మెట నవబృచస్నానంబొనర్చు నజాతశత్రుం
డగు ధర్మరాజును పురంబునంబ్రవేశపెట్టి యాతని ముదంబు
గొలుపు గొన్నిదినంబులు నిజసతులతోగూడ జనార్ధనుండా
హారిపస్థనగరంబున నుండెను. 137

ఉ. శ్రీగిరిజా కృపారసఝురీ భరసార భవత్కటాక్షశో
భాగురువీక్షణంబు లలభాసురకల్పలతానుమావళుల్
గాగొని సత్కవీంద్రుడనగా దగుశ్రీనవకాళిదా
సుగ దారచించెనిదె పండితమానస సద్వి
పువున పంచమమైన విలాసవ

సమయంబున సహదేవుండు సకలసభాజన భాజనంబగు వచ
నంబు నిట్లుపలికెను. 128

గీ. క్రితుభుగధిపతి గర్వితాగనుచుమున్నె
మెవనిగోత్రోద్ధతిని శరణౌనసెమదము
వీడిపురుషోత్తముడతని విడచిపరుడు
భువిగ్రితువానర్చ్చమునకు నంపూజ్యుడెవడు. 129

వ. ఇవ్విధంబున నుపపత్తిపూర్వకంబును నమృతధా
రామధురంబును నగు సహదేవవాక్యంబును విని సకలసభాస
దులును ముదముగదుర గుదురుగానందరు నొక్కమారిక్క
రణి వక్కాణించిరి. 130

గీ. బాగు, వర్ధిల్లు! సహదేవ! బాగుబాగు
శాలుడవె? బుద్ధిశాలుల వరగురుడవు
నీదునాసత్యతయు భువినెగడెనిపుడు
సత్యవాక్కుల దుర్వచఃశాలులకును. 131

క. తరువాత దానియర్థము
పరమార్థముగాదలంచి వరగుణుడుయుధి
ష్ఠిరుడు హరింబూజించెను
గురుగంధాభరణచేల కుసుమాదులచేన్. 132

వ. పిమ్మట శిశుపాలుండు కల్పాంతాగ్నింబోలె నీతి
మాలి, వనమాలిపరిభవ సపర్యకు, పర్యాకులిత హృద
యుండై క్రోధయుక్తుండై లేచి యిట్లనియెను. 133

గీ. అహహా! రాజర్షులైన పుణ్యాత్ములుండ
ప్రథమపూజార్హుఁ డయ్యె గోపాలకుండు
ఖలున కేయది యపచితిగాదుపూజ్య
గణి, తిరస్కృతిచే యాగకారికినగు. 134

వ. ఇటుల కర్ణకఠోరంబుగా పేర్కొలుచుండెడు శిశుపాలు నింగని గోపాలుండగు పురుషోత్తముడతిరోషంబున శీఘ్రంబుగా సుదర్శనంబుచే విలాసమాత్రంబుగానతని మస్తకంబును దునిమివైచెను. 135

గీ. అలసుదర్శనముననె వైరులనుజంపు
న్యాయముగగదావలంబియై బరగుచుండు
విగ్రహంబునవైరిని విగతుజేయు
నిట్టి మాయాధిపతిగెల్వ నెన్వఁడోపు. 136

వ. పిమ్మట నవబృథస్నానంబొనర్చు నజాతశత్రుండగు ధర్మరాజును పురంబునంబ్రవేశపెట్టి యాతని ముదంబు కొలుకు గొన్నిదినంబులు నిజసతులతోఁగూడ జనార్దనుండా హరిప్రస్థనగరంబున నుండెను. 137

ఉ. శ్రీగిరిజా కృపారసఝరీ భరసార భవత్కటాక్షశో
భాగురువీక్షణంబు లలభాసురకల్పలతానుమావళుల్
గాగొని సత్కవీంద్రుడనగా దగుశ్రీనవకాళిదాసుమ్రుక్
బాగుగ దారచించెనిదె పండితమానస సద్విలాసమై
భాగవతాఖ్యచంపువున పంచమమైన విలాసమొప్పెడుక్. 138

చ॥ శివగిరిజా కృపారసవిశేషపరీత కటాక్షవీక్షణో
ద్భవతతసాహితీసు కవితారసభాసురసుందరాఖ్యస
త్కవికృతమౌ ససారభసుధారస ధారలమీరునాంధ్రభా
గవతపు చంపునన్ వినుతిగాంచెనుపంచమమౌవిలాసమున్ 139

గద్య.

ఇది

శ్రీమన్మహారాజ రాజేశ్వరీ కరుణాకటాక్షవీక్షాలహరీ పరీత
సంస్కృత సాహిత్య సరసకవితాచాతురీధురీణ లౌకిక విద్యా
విశేషప్రవీణ సత్యవోలు కులకలశజలధి కువలయమిత్ర
భారద్వాజసగోత్ర భగవత్కవివంశపవిత్ర సోమరాజా
మాత్య పౌత్ర వెంకటరాయమంత్రి వరపుత్ర
రామాంబాగర్భశుక్తిముక్తాఫలోదయ సకల
సుకవి విద్వజ్జనవిధేయ సోమసుందరకవి
నామధేయ ప్రణీతంబైన శ్రీమ
దాంధ్రచంపూభాగవతమునందు
పంచమవిలాసము

సంపూర్ణము.



శుభమస్తు. శ్రీరస్తు. అవిఘ్నమస్తు.

శ్రీ శాంకరీదేవ్యైనమః

# శ్రీమదాంధ్ర చంపూ భాగవతము.

## షష్ఠ విలాసము

—• శ్రీకృష్ణుడు సాళ్వాదిశత్రుల జయించుట •—

మ. అనిశారాధితుఁడైన శంకరునిదానాజ్ఞన్ మయుండాత్మమా
యను నిర్మించినదై సురాసురల కత్యంతంబభేద్యంబునై
గగనస్థావరమైన సౌభపురమున్ గర్వంబుతో నెక్కి స
య్యన సాళ్వుండట శౌరిలేనితరి నాహోనందిదేయంచుదా
ఘనమౌ ద్వారవతిన్ నిరోధమెనయంగాముట్టడించెన్ దగన్

వ. అట్టి, విమానంబువలె, గగనసంచారశీలంబును కాముకమనంబువలె సకలాశాజంఘాలంబును నాసౌధంబును నధివసించి జలధరంబువలె శిలావర్షంబును గురియుచు, మాయవలె తమంబుచేతను, రజంబుచేతను సకలజనంబులనంధులగా జేయుచు కృపణునివలె మార్గణగణంబునునిరసించుచున్నట్టి సాళ్వుని బొంది మిగుల కోపంబు గలవాఁడై

ప్రద్యుమ్నుడు శీఘ్రంబుగా సాంబాదులతోఁగూడ గుహాముఖంబునుండి కేసరివలె నగరంబునుండి బయలువెడలెను. 2

క. పోలుపొందెనపుడు యుద్ధము
చెలగెను ప్రద్యుమ్నసాళ్వసేనలకటు స
ట్టులయ్యెను భయభటులును
నలరిరిగడు త్యక్తసంఖ్యలై చిత్రముగాన్. 3

మ. వెలయన్ సాళ్వపురస్కృతంబయిఫలాప్తిన్ గొన్నతన్మార్గ
ణావళినిన్ దారిని దున్మిభూరితరలాభంబందెముందట్టి దా
నలప్రద్యుమ్న శరంబహో యిచటనన్యప్రాణదానంబు నీ
కలరన్ సద్గురు వంశమందియు మహాఘంబున్ దగన్ జేసితం
చలరన్ లజ్జనుబూని మున్గె శరధిన్ న్యాయానుగుణ్యంబుగా

వ. తరువాత నిట్టివృత్తాంతంబును విని హరిప్రస్థంబు నుండి వచ్చియున్నహరినిం జూచి సమరంబున కెదుర్కొని సాళ్వుడిట్లని పలికెను. 5

వ ఔరా! యదుకుల కలంకుండవును కలహకాతరుడవునగు నీయనాత్మ వేదితయేమిది. 6

చ. రణమున బారిపోవునవురా! యితడెన్నగమాగధుండొకో
గనుగొననాదుయుద్ధమునగల్గెడుసాళ్వగురుత్వమొప్పెడున్
ఘనకృపణత్వమూని గడకన్ శరణంబును జెందునట్టి యా
జనుడె గొనన్ సమర్థుడగు సన్న్యసనంబు నికన్ బరుండు నా
జనుడు గొనం సమర్థుడనుసన్న్యసనంబును జిత్రమైతగన్. 7

వ. ఇట్లు బలుకుచున్న సాళ్వునింజూచి వాసుదేవుండి ట్లనియెను ఓరిమూర్ఖా! యిదివినుము, 8

క. అరయభవాదృశులకు దు
ర్భరచపలోన్మేష మదిస్వభావముచే న
శ్వరమగు సమూలవిలయము
బరగున్ బ్రిబలాశుగముల పటుఘాతములన్.

వ. ఇవ్విధంబున పరస్పరపరీవాదంబు సేయుచున్న వీరల కిర్వురకును గొప్పదగు సమరంబు జరుగుచున్న సమయంబున సాళ్వమాయావినిర్మితుండగు కొండొక సందేశహారకుం డరుదెంచి నేను దేవకీదేవిచే నంపింపఁబడినవాఁడనని పలికి, మురహారికి నమస్కరించి యిట్లనియెను. 9

గీ. కెరలు దీనత హా! కృష్ణ! కృష్ణ! యనుచు
దివిరి మీతండ్రియగు వసుదేవుఁ డిపుడు
ప్రబలసాళ్వునిచేతను బద్ధుఁడగుచు
నపహృతుండయ్యె పశులీల నద్భుతముగ. 10

వ. ఈరీతి నాదూత బల్కగా విని యా యదుపతి మిగుల దూనమానసుండై స్వగతంబుగా దనయాత్మలో నిట్లనుకొనియెను. 11

గీ. దరిని బలరాముఁడుండిన తాతకిట్టి
యాపద పొసంగుటెట్లగు నరసిచూడ
నతఁడు దూరస్థుడై యున్నకతన నపుడు
జానకికలంఘ్యమగుపీడ జాతమయ్యె. 12

వ. అనుకొని ప్రకాశంబుగా నిట్లనియెను ఓయి త్రిజగత్పరాక్రమ! నయనాభిరామరామా! యెట్లుగా నివ్విధంబగు ప్రమాదంబు నొందితివి? 13

గీ. మునుపు పితృవాక్యపాలనమునను రాముఁ
డందె ముల్లోకముల సురలందసట్టి
ప్రతిభ రాముఁడు పితృతనుపాలనంబు
జేయఁ డితఁడను నపకీర్తి చింతయేమి? 14

వ. ఇటుల వాసుదేవుండు బల్కుచున్న తరుణంబున సాళ్వుండు వసుదేవు నెదుటను గనుపరచి మస్తకంబును దునిమి సౌభంబు నొందెను. 15

సీ. హరి యప్పుడట్టి యనార్యకార్యము జూచి
యెట్టిదాదుర్దశ నెనసె నట్టి
దిగు హీనదశ ప్రాప్తమగుటలేదెన్నడు
సన్నుతమగు పూర్వజన్మమందు
మాయసీతనుదెచ్చి కోయుచుండగ నది
గాంచుచుండుతరి జనించునదియు
సౌమిత్రి గాఢమూర్ఛనుజెంది పడియుండ
గాంచినతరిని జనించినదియు

గీ. నెలకొలుపునట్టిదైన కనిష్ఠభేద
మరయగానది యనుభూత మయ్యె మున్నె
హరికి నియ్యెడ గలిగిన గురువిపత్తి
సాటిలేనిదియై దా నెసంగుచుండె. 16

చ. కరమునసుండి శార్ఙ్గమును గన్దవనుండియునశు్రిజాల మ
త్తరిని మనంబునుండి పటుధైర్యము నొక్కెడజారెనట్టి దు
ష్కరమగు దుర్దశంగని యసత్యముగాగఁ దలంచువారికే
భరమగుచుండెఁ క్షోభ మురవైరికి నెట్టిదియానొ చూడగన్.

వ. తరువాత యోగదృష్టిబలంబుచే నదియంతయు
నసత్యంబుగా దెలిసికొని వృషావరజుండు విషాదంబు విడ
నాడి రోషభీషణుండై విద్వేషికషణంబుకొరకు సుదర్శనంబును
బ్రయోగించెను. 18

శా. జ్వాలామాలలచేతఁజుట్టుకొని యాచక్రింబవక్రింబుగా
లీలన్ సౌభమునాక్రమించిగడుబాలిన్ క్షోభ మొందెంచియా
వేళన్ బంధురసింధురంగమునరువ్వన్ శౌర్యతాపంబులన్
జాలన్ దూలినవాని నల్పమగుశస్త్రంబున్ బ్రయోగించి ని
ర్మూలించెన్ గుణిశౌరిచే డెగినశత్రుల్ సంఖ్యకున్ వత్తురే. 19

వ. అటఁతరువాత్కవానికిందోడుగావచ్చిన దంతవక్త్రి
విధూరథులనెడువారల నిర్వ్వరంగూడ సాళ్వుని మార్గంబు
నొందించి దివిజులు హర్షంబుతోఁ బుష్పవర్షంబు గురియు
చుండ సురసుందరీమణు లందంబుగా నృత్యంబు గావించు
చుండ సంభావించుచు ముకుందుండు సానందంబుగా నిజ
మందిరంబు నొందెను. 20

## కుచేలోపాఖ్యానము.

గీ. హరికి మిత్రుడు దగుసహాధ్యాయియగుట
వేదపారగుడు స్వరూప విపులలాభ
ముదితుడును గడుదారిద్ర్యమునను సార్థ
నాముఁడొకడు గుచేలుండనంగ నలరు. 21

వ. అంత నొకప్పుడట్టి కుచేలుని సహధర్మచారిణి, దారిద్ర్యంబుచేత నితాంతతాంత హృదయయై తన దయితు నితో నిట్లు సవినయంబుగా విన్నవించెను. 22

వ. భగవంతుండవగు నో మనోహరా! దారిద్ర్య సముద్రవిదారిత సకల విషయాభిలాష. యేనెద్దియో యొక్కటి విజ్ఞాపనం బొనర్చుటకు గోరుచున్నదానను. నన్ను ప్రదీప దర్శినిగా దలంచి యుపేక్షింప వలవదు. 23

గీ. శ్రీవిభుడు నీకు మిత్రుడై జెలగుచున్న
నిట్టి కృశదశ శాంతింప వెందువలన
బొల్చు జగదీశు సామీప్య ముక్తి నెట్టు
లగును శ్రీలబ్ధి సుహృదులకైన నాథ. 24

గీ. మిత్రశోభాప్తి నెనయక మెలగునెడల
పొలుపుమీరగ ద్విజరాజ పుష్టియగునె
యివియు సిద్ధాంత వాక్యములై యెసగుచుండ
నిచట దర్శనలాభత ప్రచురగాదె! 25

వ. కావున నవశ్యంబుగా దారిద్ర్య విదారణంబు కొరకు, దామోదరుండగు రమావల్లభుండు దర్శనీయుండని ప్రాణప్రియ యిట్లు పల్కుచున్న సమయంబున. 26

గీ. తనదు యాచ్ఞా పరాఙ్ముఖతయును బ్రాణ
హితవచన మాన్యతయు గలహించుచుండ
నెంచి మధ్యస్థయై హరిగాంచు నీహ
సతి ద్వితీయమె యనె తదాశయగ నగుచు. 27

వ. తరువాత నకుంఠ వైకుంఠ దర్శనోత్కంఠ చేతం బ్రియురాలిచేఁ బ్రేరేపింపబడినవాడై కుచేలుండు చేలాంచలంబున భగవదుపహారంబుకొరకు నాలుగు పిడికెళుల నటుకులను మూటగట్టుకొని వనమాలిని విలోకించుటకు గుతూహలంబు గలవాడై ద్వారకానగరంబు నొందెను. 28

వ. అపుడు నగరంబును బ్రవేశించి తనమనంబున నిట్లు జింతించెను— ఆహా! యమరావతింగూడ నతిశయించుచుండెడు నీ ద్వారవతి యెక్కడ! హరి గర్భంబునంగల దగుటచేత సార్వభౌమ ప్రవేశంబునకుం గూడ వీలుగాని దీ యంతఃపురం బెక్కడ? చతురాననునిం గూడ నర్ధచంద్ర దానం బొసంగి శాంతదర్పకునిగా జేయు నీద్వారపాలు రెక్కడ? త్రిజగన్నాయకుండగు యదునాయకుని దగు నీ విజృంభమాణంబగు ప్రాజ్యసామ్రాజ్యవైభవంబెక్కడ! ఆచ్ఛాదిత కచ్చరపటచ్చరుండను, బ్రలంబ మానకూర్చుండను

దరిద్రశ్రోత్రియుండను నగు నేనెక్కడ! యొకవేళ నతికష్టం
బుగా బ్రవేశించితినేని నన్నాలక్ష్మీవిలాస పరవశసర్వేంద్రియ
గ్రామంబుగల దామోదరుం డెట్లు గుర్తించును గావున సర్వ
ప్రకారంబులను వ్యర్థమనోరథుండ నని తలంచెను. 29

గీ. ఇటుల జింతించుచునె యామహీసురుండు
వారితుడు గాకయే హరిభవన మొందె
వింతగా దిది హరికృపావిషయమునను
సుగతివారణ కృతఖేదమగుట డెట్లు. 30

వ. అయ్యెడను భగవంతుడగు శౌరి రుక్మిణీసదనమం
దున్నవాడయ్యును మిత్రావలోకనంబుచే వికసించిన ముఖ
పుండరీకంబుగలవాడై ప్రాణప్రియతోడం గూడ సత్వరం
బుగా బర్యంకంబునుండి డిగి కుచేలునిం గాగలించుకొని నిజ
శయనంబు నొందించెను. 31

మ. అలసీతా పరిరంభ భంగవిరసుండై కౌగిలిం గోరు యో
గులముందాజననంబునందనుచుబల్కుండెల్పిమాన్పించె ని
మ్ములల నిట్లాతడె రుక్మిణీ కుచ భరంబున్ వీడివేం బ్రేమం గౌ
గిలిం జేర్చెన్ గృతియౌ కుచేలు ఘనతన్ గీర్తింప గాశక్యమే!

కం. కృశుడగు ద్విజరాజును గని
వశుడై కౌగిటను జేర్చి బహు రుచిరత్వం
బొసగిన యాహరిమిత్రత
యసదృశమై యొసగుగాదె యద్భుతలీలన్. 33

చ. హరి సముదగ్రపూరమున నాప్లుతినొందినవానికయ్యెడన్
జిరధృత పంకమంతయు నశించెను చిత్రముగాఁగ వానికిన్
మరియొక పంకలేప మొకమారును గల్గదటన్నయుక్తమా
నరుతరలీలమై కుపదయోగకథాప్తియులేదు వానికిన్. 34

గీ. అరయ మును విధిఁగడిగిన యడుగుదమ్మి
లెనయునట్టి త్రివిక్రము డెలమిమీర
బరఁగ దనగృహాగతుడగు బ్రహ్మమైన
వీని పదములు గడిగెను విధియటంచు. 35

క. నతశిరమున తజ్జల సం
గతిగొని మూర్ధాభిషిక్తతను జెందెను శ్రీ
పతియైన యౌగికముగా
నతనికి నది రూఢమగుచు నలరుచునుండెన్. 36

వ. అటుతరువాతను

గీ. అతని తనువున చందనంబలఁదె శౌరి
యందుచేతను బహుమోద మలరుచుండె
నరయ నది యుక్తమగుగాని యబ్బురముగ
దక్షిణమెయయ్యె తద్వాసనాక్షయంబు. 37

వ. పిమ్మట వివిధోపచారంబులం బూజించి మధు
సూదనుండు శ్రమ నివారణంబుకొరకు, వ్యజనవీజనం బొన
ర్చుటకు భీష్మతనయను నియోగించెను. 38

దానును స్వప్రశ్రయంబుగా గుశలప్రశ్నంబు గావించెను.

గీ. అటు వీచుచు రుక్మిణి యట్టి ద్విజుని
గడకపూజించె సహజానుకంపచేత
అటులనెటులగునన విస్మయంబుగలుగ
దతడు ద్విజరాజు సదయయా నామెలక్ష్మి. 39

గీ. గురుకులమునుండి వచ్చినతరి సమాన
యగుసతింగని పరిణయంబైతివె! సఖ!
భర్తమను తగని సతినిముందె పరిణయమయి
పిదవఁ తమిఁగాంతు క్రొందరు పెక్కుసతుల. 40

వ. ఇవ్విధంబున నన్యాపదేశంబుగా శౌరి పరిహాస వాక్యంబులు బలుకుచున్నతరిని—కుచేలుంజూచి రుక్మిణి దానిట్లనియెను. 41

వ. ఓ ద్విజరాజ! యత్యంతంబనురూప ఘటనా ధురంధరుడగు నవ్విధిహాతకుని స్వభావంబును బాగుగా నెరింగిన యార్యపుత్రునిచేత యుక్తంబుగనే యడుగబడినది గదా! అది యుక్తమేయైయున్నది! 42

ఉ. ముందుగనేనె నేననుచు బొందిన వేడుకగల్గు భూమిభృ
ద్బృందము లొందగోరు నృపభీష్మకనందన నెంచిచూడహా!
పొందొనగూర్చుఁ జోరతనుబూనిన గోపకుతోడ దైవమే
మందుఁ బ్రతీపమౌగతినయా రెయొకానొకమారుభూసుర్హా

వ. ఇట్లు వలుకుచున్న ప్రియురాలింగూర్చి దామో దరుండు మరల సకపటంబుగా నిట్లనియెను. 44

వ. ఓ తపస్విశిఖామణీ! యిట్టి లోకస్వభావంబును దెలిసికొందువుగాక. 45

గీ. రూపవతిగాని సతినైన రుక్మిముఖులు
బందులని లోభమున కొందరందుచుండ్రి
దనరు ప్రద్యుమ్నలాభంబు దక్క వేర
ఘనసుఖమెరుంగ మీయమె సాంగత్యమునను. 46

వ. వాసుదేవుండిట్లు బలుకుచున్నతఱిని భగవతియగు రుక్మిణి మరల దానిట్లనియెను. ఓ తపోధనసార్వభౌమా! యిది కేవలమును బురుషులకే కాదు కాంతాజనంబులకును నిదియే స్వభావంబుగదా! 47

గీ. నతిజగద్విభుడనునాశ సతులుబొంద
రూఢి వరియింత్రు వస్తువిరూపపురుషు
గనగవిషయోపభోగ సౌఖ్య మిటలేదు
దొరకె సద్భక్తమాత్రి సంతుష్టిఫలమె. 48

వ. పిమ్మట యదునందనుండు మరల వస్తుగతి నుపపాదించుచున్నవానివలె రుక్మిణీ వదనంబుజూచి సకపటంబుగా నిట్లనియెను. 49

గీ. నయత, నేబాల, బాలిశానన్యజన్ము
వృద్ధినొందింపజాలక వెలయుచుండె
సారది నామెను గోరిన సొగసుకాని
భోగలౌల్యమలీకమై పుడమినగును. 50

వ. పాణివల్లభుండిట్లు పలుకుచుండ రుక్మిణి సవ్యా
జంబుగా నిట్లు మారుపలికెను. 51

వ. ఆర్యపుత్రా! నీచేత యుక్తముగనే పలుకబడినది
గదా! కేవలంబుగ కమనీయ పురుషునకు మాత్రమే విషమ
యోషిద్భవ విషాదంబుగాదు! రూపవతులగు కామినులకుం
గూడ ననురూపవల్లభలాభంబుచేత గలిగెడు ననుతాపం
బును నట్టిదేయగును. 52

గీ. దృక్కుచే శాంతినొందియుఁ దిరిగి కామ
గరిమయుదయించు నెవతిచే గనగ నట్టి
తన్విగలిగిన వృషవివర్తను వెలయు
వానికెట్టిది జన్మసాఫల్యకలన. 53

క. బరగ పరస్పర పరిహా
సరుచింగొని స్మేరవదన జలజుల నయ్యు
ర్వ్యరలీలను సుశ్రీయుః
శరనిధి యతడపుడు గనియె సంతసమెనగన్. 54

వ. ఇట్లయ్యరవిందలోచనుండు కొంతకాలంబు ప్రేయసీ
పరిహాస సుఖంబు ననుభవించి కుచేలుని మరల నిట్లనియెను.

చ. పెనగొని వాకిటన్ నెమరువేయుచునుండెడు లేడిపిల్లలన్
గనుగొని మేమెరుంగనిదె కమ్మనిభక్ష్యమ దెద్దియంబిరో
దినునిది యంచుబాలకులు దీనతమాకును బెట్టుమంచనన్
వినీ...హారి ముద్దుగొని వేట్కసుఖించితివేద్విజోత్తమా

వ. తలంచుకొనియెదవా! కుచేలా! గురుకులంబున నున్నవారమై మనమచ్చటి యామునీయపులినంబులందు ముష్టాముష్టి బెనంగులీల నొనర్చితిమిగదా! మరియును నిది యును నీవుమరచితివా! 57

గీ. ఫలములను గొనునిచ్ఛతో బయలువెడలి
మనముచూతము దరిజేరి మసలుతరిని
పరభృతముగాంచి రాముడు బలికెనిటుల
మేము నీవంటివారలమే యటంచు. 58

గీ. ఇదియు దలచితివేనీవు నెలమిమీర
గహనమున మనమావుల గాచినాము 59

వ. అంత మందహాసంబు సేయు రుక్మిణిం గాంచి శంకించుచు

గీ. గురుల శుశ్రూష సలిపెడు నరుల కెన్న
దురితకార్యమొనర్చినన్ దూషణంబె. 60

వ. ఇవ్విధంబున వాసుదేవుండు బలుకుచున్నంత, లోకమర్యాదం దెలుపుదానింబోలె రుక్మిణి సకపటంబుగా నీలీల బలికెను. 61

క. గురుధేనుల తమధేనుల
నరయుచుఁ గాసినను దూషణాస్పదమదిగా
దిరవుగ పరధేనులగొని
పరిపాలన సేయు టార్యవర లక్షణమే. 62

వ. భగవంతుండగు శౌరి, ప్రేయసీ వచనంబులను విననట్లూరకొని మారువలుకక యే వయస్యా! కుచేలా! సఖుండనగు నాకొరకెద్దియైన నుపహారంబు దెచ్చితివే! యని పలుకుచునే జీర్ణచేలాంచలంబున గట్టబడియున్న ముష్టి పరిమితంబగునటుల నటుకులను గ్రహించి భక్షించెను. 63

గీ. అట్టి పృథుకంబులందల యమృతరసము
కన్నమధురత శౌరికి గల్గెనెన్న
నతని సేవకుడునుగూడ నమృతమొందు
పృథుకతతి దుర్లభంబయ్యె ప్రియకునైన. 64

గీ. మరల గ్రహియింపగోరెడు మాధవునట
వారణమొనర్చి రుక్మిణి బలికెనిటుల
సర్వసంపద యీవిప్రసత్తమునకె
యిచ్చునెడ నుగ్రసఖునకేమిచ్చెదికను. 65

వ. అపుడు కుచేలుండు పురందర మందిరంబునందుం బోలె నమ్ముకుందుని గృహంబునందు నిఖిలసుఖంబులను భవించి యారాత్రి నచట గడిపి మరునాడరుణోదయంబుననే, మిత్రధనంబు నించుకేనియుం బడయకుండినను హరిసమాగమంబునే భూరిలాభంబుగా దలంచుచున్నవాడై తదనుజ్ఞవడసి నిజనికేతనాభిముఖంబుగా బయలువెడలెను:—మరియును దన మనంబున నిట్లు జింతించెను. 66

చ. పరగ నదీను డెన్న మద భాక్కి తడంచు దలంచియేమొ యు
బ్బురమగునట్టి జీవనము భూరిదురాపమొనర్చె, గాని చో
గరిమను మీరు సద్గతిని గాంచుటదెట్లగు నల్లయూ సురీ
పరిగత సంపదుత్కరము వాయుటదెట్లగు నెంచిచూడగాన్

వ. ఇవ్విధంబున జింతించుచునే, నిజసదన ప్రవేశంబు నొంది అచ్చట నిదేమి, యీభవన మెవ్వరిది. రెండవపురం దరుని మందిరంబువలె నున్నదే! యనుచు యదార్థంబును దెలియజాలక కుచేలుండు పరిభ్రమించుచుండ చెలికత్తియ లతో నెదురుగావచ్చినట్టియు కరుణతో గూడుకొన్నదియు హరిచే నొసంగబడినట్టి సంపద మూర్తీభవించినదో, యను నట్లలరుచున్నదియు నగు ప్రియురాలిచే నతడు నిజగృహంబు నొందింపబడినవాడై, తనమందిరంబునందానంద బంధురుండై బంధుజనంబుతో గూడ సకలసుఖంబు లనుభవించుచు సుఖం బుగా నివసించియుండెను. 68

—• రాధామాధవ వివాహాది కథా వర్ణనము. •—

గీ. వత్సములదాచు నపరాధ భరముదొలగ
రాధయను రమణీమణి రహినొనర్చి
బాలికను బడయగగోరి పరగు సింహ
ళాధిపతికిచ్చె వరముగా నజుడు మెచ్చి. 69

వ. తరువాత నట్టి సింహళాఖ్యద్వీపాధిపతియగు విజ యవర్మ యనునతండు యావనంబుగలిగి వెలయుచున్న తన

తనయ కనురూపవల్లభుంగానక దూయమాన మానసుండై యుండుటెఱింగి కమలాసనుండతనికి స్వప్నదశయం దీరీతిగా నుపదేశించెను. 70

గీ. రాధికను మురవైరికారాధికగను
జేసినాదగు నిర్మాణ కౌశలంబు
సఫలమగునట్టిదానిగా సలిపి పిదప
ధన్యుఁడవుగమ్ము నృపచంద్ర! ధారుణీంద్ర! 71

వ. అటుతరువాత నట్టి విజయవర్మయును నదియే సర్వసంపదలకు నిదానంబైన దానిగా దలంచుచున్నవాఁడై దామోదరుంబిలచి మహోత్సవంబు గావించి యారాధ నతని కర్పించెను. 72

వ. తరువాత భగవంతుండగు శౌరియును సాపరాధుం డగు విధిచేత పూర్ణపాత్రభూతంబుగాఁ గాన్క గావింపబడి నట్టియు సౌందర్యంబున కధిదేవతవలె వెలయుచున్నదియు, నిందుకళరీతి వృషాకపిశిరఃశ్లాఘన యోగ్యయగునట్టిదియు స్వరుచి ప్రతిబంధకత్వంబుచేత కమలానభిమతయును దేవ సేనవగిది సుకుమారలోభనీయయు నగునట్టి రాధికను విశ్వ కర్మనిర్మితంబై కైలాస విలాసంబును నవ్వుచుండుదానివలె నలరు నొక యంతఃపురంబునఁ బ్రవేశపెట్టి యామెతోడ గ్రీడించుచుండెను. 73

ఉ. ఓరిమినొక్కశోభన ముహూర్తమునన్ జెలులెల్ల వేడుకన్
మారకలాస్వతంత్రుడగుమాధవుగేళిగృహంబుగూర్చియా
దోరముజేర్చిరా నవవధూమణి రాధికనెట్లొ వంచనా
ధీరగభీరవాక్యములు దెల్పుచు నేర్పనమీఅభామినుల్.

గీ. మేలుగా విశ్వకర్మ నిర్మించె నీదు
రమ్యలీలాగృహంబిదె రాధ! గనవె
రమ్మిగనుగొంద మిష్టవరప్రదాత
యైనమనసిజదేవుండు నచటగలడు. 75

గీ. అచట కేళీగృహంబున నాడుకొంద
మందు హరిలేమి శంకనీవొందవలదు
ఘనతరాపూర్వసుఖమును గాంచియపుడు
నన్ను హితకారిణిగ మదినెన్నకొనెదు. 76

గీ దీనిసౌరభ్యమేమని దెల్పుదిట్టి
హరినివాసంబు త్రిదివంబటంచు దలతు
సురతనిరతికి నిష్టంబు నెరపునట్టి
వరసుదృగ్జనమునకె లభ్యమగునిదియు. 77

వ. ఇవ్విధంబగు వచన వంచనావశంబున నెట్టకేలకు
రాధిక కేళీమందిరాళిందంబు నొందింపబడునెడల. 78

మ. చెలిచేవంచితయానొ! రాధ, గనునోచిత్తంబునన్‌వంచనా
కల, నట్టైనను నమ్మకంబెపుడు గల్గంబోదు త్రాజాణయో!
చెలి, యారాధికముగ్ధయో! విధివియాచేష్టల్‌బలిష్టంబులం

చలరంబుట్టిన శంకలెల్ల నణగెన్ హా శౌరికిన్ రత్నమం
జులమంజీరకశింజిత ధ్వనులచే శోభిల్లగా నయ్యెడన్. 79

సీ. నంతలోన బుధుండగు నాత్మభవుని
పాండితియు దా విజృంభించి ప్రబలుచుండె
నానర సర్వజ్ఞుడును పురుషోత్తముడగు
నిజగురునికైన మోహంబు నెరపుకతన. 80

అటులనేయగును.

—• శ్రీకృష్ణుని కేళీవినోదము. •—

గీ. స్తంభమున పూర్వమే హరి సంభవించె
నట్టిహరియందు స్తంభంబునయ్యెనిపుడు
బరగునరహరి బాడము స్తంభమునకిదియె
యగువిలక్షణ మానరహరియతండె. 81

గీ. ఎవనియాజ్ఞను ప్రళయమా నట్టిహరిని
సారదియాకస్మికంబయి క్షోభపెట్టె
నదియెయుక్తము హరి కలంఘ్యముగ నగుట
లలితమదనప్రపంచ ప్రళయమువేసు. 82

గీ. హరికిమితిమీరె ప్రీతిలోమహర్షమపుడు
చిత్రిబుదిగాదు జూడగా జెలువుమీరు
నంగనాజన సంగమ మందొకపుడు
నట్టి హర్షమ ననుభూతమగుటవింత. 83

గీ. శౌరికలస్వేదపూరంబు జారెమేన
నడ్డులేకయె యద్దిగాదబ్బురంబు
సార్ద్రిడీ విధుడప్పుడవ్యవధిగాగ
గోరెరాధాపరీరంభ గుంభమరిది. 84

గీ. కెరలెడు సమగ్ర వేదియా కృష్ణునందు
గూడబోడమె వివర్ణత జూడనపుడు
వసుధ నలగాగ్రిమ్య ధర్మప్రవణుడెవండు
రహీనను త్తముడును వివర్ణతను గొనడె. 85

గీ. అచలసంస్థితి గదలింప నర్హుడనగు
దేను హరికిక యశమది యెట్టులగును
అనుచు మదనుండు త్రిజగంబులాక్రమించు
నట్టి జగతీధరుని గంపమంద జేసె. 86

గీ. హరికి గన్నులవలన ననర్గళముగ
నశ్రుధారలు జనియించె నపుడుగాన
నతనుశరముల రక్తత నంతరంగ
మొందెనోయని సందేహ మొందనయ్యె! 87

గీ. హరికి వైస్వర్య మయ్యెడ నయ్యెనదియె
యొప్పునెప్పుడు కనివినియుండ మెచట
బాల్యమున పరపుష్టతన్ బరగెనితడు
సరసరాధాగమావాప్త సమయమిదియె. 88

వ. ఇవ్విధంబున మురారి పరిభూతంబుగా సముద్భూ
తంబగు సాత్విక వి॰॰౦౦ంబుల నొందియున్న తరుణంబున

సర్వాంకషంబగు విషమసాయకశక్తింబోలె వెలయుచు విరహతాపనిపత్రికయగు నమృతవర్తికవలె నలరుచున్న యారాధిక నాళీజనంబులు కేళిసదనంబునందు ముందుగాఁ బ్రవేశపెట్టి పిదప స్వయముగా నటు దాము ప్రవేశింపకయే కవాటంబును బంధించి సత్వరంబుగా దొలఁగి చనిరి. 89

చ. స్మరగురుఁడో మురారినటసయ్యనముంగిటఁజూచి మోమటుల్
బరపి కవాటపాటనము బల్మినిసేయ వృథాప్రయత్నమై
వరలుచు రాధయెట్టిటో నిబంధమ బూనెమురారికాశయ
ట్లరయవిశృంఖలంబగు ననంగుని ప్రక్రియచిత్రమౌఁగదా.

గీ. తలుపుగడియనువైచియు తరుణిపాణి
గనిబలాత్కారముగను చేకొనియు శౌరి
యూమెలాభము మదినమ్మఁడయ్యె సంగ
సముదితాకంప సంపద్విశాలుఁడగుచు. 91

మ. అలకేళీభవనంబు సాదరముగా నాళీజనప్రార్థనన్
కలయంజేరి యతర్కితంబుగను నాకంసారినింజూచి ని
ర్మల సమ్మోహితమైనయానవవధూ రాధాసతిన్ బ్రేమచే
కలితాంకంబును జేర్చినూత్నమగుసాంగత్యంబునన్ మంజువా
క్కులసానందగజేయునాహరిమమున్ గూర్మిన్ సదా బ్రోవుతన్.

అది యుక్తమేయగును.

బాలిక లోలాలకనీ

ళీవిరహమున ముదమునందకయే యుం

దేల భవద్దాసుడనా
జ్ఞాలోలుడ నీదుపనులు జరుపగలేనే. 93

మ. సతిరో చేడెలతోడగూడుకొని యతుకక్రీడగావించి గో
రితివేనిన్ మరియొక్కగుహ్యాతమహారీతిన్ త్రిలోకాదిస
న్నుతమాద్యూతమునాలకింపుమతనుండున్నాతిషష్టాతుముల్
తతినాడంగనుసాధనంబులగుసోత్కంఠత్వమున్ శ్లాఘ్యతో
న్నతిరమ్యాబలపాళికొప్పుబరమానందాస్పదంబౌనిదే. 94

మ. పొలతీతత్తకుచంబులన్ విధుకరంబున్ గూర్తునా లేక శీ
తలసంస్పర్శమునెల్లదేహమున నొందంజేతునా యాగ్రిహా
కలితంబై తగు నంబరంబిచట నాకర్షింతునా యీవిధున్
బలితోరుద్యుతిచుంబిబట్టిమిగులన్ భవ్యాత్మగా సేయుమా
పలుకంగావలెనీకుగావలయు సేవల్ వీనిలో నెద్దియో. 95

ఉ. ఇంపుగ గుహ్యమేనుప్రకటించెదనీకు సుఖార్థమియ్యెడన్
సొంపుగనుండె కాముడిట శోభనదైవతసార్వభౌముడై
బెంపునుగాంచుధీరుడును భీరువశంవదుడౌను నాతియున్
దెంపుగఁబూరుషాయతిని ధీరతనొందునువానిపూజచేన్.

వ. అదియునుంగాక నీ వసాధారణంబగు నతని యఘు
టిత ఘటనాకౌశలంబును దెలిసికొందువుగాక! 97

వ. ఈమీాన కేతనుండు త్రిదశుడయ్యును ప్రకాశిత
దశవిధదశుండును, ననంగుడయ్యును సుతనులోభవీయుండు,
భవవిరోధియయ్యును సంసారసారంబును, పరిత్యక్తష్ణే

డయ్యును సరతియును, స్థాణువిరోధియయ్యును తరుణోపాస్య మనదగువాడును, మధుప్రియయ్యును, కృతసురావర్జనుండును, వసంతమిత్రుండయ్యును, బుష్పసమయంబున శర ప్రహారంబొనర్చువాడును ననన్యజుండయ్యును, మనోభవుండును, రతిభావ్యుండయ్యును, విరతిభావ్యుండును, కుసుమైక సాయకుండయ్యును, బల్లవపక్షపాతియును, సుమనోబాణుండయ్యును, సురతావిరోధిబాణుండును, శంబరవిరుద్ధుండయ్యును, దానవారిచే బ్రిసిదుండును, నష్టమూర్తియయ్యును, ననష్టమూర్తిప్రణయుండును, నిర్వాణకారణీభూతంబగు యోగాభిలాషకు జనకుండయ్యును, మోక్షపరిపంథియును, నప వర్గంబువలె భవవిరోధియును, హంసంబువలె మానసావాసియును, శిల్పకునింబోలె శూర్పకారిత్వంబుచే ప్రసిద్ధుండును, వైనతేయునింబోలె సుమనోదుర్లభంబగు నమృతంబును సంగ్రహించువాడును, కృతాంతుని పగిది యోగావలంబిజన యాతనోత్సకుండును, మాంత్రికునిచందంబున కామినీగ్రహావ్యాకులిత పురుషోపాస్యుండును, దివాకరునికరణి నతి రక్తరుచి విషయుండును, హరుని తెఱంగున నున్మత్తప్రియుండును, జీవన్ముక్తుని కైవడిని నిరంతర ప్రమదాశ్రియుండును, పవనుని భంగి భోగిజీవనాషధంబునునై, కృపణునికింబోలె చంద్రునికింగూడ గురుస్పృహను బుట్టించువాడును, యాతుధానునికింబోలె పురందరునికింగూడ తాపసక్షేత్రదూషణబుద్ధి నొదవించువాడును, భగవంతుండును నగునట్టి మకరధ్వజు నుపాసించి సంపన్నప్రియావాప్తి గలవారలై సకలభోగంబులనుభవించుచుందురు.

వ. అటులనే యగును. తదీయమంత్రంబునకు మాంగళికంబగు నిట్టి సుముహూర్తంబున నీకుపదేశింపగోరుచున్న నావచనంబును నీవు నమ్ముదువుగాక! 99

క. తెలిపెద మంత్రమునియ్యెడ
నలవామాచారనియ్య మదినగ్నతయున్
లలినిప్రోచ్ఛిష్టమధూ
జ్జ్వలపానము లిచటయంత్ర సాధనములగున్. 100

చ. అలమధురంపుచాటువచనావళిచేత తదర్థమెంతయున్
దెలిసి స్మితాననాబ్జయగు ధీరతినాప్రియురాలి గాంచియే
లలదధరామృతంబుగొనలాలసుడయ్యెమురారి మోహియై
బాలుపుగనీతడాయమృతమున్మును మొందుగ గ్రోలకుండెనో

క. హరిముద్దుగొనెప్రియాముఖ
మరయ సుధాకిరణబింబమగునదినిజమే
కరకంపము మందంబుగ
నెరప మహోజ్జ్వలరసంబు నీటుగనగుటన్. 102

వ. పిమ్మట యదుపతియును ప్రియసతీ బింబాధరపాన లాలసుండై కమనీయంబగు చాటువచననిచయంబును వచించెను. అటులనే యగును. 103

క. అరయగ ప్రియ! నీయధరము
పరిభూతామృతరసమని పలుకనివారె
వ్వరు ద్విజరాజతిరస్కృతి
బరపెడు నదియమృతవృద్ధి బడయకయున్నె. 104

గీ. అబ్ధిమథనంబునందగునచ్చసుధను
నజుఁడుభవదోష్ఠమున నిల్పెనగుటఖ్యాతి
మయ్యె నధరామృతంబిదియ! తగుకలుష
భాగమునుగ్రోలిరమరులు బహుళకృతాశ! 105

గీ. సఖియ! శశిరూపమై నీదుసర్వముఖము
దగ, నధరరేఖయె మరింత మిగులమృదుల
మయ్యె, నేమను, నాశంకయణఁగెనిపుడు
చంద్రరేఖనెసొగసొందుసొంపుదలచి. 106

గీ. అరయఁగసువర్ణమాత్రప్రాప్తికైనదదియు
వసుధదుర్లభకళ్యాణ పాత్రలబ్ధి
కైనదిదియును సఖియ యయ్యమృతమునకు
ద్వదధరమునకు నగు తారతమ్యమెంత! 107

గీ. రమ్యతరనేత్ర! నీయధరంబు గనఁగ
మధురమధుకోశమే యగుమరియునిద్ది
చిరము తిర్యగ్విహితమయ్యె జెలిమినెటులొ
దరుచు పరనరపేయమై బరగుచుంట. 108

క. శతపత్రముకుళకుచ! నీ
హితమగు మోవిద్విజవాస మే! యగునిజమే
యతిసిక్తమయ్యెను సతతా
మృతసేకమువలన రాగ మెనయుట చేతన్. 109

క. ముదిత! భవదధరము ద్విజ
చ్ఛదమేనిశ్చయము తద్విజముగరుడుండౌ
నదియటు హరియే హరియిం
ప, దగునవామృతము గప్పిపట్టుటచేతన్. 110

క. హరినీలసులోచన! త్వద
ధరమెన్నగ పనసఫలమెదగునది దినునా
నరునకు దొలుతనుకంటక
భరమును మృదులతనుపిదప బ్రకటించుటచేన్. 111

క. నీదైనమోవిద్రాక్షయె
గాదగునాసత్యవచన గతుడనగదుడన్
నాదగు తాపమెడలనా
స్వాదనసాదరుడనగుచు వలచుచునుంటన్. 112

గీ. వసుధ ద్విజనింద్యమగుబింబఫలమదెట్లు
మగువ! నీమోవితోడ సమానమగును
సతత శుచితను గొనుసద్ద్విజపద్ధాన
తతి, స్వరుచి మోవిపైనించి తనరుచుంట. 113

గీ. ధరయెచటలేదొ యదియ యధరమటంచు
నలరెడు సువృత్తి నధర శబ్దార్థమయ్యె
నచట నవఖండసార రసాశ్రియత్వ
మిదియెటులగానబడుచుండె నిట్టులబల! 114

గీ. తగునజర్థము దా విరోధమునకు నగుట
త్వదధరమగు ఘనాఘనేంద్రవరుడిదియె

సరిగవిశ్వంభరాహ్లాద ఝురులుగాగ
నమృతధారలు వర్షించు ననిశమబల ! 115

గీ. మానినీ ! మోము దమ్మిపూదేనికప్పఁ
బలువెలుగు కేసరములచే బరివృతమును
నై చెలంగును నీదు బింబాధరంబు
కృష్ణ మధువారిగ్రోలగాఁ దృష్ణనుంట. 116

గీ. సరసముగబాల యలసురసాలసాల
కలితపల్లవమగు నీదు కావిమోవి
గానిచో పరపుష్టతన్ గ్రోలు నీత
డేలనిట్లుగ్రోలఁగోరు రసాలసాంగి ! 117

గీ. పత్రికట పరిశుద్ధమౌ ద్విజవాసమగుచు
గ్రోలు నీయధరోష్ఠంబు గాననిచట
నమృతమదిగోరు నిర్వాణ మగునటంచు
నువిద! సుకృతేష్టియగు పురుషోత్తముండు. 118

గీ. అమృతమును జుఱ్ఱఁగలవిధు డతడుగూడ
గోరునీయధరమునది గొప్పగాదె
యట్టిసత్ప్రతి సౌమనస్యప్రదునకు
మోదమిడు సురతాసక్తి బొదలియున్న. 119

గీ. మోహితులకగు, నధరంబు స్నేహపాత్ర
మచట భ్రమమాత్రమూలమే యగుమధురిమ
యనిమగువకావిమోవి దియ్యందనంబు
గ్రోలజాలని బాలిశుల్ ప్రేలుచుందురు. 120

గీ. అలరెడు సుధాంధువగు భవదధరమెలమి
నిపుడు గ్రోలుదు నదినీకు హితమె యబల!
నిరతముసతృష్ణులు గ్రహింప మెరయుచున్న
రసమె మధురతగాను నన్యరసము గానదు. 121

గీ. అధరమిది దంతవాసంబె యగుటనాదు
రదముపద మొందుటది యపరాధమగునె!
తనపదముగాని కుచమున దవిలియుంట
నఖము వారింపదగినదే సఖియ! వినుము. 122

గీ. ఇటుల పలుమరు నుతియించి యింతమాత్ర
మునను నీకగు హానియేమనుచుఁబలికి
ప్రకటముగ నటువంచనావచనరచయ
చతురుడగు హరి చుంబించె సఖియమోవి. 123

అధరవర్ణనము సంపూర్ణము.

—• కుచవర్ణనము •—

గీ. ప్రియతమాకుచకోక సంప్రీతికరుడు
నధికృతామితరుచి కమలాప్తతముడు
జలజబాంధవ కరమును చాలనంబు
జేసెనపుడు సముద్గతి జెందెనదియు. 124

గీ. బాల! యెరుగవు స్మరదంతి పదములఁగతి
రమయుఁదొడలందుఁ గరమునురమునఁ గుంభ

యుగమునిడి వరుస నన ర్ఘ్యముగఁ దక్క
మార్గిమించును శరణొందు మారినిన్ను. 125

గీ. దానిచే నిప్పు పరవశతను భజింతు
వగుటశుభమగులీల నీహారినఖంబు
చేత గుంభయుగంబును జీల్చునపుడె
యెంచెదవునీవు నామాట హితము గాదు. 126

గీ. అతివ నీదు రవికముడి యనెడుమిషను
తీరుగా మారుడనియెడు ధీవరుండు
దండమునగట్టు నలకుచద్వయము పేటి
కాయుగమమున్న మీనతగాంచు నేను
నచటబద్ధుడ నై లౌల్య మందితహహ. 127

గీ. వనిత! నిర్వాణహేతువ వలననీదు
తనువున రతీశదేవుని దగబ్రతిష్ట
జేసి కుచయుగమనుమిష జెలువుమీర!
కోరిసౌవర్ణ పరిపూర్ణకుంభయుగము
నుంచెనాగమవేది విరించి యచట. 128

గీ. అరయ హృదయేశయుండగు నట్టిమరుని
రాజితాంతఃపురంబగు రతినిగాంచు
కంచుకులె నీదు కుచములు గాన నాదు
బాహువులు దండములుగాగ బరగుదండ
రహితుడెట్లగు కంచుకి రమణి వినుము. 129

గీ. నగముతోఁడను నీకుచయుగమునకెటు
సాటిజెప్పెదరో మూఢజనులు వజ్రి
మచట నిజభూషణంబయి యలరుగాన
నగభరిభవంబు గలుగుట కగునె శంఖ! 130

గీ. కుచములనియెడు మిషమున కోకయుగము
హృదయభూషగ విధిరచియించెగాన
మహితపద్మాప్తునికరాభి మర్శ మొంది
యదిశుభంబును గొనుచుండు నబల! వినుము. 131

గీ. సఖియ నీతను లావణ్యఝరిగ్రహింప
కుచయుగంబను మిషవిధి కుంభయుగము
కరయుగళిచేత ముంచెను గాన నేను
హస్తయుగమున వారింపనైతినేని
యబలయని నిను వంచించి యతడుగొనును. 132

గీ. పూర్వకంచుక మెడలించి వాల్చుక్రొత్త
క్రొత్త కంచుకములుదాల్చి కొమరుమిగులు
నీదుకుచభోగులకు నెట్లు నిర్వృతియగు
స్పర్శనప్రాప్తిగలుగక సఖియవినుము. 133

గీ. మహితలావణ్యసాగరమందు మగ్న
మైన మైనాఖగిరిశిఖరాకృతులయి
యలరు నీదగు కుచముల నతివ! యుభయ
ముగ నతనిఁ దలనుంచెద మోదకరము
నాదుకరమును హరినోట నయముమీర! 134

గీ. నాకుఁగోకమునకు చక్రినామ మలరు
నదియె తమస్వామిభావంబు నలరఁదెల్పు
జన్నులను మిషచేనున్న చక్రియుగము
చేకొనఁగ నను వారింతు చిత్రముగను. 135

గీ. ముగ్ధరో! దుర్గమొనరింప మొనసినీదు
కుచగిరుల్ గాన మరుడిట కుల్కుచుండె
నితనికిభయంబుకొరకు నేనిప్పుడునీదు
కుచశిరంబుల నఖమున గూర్తు నర్ధ
చంద్రము గిరీశభావంబెసంగునటుల. 136

గీ. సఖియ! నీహృదయమున రసాలసత్వ
మరసి దీనిఫలమ్ములే యనుచు మరుడు
నీదుకుచములు గ్రహియించు నిజమునాదు
వెలయుకరముల కంటకవేష్టితములు
గాగ నొనరింపవలయును కంబుకంఠి. 137

గీ. ఉష్ణతరహృదయేశయయోగమదియె
నీకు సంతాపహేతువై నెగడుచుండె
నలరచల్లని హృదయేశయాస్తినిడుదు
నీకు నిర్వృతియగుదాన నిశ్చయముగ. 138

గీ. ఇంచుకైనను మరియునికేమిగోర
కొలదిగస్పృశింతు శైలాఖ్యకుచయుగంబు
దానసాధింపదగునది తరుణి! వినుము

గిరియొకటి బూనసెంతో సత్కీర్తిగలిగె
ద్వయమును వహింపనిక నెంతదగునో కలికి. 139

గీ. ఇటుల మురహారి సవినయనటనసల్పి
కడిమి నెన్నియొ చాటువాక్యములు వలికి
కుచయుగము ముట్టి మరిమరిగోనబుమీర
చుంకృతిదలిర్ప చుంబించెసుదతి మోవి. 140

గీ. కడునసల్పశిశిరకరకల్పతల్ప
మునను బాలెణసమాన రాధనిడి నీవి
మోక్ష మొనరించుటకు మాయిమోక్షదాయి
హరి, మతంగజముఖపూజనపుడొనర్చె. 141

ఉ. అంబుజనేత్రి! తెల్లనగునంబరమున్ విడుమిప్పుడల్ల పీ
తాంబరసక్తిబల్ సుఖము నందగ గోరితి వేని తద్గుణా
ఘంబువచింతు గోప్యమున గాత్రలెడు శ్రోణికుచోరుచాగుమూ
లంబులనిష్టనేత్రి సఫలత్వము బల్ సుకుమారతాప్తి సౌ
ఖ్యంబురుచిప్రకర్షమును హాయిగ శ్రేయము లెన్నియోదగున్.

క. వనిత! త్వదీయమకూలం
బుననే నామన్నముడాగెపొసగ దికెచటన్
గనక నది యిమ్ములేకు
న్నను బట్టనువిప్పిచూపు నమ్మకదనరన్. 143

గీ. అతివ! యాచ్ఛాదన మొసర్తు నాకె చేత
త్వన్నిత... ు విడువుమంబరమునీవు

ముగ్ధరో! దిగంబరత్వంబు బూని శివుఁడు
ఘనజగత్పూజ్యతనుఁగాంచె వినవె! యెపుడు. 144

గీ. కలితరంభాప్రకాండంబుకన్న గజము
తొండముఁగన్న సిరిమించు తొడలునీకు
వానిని దిరస్కరించు నీవలువఁగొనుట
శోభఁగాంచునె యిచ్చట సుదతివినుము. 145

గీ. వెన్నుఁడటబల్కి నీవిని విప్పఁబూను
నపుడు కరములవారించె నల్లరాధ
యగునవర్థాతిశయమున కాశ్రయముగ
దగెసరసునకు సూక్ష్మరంధ్రంబుపగిది. 146

గీ. వాసుదేవుఁడు నిశ్శంకవలువలాగు
తరిని యీముగ్ధయెవ్వాని శరణునొందు
నాశ్రయముగొన్న నేనిపుడాపకుంట
తగదనుచునామె కడియముధ్వనియొనర్చె. 147

గీ. గట్టిగ కటాక్షశరములఁ గొట్టినదిగ
హృదినల విరోధభరమువహించునదిగ
నైన, విడుచునె మాయిసర్వాంతరంగ
వృత్తిసాక్షి యతండలభీక్షురీతి. 148

గీ. మున్నుబలినిగ్రహంబున బొల్చునంబ
రంబుగాని యాక్రమించు నాకంబుజాక్షి
యబలయది నేనుచేకొన నబలుఁడనొకొ
యనుచు తదంబరంబుదానసనయించె. 149

గీ. మఱల వలువనుచేకొన మగువదలప
మాయబలమున నతడద్ది మాయజేసె
యోగమాయి యన ప్రసిద్ధి నొందునితని
యోగమున కపటంబు దురూహమయ్యె! 150

గీ. అయ్యెడ ననంబరాలంబియైన యామె
గురునితంబముస్పృశియించె హరియతండు
నట్టిభూభృద్భవినితంబమరసినీల
లసదమృతదాయి ముట్టడేతాల్యమునను. 151

క. మరిబలుకనశక్యంబగు
సురతక్రమమల రెనపుడు చూచునతండై
దరినివసించి యసంగత
బరగెడుసుమశరుడెదాని పటుమతినెరుగుఱ. 152

చ. చిరమటువారలిర్వురును జెల్వుగఁగేళివిలాసలోలురై
యరుదుగనిద్రనొందిరి శ్రమాలసులౌట సుఖంబుమీఱగన్
మరుడును గూడజూడగశ్రమన్గొనుటన్దనవింటినుండి సు
స్థిరమగు నారినిన్ సడలజేసియు వాసిగ విశ్రమించెదాన్.

ఉ. ఊరక శౌరినిద్రగొనుచుండగ కుక్కుట తారనాదముల్
ధీరతనాలకించి సుదతీమణి రాధికమేలుకాంచె త
ద్భూరినుతుల్రచించుచును బోధకరవ్రజముల్ రయంబుగా
ద్వారముజేరి శౌరినిముదంబుగ మేలుకొనంగ జేయగాన్.

వ. వచ్చి వైతాళిక నికరంబిట్లు తారతరంబుగా బలికెను.

చ. త్వరగొనిలెమ్ము లోకపరిపాలక! కీలితతృష్ణ! కృష్ణ శ్రీ
కర సుఖనిద్రవీడుము జగంబులనేలుము రాధకిష్టుడై
తిరిగెడు నివ్విధుండితరదిక్కున, దా రుచివీడెనంచు ని
ట్లరుదుగ క్షోభమొందకమలాశయభేదమొనర్పయత్నమి
త్తరిని రచించుచుండెనుగదా ప్రమదాళికులంబదెంతయున్

వ. భగవంతుండగు శౌరియును నర్థాంతరాభివ్యంజ
నంబగు వైతాళికవచనంబు నాలకించుచునె సత్వరంబుగ మే
లుకాంచి రుక్మిణీరోష సంభావనచే విదారిత హృదయుండై
కేళీనికేతనంబునుండి బయలువెడలెను. 157

క. రాధావశీకృతునిగా
మాధవునిం దెలియబలికి మఱిరుక్మిణికిన్
బోధయొనర్చుచు సఖియలు
బాధించిరి కలుషగాగ బరుషయుగాగన్. 158

అటులనే యగును.

— • శ్రీకృష్ణుడు అందరితోను సుఖంబుగ నుండుట • —

సీ. ఎలమిం బూర్వపుభార్య లెల్లరున్ స్వవశలై
సర్వసౌఖ్యంబులొసంగుచుండ

మరికొందఱన్యలు మాన్యలై రహిఁగాంచి
తనకు భోగినులౌచు దనరుచుండ
పదియారువేల గోపాల భామలు మేన
నాలింగనమొనర్చి యలరుచుండ
నందఱిలోనఁ బ్రేమాస్పదవై నీవు
ముదమొప్ప నెదనెప్డు గదిసియుండ

గీ. నందఱికి నేకరీతి నానందమొసగి
సరసదాక్షిణ్యశాలియౌ శౌరికిపుడు
రక్తినారాధికయగు నారాధికయుట
నీకు బాధికయయ్యెనో నీరజాక్షి! 159

గీ. ముగ్ధరో! విధేయుడై హరి పొగడుచున్న
మానము వహింపుమాతని మహితచాటు
వచన రచనల వంచింపబడకు, లలిత
ముఖసరోజంబు ద్రిప్పు నైపుణ్యముగను. 160

వ. ఈ విధంబులగు సఖీజనభాషితంబులచేత రుక్మిణి ఖేదంబు నొందింపబడి నిర్వ్యాజహృదయ యయ్యును కుంకుమాంగరాగాదివిరాగతంబూని తాంబూలరసవిరసయై కుసుమమాల్యలౌల్యంబును విడనాడి కనుల నంజనరంజనంబు గావింపక విముక్తముక్తాహారయు ముక్తాహారయునై కేవలంబుగ నవనిశయనంబునందే శయనించుచు మానంబునటనఁ జేసెను.

గీ. మానము వహించి మానంబు బూని యటుల
నూనమానసమైన యద్దాని నసున
యింపె యదుపతి రుక్మిణి యిల్లు జేరె
దారఁ గృశఁ గని వివశుడై మీరె నపుడు. 162

వ. అపుడు దరికిజేరి ప్రాణప్రియురాలింగూర్చి యిట్లు
పలికెను. 163

గీ. వనిత! జంభారికుంభికుంభద్వయమున
నరయ త్వత్కుచకుంభసామ్యమని కోప
గించితివె దాని బొడిచి లభించు ముత్య
ముల సరము కుచములనుంతు మోదమిడుము. 164

గీ. ఏట్టివస్తువు గోరెద వీవు దేని
నొందకిటు చిత్తకలుషత జెందితి సఖి!
బాలలీలగ విధుఖేలలోల వైతి
వేని నీపదసక్తు గావింతు నతని. 165

గీ. సత్యభామకు నిడు పారిజాతము గని
కలత నొందితివే! నాకు గల్గదనుచు
నిపుడె కల్పద్రుమంబు నీయిల్లు జేర్తు
మృదుకరజితపల్లవ మదియె యగును. 166

గీ. ప్రాణములకన్న ప్రియధర్మపత్నివైన
నినువిడి ప్రమాదమున నన్యవనితపైని
నెనరు నా కగునేని వినిర్జితాంక

వదన, సద్విజరాజ శుభప్రసాద
మది విడిచి పాపరహితుడ నగుట యెట్లు? 167

చ. ఋతుమతివై తివంచు మదినెంచిసమాగమమొందగా నన
ర్హతగల మూడురోజులు సమంచితచారువిలాసజాల సం
గతిగాని ఖేదమొందుచునె గన్గొననీకు విధేయయామరో
క్క తెయగు కాంతతో మదిని గ్రీలు వినోదముమాత్ర
మొందితిన్. 168

చ. అనువగు రత్ననూపురసమంచితమంజులరమ్యశింజనీ
ఘనరవరంజితంబగుచు గ్రాలెడు నీదు పదాంబుజంబు మ
న్ననఁ దలదాల్తు లేతచిరునవ్వనువెన్నెలజెన్నుమీఱ మో
హనవదనేందుబింబమును హాయిగజూపుము ప్రాణనాయకీ!

వ. ఈప్రకారంబుగా కపటసహితంబులగు శపథప ర
పరలచేతఁ బ్రశంసించుచును వినయాభినయంబుల • జూపుచు
జేరియసి ననునయించి పైకి లేవనెత్తి తొడపై నిడుకొని
ధూళిం దులుపుచు శిరోరుహంబులం జక్కబరచుచు కంఠం
బునం గౌగిలించుకొనుచు కపోలంబుల ముద్దుగొనుచు నమం
దానందంబు నొందించి యదునందనుండు వాగగోచరంబగు
నొకానొక హర్షంబు నొందెను. 170

గీ. అట్టి జగదంబ రుక్మిణి కట్టి లోక
జనకుడైన తగు గోపాలకునకు మిగుల

చిరము కళ్యాణజాలంబు బరగునటుల
గోరెద మికంత కధికంబు గోరమెద్ది. 171

మ. సరణిన్ మానుషలీలచే నిటుల నీసర్వావనిం బావనిన్
గరిమన్ జేసి శుభాస్పదం బగుచు లోకానందకందంబునై
చిరకళ్యాణనికేతనంబగుచు లక్ష్మీచిత్తచోరుండునై
కరమద్దేవుడునై నవామృతఝరీకల్పంబు నాకల్పమై
ధర గోపాలుడునుం గృపాళుడును నా ధన్యున్ సదా
గొల్చెదన్. 172

మ. జగమం దేనొనరించు నిట్టియమృతాసారా ప్తి సారస్యమై
సుగభీరంబగు దీని నేరసికు డెంచున్ వేడ్కతో నంచు నే
నె గడున్ జింతను జెందనేల బరుడై నిర్మత్సరుండైనయా
భగవంతుండుగృపాళుడున్గురుడుసర్వజ్ఞుండు దానుండగాన్.

ఉ. శ్రీగిరిజాకృపారసఝరీశుభసార భవత్కటాక్ష శో
భాగురువీక్షణంబు లల భాసురకల్పలతాసుమావళుల్
గాగొని సత్కవీంద్రుడనగా దగు శ్రీనవకాళిదాసు బల్
బాగుగ దా రచించెనట పండితమానస సద్విలాసమా
భాగవతాఖ్య చంపువున ప్రౌఢిమమఘవిలాసమొప్పెడున్.

చ. శివగిరిజాదయారసవిశేషపరీతకటాక్షవీక్షణో
ద్భవతతసాహితీసుకవితారసభాసుర సుందరాఖ్య స
త్కవికృత్మమా నసారభసుధారసధారలమీరు నాంధ్రభా
గవతపుచంపునన్ వినుతిగాంచెను మఘవిలాసమున్ భువిన్.

గద్య.

ఇది

శ్రీమన్మహారాజ రాజేశ్వరీ కరుణాకటాక్షవీక్షాలహరీ పరీత
సంగీత సాహిత్య సరసకవితాచాతురీధురీణ లౌకిక విద్యా
విశేషప్రవీణ సత్యవోలు కులకలశజలధి కువలయమిత్ర
భారద్వాజసగోత్ర భగవత్కవివంశపవిత్ర సోమరాజా
మాత్య పౌత్ర వెంకటరాయమంత్రి వరపుత్ర
రామాంబాగర్భశుక్తిముక్తాఫలోదయ సకల
సుకవి విద్వజ్జనవిధేయ సోమసుందరకవి
నామధేయ ప్రణీతంబైన శ్రీమ
దాంధ్రచంపూభాగవతమునందు
షష్ఠవిలాసము సర్వంబును

సంపూర్ణము.



సుజనరంజని ముద్రాశాల, కాకినాడ.



| | |
|---|---|
| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | REHB02P 409 |
| పుస్తకం పేరు | (శ్రీమదాంధ్ర) [illegible] భాగవతము |
| తారీఖు | 9/3/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 275 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CI, B, F, 249, 251 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | pragathi |
| పేజీలు విడదీసినది | pragathi |
| స్కాన్ చేసినది | Hema |
| పరీక్ష చేసినది | sandhya |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యవలసినవి | NO |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |